శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర — ౬

# యామినీపూర్ణతిలకావిలాసము.



చెళ్లపిళ్ల సరసకవి.




PUBLISHED BY

K. G. MURTY

FOR SRUNGARA KAVYA GRANDHA MANDALI

MASULIPATAM.






2-8-0



...సరసకవి విరచితమగు "యామినీపూర్ణ తిలకావిలాస"
...రరసవత్ప్రబంధమును 1893 వ సంవత్సరమున తునిగ్రామ
...బి. గురులింగదేవరగారు ముద్రించి అందలి పీఠికలో-

...ప్రబంధములలో నెన్నదగిన యీ యామినీ పూర్ణతిలకా
...దావరి...లోని కడియమను గ్రామములో నివసించియుండిన
...కవిగారిచే నించుమించు రెండునందల సంవత్సరములక్రిందట
... ఇది ... మృదుమధుర...లతో గూర్పబడి శయ్యాపాక
...ముగానుండి కవిపండితతిలకముల డెందముల నానందింప జేయు
... కాపీ మిక్కిలి తప్పులతో నిండియున్నను స్వల్ప వైదు
...ను నా ...లది కొంత సవరణచేసి ముద్రించితిని. అయి
...ప్పటి కొన్ని తప్పులుండుటకు సందియములేదు. వ్రాత ప్రతి
...యుండుటనుబట్టి యిట్టి లోపములుండుటకు గారణము.
...ప్రతి సంపాదించిగాని మరల జాగరూకతతో కవి యభి
... సవరణచేసి మరల కొంచెము కాలములోనే
...బి యీ... కొంచెము ప్రతులనుమాత్ర మచ్చొత్తించితిని."

...ప్రకటించిరి. ఆంధ్రుల యనాదరణవల్లనో, ప్రకటించినది
...యగుటవల్లనో! పూర్వము ముద్రించిన ప్రతులే అమ్ముడు
...వలననో! సమగ్రముగా గ్రంథమంతయు మరల ముద్రణమందు
... గలుగకుండుటనుగాంచి యీ ముద్రితప్రతియు, బ్రహ్మశ్రీ
...కృష్ణశాస్త్రిగారు మాకుబంపిన వ్రాతప్రతియు, మేమిది
...దించిన వ్రాతప్రతియు, నీ మూడు ప్రతులను సంప్రతించి
... ... సంపూర్ణ ప్రతినివ్రాసి దానిని మ. రా. శ్రీ
...రుమల వేంకటరంగాచార్యులువారికిబంపి ప్రాచ్యలిఖిత పుస్తక
...ముసగల ప్రతితో సరిచూపించి దొరికిన పాఠాంతరములను
...చితిమి.

ఇదివఱకు ముద్రితప్రతికంటె అదనముగా దొరికిన పద్యములకు ముందు ‡ నీ గుర్తు ఉంచితిమి, మఱియు నచ్చటచ్చటఁ బద్యపాదముల లోపించుటవలన అట్టి భాగములు బ్రహ్మశ్రీ వేదమూర్తులైన నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారిచే బూరింపఁజేసి ఆభాగములకుఁ గుండలీకరణ మొనర్చితిమి.

అడిగినంతనే పీఠికను వ్రాసి పంపిన బ్రహ్మశ్రీ వేదమూర్తులై చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికిని ఈ గ్రంథప్రకటనకుఁదగిన సాధన సంప నొసంగినవారలకును మావందనములు.

సారస్వతాభిమానులయొద్ద నింకఁ బాఠభేదములుగల ప్రతు లున్న యెడల మాకుఁబంపిన ద్వితీయముద్రణమున వానిఁ జేర్చెదము. మఱియ నిట్లు ఉత్తమ శ్రేణికిఁజెందిన యముద్రితశృంగారప్రబంధములను దమయొద్ద నున్నవానిని మాకుదయతో నొసంగిన వానిని బ్రకటించుట కెల్లప్పుడు సంసిద్ధులము.

పాఠకమహాశయులు, మాకృషికిఁ దగినంత దోహదము నొసం మాచే నాంధ్రవాణి నర్చింపఁజేయుదురని తలంతుము.

ఇట్లు

వ్యవస్థాపకుఁడు

శ్రీమత్పరదేవతాయైనమః.

# పీఠిక.

## యామినీపూర్ణతిలకావిలాసము

అనఁదగు యీ ఆఱాశ్వాసముల ప్రబంధమును మా పిన్నముత్తాత గారు రచించినట్లు దేవీభాగవతప్రథమస్కంధములో నుద్ఘాటించియున్నాఁడను,

(1) సీ. పెట్టఁగ బింగళిఁ గద్ది ♦ పేరు చెండినవాఁడు పిన్నముత్తాత నరసన్నగారు

(2) మ. అనఘుం డీ మదనాభిరామచరిత ♦ వ్యాదిత్రిచారిత్రముల్
జనసత్యవ్యక్తిగ వెంకటేశ్వరవిలా ♦ సమ్ముల్ దగం జెప్పి రా
మున కర్పించి జగమ్ముఁ గన్న మహిమన్ ♦ ముమ్మాటికిం గొల్తు నా
పినముత్తాత జగన్నపుణ్యనిధి వా ♦ ర్ధి న్నారసింహాఖ్యునిన్.

అయి యీ తుదిపద్యములవలన మా ముత్తాతగారు మఱియొక ప్రబంధముగూడ రచించి రని తెల్పినట్లయినదిగదా? ఇవి రెండుమాత్రమే కావు,

(1) అహల్యాసంక్రందనవిలాసము. (2) ఏకాంతసేవాకలాపము.
(3) ఏకప్రాసకందగోపాలశతకము.

అను మఱిమూఁడు పొత్తములుగూడ మా ముత్తాతగారు రచించినవి వారి స్వహస్తలిఖితములు నేను దిలుకించుట మాత్రమే కాదు మఱి చామర్లకోటలోఁ జదివిన నా దినములలోఁ గాగితములమీఁద వ్రాసికూడ నుంచితిని, కానియివికూడ పదిమూఁడునుసత్కృ అంతరించినవి. అంతరించిన గ్రంథములలో మొదటిగ్రంథమును యక్షగానములు. సేవాకలాపము మాయూరి జనార్దనస్వామికి సంబంధించినది. భవతు ఏకవిగాని యొకటి ప్రబంధము వ్రాసి విరమింపఁడు. ఏవో మఱికొన్ని వ్రాయుటే అనుభూతము కాని కవి పేరు నిల్పునట్టిదిమాత్రము మారవనలో నేఁడొకటిమాత్రమే

యగును; కవితాసంతానమునకే కాదీస్థితి, కేవలసంతానమునకుఁగూడ సమన్వయించుకోఁ దగ్గదే. ఈయామినీపూర్ణతిలకావిలాసమువల్లనే మా ముత్తాతగారికిఁ బేరువచ్చినదని జనశ్రుతివల్ల నేను నాబాల్యమునందే తెలిసి కొంటిని. నావిద్యార్థిదశనాఁటి కీపొత్తము మాయింట లేదు. నాపుట్టు కకుఁ బూర్వమే మాతాత వెంకన్నగారు దీని నొకరాజకీయోద్యోగికి వ్రాసి కొని యిచ్చెదనని యడిగినమీఁద—

‘ పరహస్తగతం గతమ్ ’

అని యనుమానించుచునే యిచ్చిరనియుఁ దుదకాయన యనుకొన్నట్లే జరిగినదనియు మాతండ్రిగారు చెప్పఁగా వింటిని. నాచిన్ననాఁడు రెండాశ్వాసములవఱకు మాత్రము మాముత్తాతగారి చేతివ్రాఁతకల పుస్తకము మాయింటనుండెడిది. ఎందుకేని మంచిదని అవసానదశలో వేఱొక ప్రతి వ్రాయుటకు మొదలిడి ఆపని నెఱవేఱకమున్నె యాయన స్వర్గతుఁడైనట్లూహింపనయ్యెడిని, వేంకటేశ్వరవిలాసమింకను సాపు వ్రాయవలసి యుండఁగనే జీవయాత్ర సమాప్తమైన ట్లాపొత్తములో నాశ్వాసాంతపద్యములు గాని గద్యములుగాని లేకపోవుటచేఁ దెలిసికోఁగల్గితిని. ఇటీవల నేనది ప్రచురించునప్పు డాశ్వాసాంతపద్యములు క్రొత్తగా రచించి చేర్చినట్లు జ్ఞాపకము. ప్రకృతగ్రంథమును నేఁటికి నేఁబదియేండ్లకుఁ బూర్వము గోదావరి డి॥ తునిలో నొక జంగమదేవర ముద్రించుచు నాలవయాశ్వాసము తన యొద్ద లేదనియు నది పంపవలసినదనియు నాపేర వ్రాసెను, అప్పటికి నేను మగ్రముగా గ్రంథము సంపాదించియున్నకతన నాయన కది పంపఁగల్గితిని, యనకు దొరకిన ప్రతియందలిలోపములవల్లనేమి ముద్రాప్రమాదములవల్ల మి మొత్తము పొత్తమంతయుఁ దప్పులకుప్పగానే యపుడు తయారైనది. పు డీబందలువారి కేప్రతిదొరకినదో కాని యిదిగూడ నంత శుద్ధముగ మన్నట్లు తోఁచదు. ముద్రణారంభమునకు మున్ను నాకుఁ దెల్పినచో గొంతేని లాభముండెడిది. స్వహస్తలిఖితమేని చిక్కిన రెండాశ్వాసాల తాళపత్ర గ్రంథముకూడ నిపుడు నావద్ద లేదు. ఆ యీకారణములచే గ్రంథకర్త ప్రమాదము లెయ్యవియో? ఇటీవలివారివలనఁ జేరిన ప్రమాదము లెయ్యవియో "ఇదమిద్ధ"మని నిర్ణయింప శక్యము కాకున్నయది. దీనింగూర్చి

యెంతచర్చించినను లాభము లేదు. ఈయన బాల్యమునందు మాకడియము గ్రామమున కొకకోసుదూరమున నున్న వేమగిరిగ్రామమున నుండెడి మేడవరపు కోనయ్యగారియొద్ద శుశ్రూష చేసి యాంధ్రము నభ్యసించినట్లు.

"కోనయాఖ్యాంధ్రగురుకీర్తి ♦ గూర్తు మదిని"

అనెడి గీతచరణము వలనఁ దెలియనయ్యెడిని, తావన్మాత్రపుఁ బాండిత్యము తోడనే యీయన యీ యామినీపూర్ణతిలక రచించినట్లు నా బాల్యమునాఁటికి నిల్చియున్న చిత్తుపొత్తమువలన నవగతమయినది. సంస్కృతమునఁ దగినంత పాండిత్యములేనిచో నప్పటి యాంధ్రకవులకు బొత్తిగా గౌరవ ముండమింజేసి యీయన యీ గ్రంథరచనానంతరము కాఁకరపర్తి గ్రామమున శ్రీవేదుల వేంకటశాస్త్రిలవారియొద్దఁ బాణినీయ మభ్యసించినట్లు ప్రకృతగ్రంథపీఠికలోని-

"వేదుల వేంకటార్యజనభృ♦త్సామంతులన్ శాంతులన్"

అనెడి పద్యచరణమువలన స్పష్టమయ్యెడిని. మొట్టమొదటఁ దెలుఁగు మర్యాదల కలవడి పదపడి సంస్కృత మభ్యసించిన హేతువుచేతనే కాఁబోలు నీ మాతాతగారి సంస్కృతసమాసగ్రథనము సంప్రదాయసిద్ధముగాఁ గనుపట్టదు. దీని రచననాఁటి కీయనకు నుభయభాషలయందును గూడఁ బాండితి పరిమితముగనే యున్నట్లు పీఠికలోని-

తే. గీ. సంస్కృతాంధ్రమ్ము లొక్కింత ♦ సంగ్రహించి.

అనెడి వాక్యమువలనఁగూడ నవగత మయ్యెడిని గాని ఆవాక్యమహంకారనిరాసార్థముగా సమన్వయించుకొన్న నుసమన్వయించుకోవచ్చును- నేనీగ్రంథకర్తకు మునిమనుమఁడనై యుండి యీయనకుఁ దప్పులు నిరూపించుటకుఁ బ్రాజ్ఞలోకము సమ్మతింపదని యెఱిఁగియును తాతగారను నభిమానముచే వ్రాయవలసిన విషయము గొంత దాఁచిపెట్టినట్లు లోకము భావించుటకూడఁ గళంకు గలిగించెడిదే కనుక నాకుఁ దోఁచిన యథార్థమును దెల్పుచున్నాఁడను. ఈయన సహజకవి. ఆశుగా రచించు నలవాటు కలవాఁడని వినికి (రోజు 1 కి ఏడెనిమిది తాళపత్రములు రచనతో నింపెడివాఁడఁట !) సహజముగా రచించినపద్యము లెంతో రమ్యముగా నుండును.

కం. తళతళలై బెళబెళలై
మిళమిళలై మేనికాంతి ♦ మిఱుమిట్లు గొనన్
గళ లలుముకొనియె దినమొక
నెలవున లేజవ్వనంపు♦నిగ్గులు దేఱన్.

ఇట్టి సహజమాధుర్యపాకముతో నున్నపద్యము లీకబ్బము
నెన్నియో యున్నయవి. గ్రంథకర్త కిట్టి రచనతోఁ దృప్తి తీరకో యేమె
తనకుఁ బూర్వులు పోయిన యమకాదుల ననుసరించి గ్రంథము చాలవఱ
బెంచియున్నాఁడు. త్రికమకగా నన్వయించుకొన్నంగాని యన్వయిం
పద్యము లెన్నియో గలవు. వాని నిందెత్తి చూపవలసివచ్చుచో గ్రంథ
చాల విస్తరించెడిని—

“సీ. శరదంబు వేణికి”

వగయిరాపద్యములు చూచుకోఁ దగు ఈపద్యమే కాదు.

చ. “మృగధరబింబసంపదల మీటు వధూటిముఖంబు”

లోనైన పద్యములన్నియుఁ దెనాలి రామలింగకవిప్రణీతములని క
పరంపర అనాదిగా విశ్వసించుచున్న ‘అలఘునచంద్రబింబనిభమై తనరారె
వక్త్రము’ అనెడి కొన్ని పద్యముల ననుసరించి రచించినవి. ఆపద్యము
నన్వయించుకోఁ గలవారికిఁగాని యీపద్యము లన్వయింపవని చెప్పవచ్చు
నాచిన్ననాఁటికి మాముత్తాతగారికవిత్వము సమన్వయించు ప్రజ్ఞ నాకా
గురువులలో నొకరైన శ్రీమధునాపంతుల సూరయ్యశాస్త్రిగారికిమాత్ర
యుండెడిది. వారుకూడఁ గొన్నిచోట్ల శ్రీ ఆకొండి వ్యాసమూ
శాస్త్రులవారి సాయమువల్ల నన్వయించుకోఁ గల్గినట్లును కొన్నిటిసమ
యము కుదరక (ఇప్పటివారు నమ్మినను నమ్మకున్నను నే విన్నది వ్రా
చున్నాఁడను) తదేకధ్యానముతోనుండి నిదురింపఁగా మాముత్తాతగా
స్వప్నములోఁ బొడకట్టి తత్తత్సమన్వయము బోధించినట్లును జెప్పఁగ
వింటిని. క్రియాపర్యవసానము మాముత్తాగారిరచన యినుపగుగ్గిళ్లుగాని మిను
గుగ్గిళ్లు కాదని తేలినది. నాచిన్నతనమునాఁటికిఁ బండితలోకము మెచ్చ
కవిత్వము శిలాపాకకవిత్వమే, ఇప్పుడుగూడ దానికే ప్రాధాన్యము నిచ్చు
వారు కొందఱు లేకపోలేదు గాని ఉన్నను ఆయభిప్రాయము చాలవఱ

మార్పు చెందినది. ఈయన ప్రాకృతచరిత్రకు బిల్హణీయము, పూర్ణచంద్రోదయము, అను రెండు పాత్రములు తననాఁటికే యున్నవని యెఱిఁగికూడ నందలియితివృత్తమునే కథావస్తువుగా గ్రహించి దీనిని రచించుటచేఁ గాఁబోలు నాగ్రంథద్వితయమునందు లేనికవితావైచిత్ర్యములు (యమకాదులు) ప్రకృతగ్రంథములోఁ జేర్చి ఆపుస్తకములకన్న ద్విగుణముగా దీనిం బెంచియున్నాఁడు. విశేషించి కాదుగాని ఆపాత్రములలోనిమాటలు ప్రకృతగ్రంథమునందుఁగొంచెము దొరలినవి.

సీ. కనుద్రిప్పుదును గెలు♦వ్కన మల్లి క్రీఁగంటఁగనుఁగొను యతి లోటు♦వ్కనఁగరంగు

ఈసీసపద్యము సర్వమును గాదుగాని మొదటిచరణము చాలవఱకుఁ బూర్ణచంద్రోదయములోనిదే నేను చిన్ననాఁడు మాముత్తాతగారి తాళపత్రగ్రంథములలోఁ జదివినదే కనుక దీని నాయన చూడలేదనుటకు వలనుపడదు. భవతు (ఇప్పు డొరెంటిలో మొదటిది యుపలబ్ధ మగుట లేదు. బిల్హణీయము ముద్రితమై కనవచ్చెడిని) ఇట్టివి బుద్ధిపూర్వకముగనో యాదృచ్ఛికముగనో ప్రతికవికిని దొరలుచునే యుండును కనుక నుదారహృదయులింతమాత్రమున గ్రంథచౌర్యము నాపాదింపనొల్లరనియే నావిశ్వాసము. బిల్హణీయమునందును పూర్ణచంద్రోదయమునందును అసలు బిల్హణుఁడు రచించిన శ్లోకములు— శ్లో. అద్యాఽపి, అనునవియు, శ్లో. కిమిందుః కిం పద్మం, అనునవియు ననువదింపఁబడియున్నవి, ఈయనయు ననువదించెను, తక్కినభాగము చాలవఱకు స్వకపోలకల్పితము, ప్రథమాశ్వాసము కృత్యాద్యవస్థవగైరా వర్ణనలతో; కథానాయికాజననము వఱకుండును. ద్వితీయాశ్వాసమంతయుఁ జాలవఱకుఁ గథానాయికావయవవర్ణనతో నింపఁబడినది. తుట్టతుదను గాఁబోలును బిల్హణునిశుశ్రూషకుఁ గథానాయిక నప్పఁజెప్పుట వర్ణింపఁబడినది. ఆప్రసక్తిలోఁ దనకుఁ గవితావిద్యయం దెంతటి పక్షపాతమున్నదో! అంతయును వెలువరించినాఁడు.

చ. అనవుడు వారలిట్లని ర♦హా! జనవల్లభ ! యేమనందుమి
ప్పునికి రసజ్ఞతాన్యులకు♦భవ్యరసజ్ఞత సత్కవీంద్రజీ
వనము కవిత్వముల్ దెలియు♦వారము గాము కవిత్వబోధలె
ల్లనువుగ బుద్ధిజాడ్యహృద♦యాంధులు ఛాందసులందుఁ జేరెడిన్.

అచ్చులో తుట్టతుదిక్రియాపదము - చేరునే" అని యున్నది. అపుడుచక్కఁగా సమన్వయించదు- కనుక- చేరెడిఁ అని సవరించవలసి వచ్చినది- ఇట్టి వింకను- చాలఁగలవు. విజ్ఞులు సవరించుకొందురుగాక, ఆయాపద్యములోని మాటలు వేదవేదాంగవేత్తలైన విద్వచ్ఛిరోమణులు రాజుగారితోఁ జెప్పెడివి. ఈఘట్టమునందే తనజీవయాత్రావైఖరినిగూడఁ దెల్పినాఁడు మాముత్తాత—

తే. గీ. అఖిలవిద్యార్థులకు రహ♦స్యార్థబోధఁ
జేయు సుచితంబుగా; నయా♦చితపదార్థ
మనుభవించుచు నెవ్వని ♦ నాశ్రయింపఁ
డతఁడు సర్వస్వతంత్రుఁ డు♦ద్యద్గుణాఢ్య.

ఆయాపద్యములో బిల్హణుని జీవయాత్ర వర్ణింపబడినను ఇయ్యది మాముత్తాతగారి జీవయాత్రాస్వరూపమును జక్కఁగా వ్యాఖ్యానించుచున్నది. శ్రీపిఠాపుర (తాత్కాలిక) ప్రభువు నీలాద్రినృపతి తనకు శిష్యులైన శ్రీచింతపల్లి వేంకటరాయ మాధవరాయసోదరులకు సాక్షాత్తుగా మేనల్లుఁడగుటచే నాయనచేతఁ దమగురువున కేదో శాశ్వతసత్కారమును జేయింపఁ దలఁచి యెంత యత్నించినను నీయన యారాజశేఖరుదర్శనమున కేగకయే (రాజసన్నిధికి నేగకె కాలముపుచ్చె, గీరతము. చూ.) కాలయాపనము చేయుచుండఁగా మాయింటియెట్టయెదుటనే చింతపల్లివారి దివాణము గనుకఁ దమభాగినేయు నేదోమిషమీఁదఁ దమ యింటికి రప్పించి అతః పూర్వమే తమగురువుగారిచే నొకగదిలో నాయీకబ్బము చదువుటకుఁ దగిన సందర్భము సంఘటించిరనియు నాప్రభువరేణ్యుఁ డీయన చదివెడి స్వకవిత్వము విని యానందించి మేనమామల కీయనయెడలఁ గల యనితరసాధారణమగు ప్రపత్తికిం దగిన సత్కృతి చేయుటకు సంకల్పించుకొని ప్రత్యక్షమై అభినందించి—

అయ్యా! మీదర్శనమువలన నేను ధన్యుఁడను. మీకేమి కావలయునో? (మ॥ వసుధాఖండమువేడితో" భాగవతము. చూ॰) కోరుకోవలసినదనిన మాముత్తాతగారు సవినయముగా—

అంతో యింతయొ పండు భూమిగల దానవం తేనియుంజింత లే
దెంతేఁ జింత యొకండు గర్గినను నాయీచింతయే మాకు న
స్యంతమ్మున్ ఫలదాత్రి

ం చెప్పి యేమియుఁ గోరక నిరాకరించినట్లు గీరత ప్రథమ భాగములో
్వములో నాచే వ్రాయఁజేసినది మా ముత్తాతగారి నప్రతిగ్రహణ
. తాను లేశమును సంపాదింపలేదు సరిగదా? అంతకుమున్నున్న
్యమునుగూడఁ బరిత్యజింపక తప్పదని తనయన్నలతోఁ బోరాడి
మును ఆవృత్తికి సంబంధించిన వృత్తితోఁగూడ నన్యాక్రాంత
మాముత్తాతగారిని నేను మనఃపూర్వకముగనే (ఆయనకాల
ని జరుగనిచో నారోజులలో జరుగవలసివచ్చి అప్రతిష్ఠాప్రతిష్ఠలు
ఁకోవలసివచ్చునుగదా!) అభినందింతునుగాని నాపేరిటివాఁడును
థకర్తకుఁ బెద్దన్నకొమరుఁడును శిష్యుఁడును ఆయీ మహనీయుని
గ్రంథసామగ్రిని నాజననకాలమువఱకే కాక నేను——

పందశరద్వయస్కుఁడ

సపర్యంతము కాపాడిన నాపితామహుఁడు వెంకన్నగారికి
మాపిన్నముత్తాతగారియెడలఁ గొంత కోపముండెడిదని వింటిని.
ికుఁ గారణము పౌరోహిత్య (అధ్యక్షరాణి సంగృహ్య చాకే
ోహితమ్) పరిత్యాగము కాదు. ప్రభువు తనయున్నచోటికే
ంకొమ్మన్నప్పు డేయగ్రహారమునో కోరక నిరాకరించుటయును
శేమనిన వినుఁడు సీలాద్రిరాయణంగారు మాముత్తాతగారిని——

“ మీ రేదియో కోరక తీరదు ”

ం పట్టు పట్టినప్పుడు ప్రతిచెప్పలేక కోరినకోర్కె మాతాతగారికిఁ
ెమైనదని చెప్పికోఁగా వింటిని. మాముత్తాతగారు కోరినకోరి
చుచున్నాఁడను.

ాజా! యెప్పుడో మీపూర్వులు మాకుఁ గొంత భూమి నిచ్చి
? ఆభూమికిఁ గొంత కట్టుబడి (పన్ను) యున్నది. అందులో

నావంతు కట్టుబడి తొలఁగింప (మాఫుచేయ) వలసినదని కోరిరఁట! ఆకట్టు బడి పరిమితి యావత్తును అఱవై యకరములకును మూఁడురూపాయిలకు మించదు. అందులో మూఁడవవం తొకరూపికమాత్రమే. దీనివలన సంవత్సర మున కొకరూపిక వార్షిక మేర్పఱుపవలసినదని కోరినట్లు ఫలితార్థమేర్పడి నను యథార్థ మది కాదు. ఎట్లో ప్రభువును సంతోషపెట్టవలయునని తలఁచి కంగారు (తస్మా ద్రాజముఖం భీష్మం భావుకమ్) గాఁ గోరినది.యీ కోరిక (ఈయనకు సభాకంపమున్నదని చెప్పఁగావింటిని. ఆయీకంగారున కదికూడఁ గారణము కావచ్చును.) అప్పటికప్పుడే మాసాక్షాత్ప్రపితా మహుఁడు కామయ్యగారును తదనంతరసోదరుఁడు (జ్యోతిషపండితుఁడు నాచిన్ననాఁటి కీయన జ్యోతిషగ్రంథములుకూడఁ గొన్ని పెట్టెలలో నున్నవి) అన్నయ్యగారును, ఆయీ పిన్నముత్తాతగారును విభక్తులై యుందురని—

"నావంతు"

అను వాక్యమువలన గోచరించుచున్నది- అట్లే అగుచో మాపిన్న ముత్తాతగారు సర్వకాలసర్వావస్థలయందును నేదో విద్యాగోష్ఠితోఁ గాల క్షేపము సేయుచు గృహకృత్యములందుఁ బాలుగొనకుండుటకు వదినెగారు పరమ్మ సహింపక యేవో తేలికమాట లన్నట్లును నయ్యవి వినీవినితోడనే మాపిన్నముత్తాత—(ఈయనబహుకోపి)

"ఇఁక నీయింట భుజించువాఁడఁగా"

నని యొట్టు వెట్టికొని యూరు విడిచిపోవుచుండఁగా నవ్వాలివీధి వెలమ వారు (శిష్యులు) బతిమాలి యెట్టకేలకు నిలవరించి వారివీధి నొకనివేశనస్థల మిచ్చి ఆదినముననే పర్ణకుటీరమొకటి యేర్పఱచి గృహోపకరణాదు లొసఁగి నిల్పినట్లును విన్నవినికి. రాజసందర్శనమునకుఁ గొంతపూర్వపుదే కావలయును. దానికిఁ దథ్యముఁగా నిప్పటికిని నొకనివేశన మవ్వాలివీధిని మాకున్నయది. నాచిన్నతనము నాఁటికి మాపిన్నముత్తాతగారి భార్య గవరమ్మగారు తన మనుమరాలి (దౌహిత్రి) తోడను, మనుమరాలిభర్త మాపినతండ్రిగారి తోడను ఆయింటనే నివసించెడిది. నరసకవిగారు పితృపితామహార్జితమగు నిల్లువదలిన పిమ్మటనే రాజుగారి దర్శనవిషయము వగైరా సమన్వయించు

లయ్యెను. విభక్తుఁడైన పిమ్మటనే యీయన స్వర్గతుఁడైనను దనకు సంతానము తప్పఁ బురుషసంతతి లేనందునఁ దనవంతుభూమివగైరాలు మన్నకొడుకు మాతాతగారికే చెందఁజేసెను. దాని కీయన చేసిన పాయము వివరింతును. ఈయనకు సంస్కృతాంధ్రసాహిత్యకవిత్వము తోపాటు జ్యోతిశ్శాస్త్రమునందును మంచిప్రవేశముండుటచేఁ (జాతకము) దనయవసానసమయము నెఱిఁగి అందులకు పుణ్యభూమియగు తన రు కడియముకన్న వసిష్ఠానదీతీర మగుతనయత్తవారి యూరు కాఁకర గ్రామమే తగినదనియు నూహించి యాయూరి కేదో మిషఁ బెట్టుకొని గుచు మాతాతను బిలిచి తనగ్రంథములన్నియు నెండఁ బెట్టవలసినదని ధీనపఱచెననియుఁ బిదపఁ గొలఁదిదినములకే కలరా వ్యాధివలన స్వర్గతుఁ ్యననియు గ్రంథసామగ్రితోపాటుగా నన్నలును దానును బంచికొన్న యమును దెల్పెడి పారిఖత్తు గల తాళపత్రముగూడ మాతాతకుఁ జేఁ ్టటచే భార్యకు యావజ్జీవపుహక్కుగాని ఆపైస్త్రీసంతానమునకుఁ దద రపుహక్కుగాని లేకుండఁ గోర్టు తీర్పు చెప్పినదనియు మాతండ్రిగారి న వినియుంటిని. ఏమైనను మాపితామహుఁ డీవిషయమునఁ గోర్టులోఁ న్ని యసత్యము లాడి కొంత పాతక మార్జించె ననక తప్పదు. మాపిన డ్రి నరసయ్యగా రీవిషయము తఱచుగా వ్యాఖ్యానించుట నేనెఱిఁగినదే ి మాముత్తాత (ప్రకృతగ్రంథకర్త) స్వయముగా- చెయి గొట్టి చేతి ్చినప్పటి యూహ సత్యమే యగు నెడల మాతాత దానినే బలపఱచు నేనేమి మాపినతండ్రి వెంకయ్యగారికి నరసకవిగారి దౌహిత్రినే పెండ్లి ముటచేతనేమి ఆయన సొత్తు కొంతేని స్త్రీసంతాన మనుభవించినట్లు మించుటచేఁ గొంత దోసఁ గంతరించెనని సంతసింపవచ్చును. ఆయీ యమిందెత్తుటకు ఫలితార్థము నరసకవిగారి కితరపాండిత్యములతోపాటు తకశాస్త్రపాండిత్యముకూడ నిశితమైనది కలదని తెల్పినట్టయినది- స్వర్గతి ఁటి కీయన వయస్సు నలభైయైదుకుమించదని వింటిని. నాపుట్టువు 70 వ సంవత్సరము (ప్రమోదూత) నాఁటి కీయన లేరు, మాతండ్రిగారికి జననమునాఁటికి వయస్సు ముప్పదియాఱువత్సరములు, ఆయన నరసకవి ి చరమదశనాఁటికిఁ బుట్టియుండు నేమో కాని నరసకవిని జూచినట్లు నా

కెప్పుడును జెప్పలేదు. దీనింబట్టి చూడనరసకవి 1840 ప్రాంతమున స్వర్గతిఁ చెందెననియు 1795 ప్రాంతమున జన్మించి యుండుననియు మనసమూహించు కొనవచ్చును. "ఈషద్ద్వైషమ్య మవివక్షితమ్" కూచిమంచి జగ్గకవిగారి చంద్రరేఖావిలాపము మాముత్తాతగారి స్వహస్తలిపితో మాగృహమున నేను జూచితిని కనుక కూచిమంచి సోదరకవులకే కొంతకాలమో యీవలికి మాముత్తాతగారి కాలమును జరుపవలసి వచ్చును. (చిత్రభాను స్వభాను వత్సరములకు వ్రాఁత పూర్తిచేసినట్లు కొన్నిపొత్తముల తుట్టతుద నుటంకించిన మాముత్తాతగారి చేవ్రాలువలనఁగూడ నిప్పటికి 120 యేండ్లనాఁటి వాఁడని తేలుచున్నది) ఈయనకుఁ దిమ్మకవిగారి కవిత్వమం దెక్కుడు గౌరవము కలదనుటకుఁ గొన్ని పోలికలు కనుపడును. విస్తరభయముచేఁ జూపలేదు- శిష్టు కృష్ణమూర్తిగారికి సమకాలీనులు పిండిప్రోలి లక్ష్మణకవి గారికిని మాముత్తాతగారికిని నొకప్పు డెక్కుడనో? అనఁగా నేయూరనో? లేక మాయూరనో?

శ్లో. కుచభారా త్కచభారః
కచభారా ద్భీతి మేతి కుచభారః
కచకుచభారా జ్జఘనం
కోఽయం చంద్రాననే? చమత్కారః.

దీనిలో వాదము జరిగిన ట్లెవరివల్లనో కొంతకాలము క్రిందట విని నట్లు జ్ఞప్తికలదు గాని విషయస్వరూపము జ్ఞప్తియందు లేదు. మా ముత్తాత యేసభలకుఁ గాని వెళ్ళక యే స్వల్పమును సంపాదింపక పితృపితామహార్జితమగు భూమివలన ననఁగా నన్నగారు సేద్యము చేసి పుష్కలముగా పండించెడి జొన్నలవలననే జీవితమును గడపినట్లు తేలెడిని——నిన్న మొన్న నాజీవితచరిత్రలో వ్రాసిన——

చ. కవియనఁగా? స్వతంత్ర్యుఁ డొరుఁ♦కంట! బడండని పుట్టియే మహా
భవనముగాఁగ నెంచికొని♦నాస మొనర్చుచు రామసత్కథా
వివరము లెల్ల లోకులకు ♦ విన్చినయమ్మనిసాక్ష్య మిచ్చె నే
కవికి నతండు దేశికుఁడు, ♦ కాదనఁ డేకవిగూఢ నాతనిన్.

శా. ఘోషాస్త్రీబలె నుండఁగాఁ దగుకవుల్ గోట్లెక్కఁ యేదేవియో
భాషల్ వీలునుబట్టి యాడునెడలన్ వాగ్దేవి దుఃఖించు సం
తోషం బందను లోకమేనియును నేఁ దోషజ్ఞుఁడుంగూడఁ దా
నీష న్మాత్రము సమ్మతింపఁడు గురుం డేమంచు లోసెంచెనో.

అనెడి పద్యద్వితయమునకు నేవిషయమందోతప్ప నాజీవిత ముదాహారణము కాకన్నను మాముత్తాతగారిజీవితమేని యుదాహరణమైనందులకు సంతసించుచున్నాఁడను రెండవపద్యములోని కోట్లు కోట్లుగాక పండితసభ యని యర్థము చెప్పికొన్నను మాముత్తాతగా రట్టిపండితసభలకుఁగూడ వెళ్లిన ట్లేయాధారమును లేదు. ఒక్క ఆదొండకాయపద్యముతప్ప మా ముత్తాతగారిచాటువులుగూడఁ గానరావు, ఆపద్య ముదాహరింతును.

మ. తవలింతు న్నతి దైవతప్రమదవా ర్ధ్వన్యో హినీనీరభృ
చ్చ్యవమానామృతశీకరాభ నవబీ జప్రాంతరాపమ్యాస
ద్భవనాజాండకు షడ్రసప్లుతసము ద్యత్స్వాదుమత్ఖండకున్
అవితుంగోద్భవకాండకున్ సరసమోహాఖండ కాదొండకున్.

ఆదొండకాయ లెవరికో కాని రుచింపవు. మాముత్తాతగారు పద్యము చెప్పి గౌరవించినపదార్థముగదా యని నే నిప్పటికి సుమారు నలభై యేండ్లకుఁ బూర్వము కిర్లంపూడిలో నీకూరను జెప్పించి యథాన్యాయ ముగా వండించి తినిచూచితిని, కొంచెము గబ్బువాసన కలిగి యుండును. కాకరకాయలచేదు గుడముపలనఁ బోఁగొట్టినట్లే యీకాయలగబ్బువాసన కూడఁ బోఁగొట్టవలసి యుండును. శిష్యులు వెలమవారు తఱచుగా వేఁటకు వెళ్ళినపు డీకాయలుకూడ సంపాదించి తెచ్చియిచ్చి సంతుష్టిపఱచి యెప్పుడో కోరుటవలన దీనిని మాముతాతగారు వెంటనే ఆశువుగానే చెప్పి నట్లు వినికి. ఆయీ పద్యమేకాదు.

శ్లో. కమలాగృహతోరణారణానాం
ఘటనాపాటనయోస్సమర్థకాః
అసురారిదృగంచలప్రసారా
ర్ఘనన మజ్ఞానతమో నిహన్యతాం మే.

అనుశ్లోకముగూడ నాశువులోఁ జెప్పినట్లే వినికి. ఆయీ తిలకావిలాస రచన ముగిసినపిమ్మటఁగదా? ఈయన విద్వత్కవినసిసించుకొనుటకు వ్యాక

ణాధ్యయనార్థము కాఁకరపర్తికి వెళ్లినట్లు లోగడ నుడివియున్నాఁడను. అపు డాయూరిపండితులలో నప్పటికే గురువులైనవారో! లేకనాఁడో మఱి నాఁడో గురువులు కాఁదగ్గవారో! కేవలకవిగదా? వీనిధోరణి యెట్లుండునో? చూతమని యీవర్ణన అనఁగా? శ్రీవిష్ణుమూర్తియొక్క నేత్రములను వర్ణించవలసినదని హేలగాఁ బ్రశ్నింపఁగా మాముత్తాతగారుకూడ హేల గానే పై నుదాహరించిన శ్లోకమును రచించి గురువులమెప్పునకుఁ బాత్రులైనట్లు పండితపరంపర చెప్పికోఁగా వినియుంటిని. ఇఁక నొకటిగూడవింటిని ఈవృత్తము వారు దేనిని గోరిరో అదిగాక మఱియొటిగా నుండుటచే-

"నరసన్నా? వర్ణన బాగుగనే యున్నది గాని వృత్తముమాత్రము మే మడిగినది యొకటియు నీవు చెప్పినది వేఱొకటియు నైనవి. అయిన నేమి? నీయాశుధారకే సంతసించితిమి"

అని వారనిరనియు దానిమీఁద మాముత్తాత వృత్తముకూడ మీరు కోరినదే చెప్పితినని బుకాయించె (బూకరిగాని—బోలరయా) ననియు గురువులు లక్షణశ్లోకము చదువుమని మరల పశ్నించిరనియు వెంటనే ఆశువులో లక్షణశ్లోకమునుగూడ నిర్మించి చదివె ననియు నయ్యది ప్రక్షిప్త కల్పనమగుటచే నయథార్థమైనను దేనిమీఁదనో ఆశువులో శ్లోకమో? పద్యమో? రచించుటకును లక్షణవిషయమాశువులో రచించుటకును విశేష తారతమ్యముండుటచే గురువులు పరమానందభరితులై పాణినీయము నుప దేశించి—

'విద్వత్కవి'

శబ్దమునకు లక్ష్యభూతునిగాఁ జేసిరనియుఁ బెద్దలవలన వినినాఁడను. వినుటమాత్రమే కాదు నేను శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారియొద్ద

గురుభ్యోన్నమః

అని ప్రారంభము చేసినపుస్తకము మాపిన్నముత్తాతగారి స్వహస్త లిఖిత తాళపత్రసంపుటమే జాతకచర్యలో—

తే. గీ. అనుచుఁ దనపిన్నముత్తాత♦యగు నృసింహ
కవివరుఁడు లిఖియించిన♦గ్రంథములను
వెదకి సిద్ధాంతకౌముది♦వెకిలిఁ దీసి
విద్యకై యొంటకేనియు♦వెడల నెంచి.

శా. కాశీపండితుఁడై కృపాళుఁడయి ప్రఖ్యాతిప్రభాపూర్ణుఁడై
ఆశీర్వాదముమాత్ర శిష్యులను విద్యావంతులన్ జేయుమేల్
వైశద్యమ్మునఁ బొల్చు చర్ల కులజున్ బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీకడియొద్దవాసు గురుఁ జేరన్ బోదు విద్యార్థినై.

అనుపద్యద్వయములో మొదటిపద్యమందలి సిద్ధాంతకౌముది మా ముత్తాత చదివికొన్నదే. ఆయనస్వహస్తలిఖితమే. నాశిష్యవర్గములో నిన్న మొన్న కీ॥ శే॥ ఓలేటి వేంకటరామయ్యశాస్త్రికి నేను సిద్ధాంత కౌముది మొదలిడినదికూడ మాముత్తాతగారి స్వహస్తలిఖితగ్రంథమే. ఆదొండకాయ పద్యప్రస్తావనలో మఱికొంత చరిత్రనడచినది. ఆయీపద్యములోనున్న.

" అవితుంగోద్భవ కాండకున్ "

అనెడిదానికి నర్థము వ్రాయకున్నచో నెవరికోగాని గోచరింపదు. అవి=సూర్యునకు (అవి రవావాదివాకరే, అని కోశము) తుంగ=ఉచ్చస్థానమైన మేషరాశియందు అనఁగా సూర్యుఁడు మేషరాశియందుండఁగా (చైత్ర మాసమందని యీసదర్థము) ఉద్భవ=పుట్టుకయొక్క కాండకున్=సమయముకలదానికి, (కాండోఽస్త్రీ...అవసరవారిషు, అని కోశము) చైత్రమాసమున నాదొండపాదుఁగ లుదయించునని తెలివిడి. విస్తరభయముచేఁ దక్కినది వ్యాఖ్యానించ లేదు, ఆయీపద్యమునకు.

" కాగనల్లికఘను ర్జ్యావల్లి నీరుల్లికిన్ "

అన్న యుల్లిపాయపద్యము (దీనికవియెవ్వరో తెలియదు) మార్గదర్శకమని నిపికి. ఫలితార్థము, మాముత్తాతగారేరాజులను జూడక పోతరాజుగారు చెప్పినట్లు.

"క. వ్యాప్తిన్ జెందక నగనక, ప్రాప్తంబగు లేశమైన పదివేలు"

గా (అదియేని స్వగీయభూమిలోనే) భావించుచు

శ్లో॥ మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః.

అన్న శ్లోకార్థమునకుఁ బ్రథమలక్ష్యమై, " నాఽనృషిః కురుతే కావ్యమ్ " అనే 2 శ్లోకార్థము ఱిపికిఁ దెచ్చుచుఁ " శ్రీరామనామ మంత్రారాధనపరులయి " కాలక్షేపము చేసినవారగుటచే నేరాజులనుగాని

దూషించి, లేదా? భూషించి చెప్పినపద్యములు లేవని వ్రాయుటలో నసృతముండరాదు. ఈయనమాత్రమే కాదు పూర్వులుగూడ వ్యవసాయమ వలననే జీవనమును. 'శ్లో. పంచమేఽహాని షష్ఠేవా శాకం పచతి స్వే గృహే' గాఁ గడపినొన్నట్లు కనుపట్టెడిని. ఏదో ప్రసక్తి తగిలి గోదే గ్రంథములో మావంశస్థులనుగూర్చి యిట్లుటంకించి యుంటిని.

కం. మంత్రులై యేలిన సా
మంతులు జన్మములు సేయు ♦ మహితులు నున్న
ట్లెంత వెదకినను నాకిసు
మంతయు మాకాలమునందు ♦ నగుపడదయ్యెన్.

ఆ. వె. అనృతమాడుపట్ల ♦ నతిభీతి గలవారు
కోర్టుకేగఁ గొంకు ♦ గొనెడివారు
కవిత చెప్పువారుఁ ♦ గడు నమాయికులును
గలరు మాకాలానఁ ♦ బలువు రెందు.

ఏదో యీవిధముగా నున్నదున్నట్టులు వ్రాసికొనిన వ్రాఁత లోక మభినందించునుగాని లేనిపోని అత్యుక్తులు వ్రాసుకొన్నచో నభినంద చదని వ్రాయ నక్కఱ లేదు. మా పితామహుఁడు మాయూరిలో నాకాలమునఁ బెద్ద భూస్వాములుగా నున్న కరిమెళ్లవారి వ్యవహారములఁ జక్కఁబెట్టెడివారని వింటిని, నేను శ్రీ వేంకటగిరిరాజాగారి అల్లుఁడ శ్రీ చెలికాని గోపాలరాయనింగారితో శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామివా కొండ కేగినప్పుడు వారియుద్యోగులు తోడరానికారణమునఁ గొంత జమ ఖర్చులు నాచేతిమీఁదుగనే నడిచినవి. అంతమాత్రముచేత నేనుగా మాతాతగాని మంత్రిత్వముచేసిన వార మగుదుమా? అదియునుంగా కవిత్వమునందలి సత్త యెట్టిదో? తెలిసిన యే నిజమైనకవిగాని మంత్రిపద కవిపదవికంటె (సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్) నున్నతమైనదని దాని ప్రాఁకులాడెడినా?

(1) సీ. ఎదురైనచోఁ దన♦మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించి కొనిర మనుచరిత్రం బందు♦కొను వేళఁ బుర మేఁగఁ బల్లకి తనకేలఁ♦బట్టి యెత్తె.

(2) శ్లో. తాంబూలద్వయ మాసనంచ లభతే యః కాన్యకుబ్జేశ్వరాత్.

ఇట్టిది కవి కున్నస్థానము మంత్రిదో "చిత్తము వోంగడము" అను తరగతికిఁ జెందినది, ముప్పదిలక్షల రాబడిగల విజయనగర సంస్థానమును దనచేతిమీఁదుగాఁ బరిపాలించెడి—

శ్రీ పెన్మెచ్చ జగన్నాథరాజుగారిని

మహారాజేమని పిల్చువాఁడో యెఱుఁగనివారెవరు ?

జగ్గప్పా ?

అనియే సంబోధించుటట, ఆమహారాజు కాదుగదా ? మఱి యేమహా రాజేని కవినట్లు సంబోధించి నెగ్గఁగలఁడా ?

మ. ఇతఁడా రంగదభంగసంగరచమూ హేతిచ్ఛటాపావకో
ద్యతకీలాశలభాయమాన రిపురాడ్డారాత్రశుధారానవీ
నతరంగిణ్యబలా..............వత్సవయి తిమ్మక్ష్మావిభుం డీతఁడా.

ఆయీధారతో నఱువై పద్యములు రచించి పెద్దాపురపుప్రభువుచే క్షమాపణ చెప్పించుకొన్న మాగాపు శరభకవికి మంత్రిత్వమే యెక్కువదో కవిత్వమే యెక్కువదో ? తెలియునుగాని అస్మదాదుల కెట్లు తెలియును ? కర్మము చాలక పెద్దాపురపు రాజుగారు (తిమ్మజగత్పతి) శరభకవిగారిని; జూచి—(ప్రేమతోఁగాని దురుద్దేశముతోఁగాదు)

"ఇతఁడా ? శరభకవి"

అన్నారఁట, ఎప్పు డిట్లన్నది ? శరభకవి, శరభకవి, అని వినుటయే కాని యెన్నఁడును రాజుగా రాయనను జూడలేదు. రాజదర్శనమున కమ్మహా కవి వెళ్లనులేదు, (నిస్పృహాస్య తృణంజగత్) అట్టి సందర్భమున మహా రాజే మహాకవి సందర్శనమునకు వెళ్ళెను. మహారాజు హృదయములో శరభకవి యాకార మొక మేరువుగాఁ జిత్రింపఁబడి యుంటచే నేదోమాదిరి రూపములో నున్న (విద్యారూపం విరూపాణామ్) నిరాడంబరవేషము మది కాశ్చర్యము కలిగించి చట్టున.

"ఇతఁడా ? శరభకవి"

అనెనఁట ? శరభకవి రాజు తన్నేకవచనముతో నుచ్చరించెఁగదా ? యని కసలి సగౌరవముగనే యేకాశుధారలో నఱువదిపద్యములు చెప్పి ప్రతిపద్యాంతమందును—

"తిమ్మకొమ్మవిభుం డీతఁడా?"

అని యేకవచనము చూపి మృదువుగనే గర్వభంగ మొనర్చినట్లు చెప్పికొందురు. నా బాల్యమునాఁటికే ఆయీపద్యములు గొన్ని లోపించినవి. కొన్నిమాత్రము ముమ్మిడివరప్రాంతమున వింటిని, అందులో నొకటిమాత్రమే ధారణకు వచ్చినది. ఇప్పు డందులోఁగూడఁ గొంత మఱపు తగిలినది. వక్తృవ్యాంశము కవిపదవికంటె మంత్రిపదవి యెక్కువది కాదనియు దాని గౌరవమెఱిఁగిన యేకవియు మంత్రిపదవి కాసించఁడనియే నే ననుకొందును, భిక్షాటనము చేసికొని జీవించినను గవికి నది గౌరవాపాదకమే యను నంశము సామాన్యులకు గోచరింపక తద్ద్వారమున నీసడించి నచోఁ దమకగ్రస్థానము లభించునని కొందఱు ప్రయత్నింతురు గాని ఆ ప్రయత్నము పరిహాసాస్పదమనియే నే ననుకొందును. నిజమున శక్తిగల కవికి వస్త్రాద్యాడంబరములతోఁగాని యితరోపకరణములతోఁగాని లేశము నుపనియుండదు. శ్లో. నాఽస్మాకం శిబికా...విద్యానవద్యాస్తినః అన్నాఁడు భవభూతి, మామూ త్తాతగారి జీవితమునుగూర్చియు జీవించిన కాలమునుగూర్చియు రచించినగ్రంథసంఖ్యను గూర్చియు సంగ్రహముగాఁ దెల్పినట్లయినది. కవిత్వ మెట్టిది? దుష్టమా! నిర్దుష్టమా! రసవంతమా? నీరసమా? అను సంశయము చర్చింపవలసి యున్నది. వీరేశలింగంపంతులువారీయన మంచికవియనియే నిర్ణయించి యున్నారు. (కవులచరిత్ర. చూ°.) లాక్షణికత్వమునం దీయన చదివికొన్న లక్షణగ్రంథము లేవో ముందు తెలిసికొని గాని మంచిచెడ్డలను జర్చింప రాదు. అనంతుని ఛందము మామూతాతగారి గ్రంథసామగ్రిలో నున్నది. అప్పకవీయము లేదు. కాని చిన్నసైజులోనివి యేడుతాలూకులు—

"అప్పకవీయములోని కొన్ని యతిప్రకరణములు" అను శీర్షికతో నున్నని నాకుఁగనుపడినవి. అందుచేత ఛందోవిషయమునం దీయన అప్పకవి మతానుయాయియగుటకు వీలు లేదు. ఏకొన్నిటికివారాణ్యో సమ్మం! అప్పకవి అఖండయతి నొప్పికొనెను. మామూత్తాతగారు సర్వసాధారణముగా నఖండయతి నంగీకరించిరి, తటలకు విశ్రమముచెల్లవలసి వచ్చుచో నుభయత్ర బిందుపూర్వకత్వ మావశ్యకమని చెప్పి అప్పకవి—

"పెక్కేచం దాలం బండు నొకప్పుడుం దఱుగ దింటం బాడియుఁ బంటయుఁ"

అని యుదాహరించెను. మాముత్తాతగారిరచనలో—

సీ. శరదంబువేణిక ♦ శాంతభావమునందె దరహాస మడరి వెం♦టనెమరల్చె

ఇందు స్వరదళమునం దుభయత్ర బిందువు లేదు కాని నేను నాచిన్న తనమునలో జంగముదేవరగారికిఁ బంపిన భాగములో నీపద్యమున్న యెడల—

"దరహాస మడరి యంతనె మరల్చె"

అని దిద్దియుండుట నిక్కము. ఆపద్యమున్నభాగ మింకను నాయొద్దకుఁ బ్రచురణకర్తలు పంపలేదు. మూఁడాశ్వాసములుమాత్రమే పంపిరి. ఇటీవల నాయీయతులు దిద్దుట కుపక్రమించుట అనాలోచితముగా నాకుఁ దోఁచినది కవి ప్రమాదపడి గాని పాండిత్యము లేకగాని ప్రయోగించిన దగుచో నది దిద్దుట యుచితము. బుద్ధిపూర్వకముగ నేదో గ్రంథాధారముంబట్టి ప్రయోగించినదాని నితరులు దిద్దుట యుక్తము గాదు, దాసు శ్రీరాములుగారు దేవీభాగవతపీఠికలో నాయీ విషయమును విపులముగాఁ జర్చించి ఫలానా ఫలానా యతులును ప్రాసములును దాము బుద్ధిపూర్వకముగనే వాడియున్నారమని తెల్పిరి, అట్లు తెల్పినను శంకించుట ప్రాజ్ఞలక్షణమని యెవరనుకొందురు? రేఫశకటరేఫభేదము కొంతకాలము పాటించిరి, కొన్నిపుస్తకములే దానికొఱకుఁ బుట్టినవి. తుద కవి యన్నియు మూలఁబడినవి. ఆద్వయమునకు మైత్రియే సర్వత్ర కనవచ్చుచున్నది. ఓనమాలు మొదలుకొని యైదుబల్లును నేర్చినవానికిసైతము తెలిసెడి యీ యతిప్రాసలనుగూర్చి ప్రబంధకర్తలను వెక్కిరించువారియుద్యమముకన్న శోచనీయము మరియొకటి యుండదు. యతి తెలుఁగుభాషకు సహజాలంకారమని చెప్పుట కెన్నియో యాధారములున్నవి. కాని యిటీవల యతుల జాబితా పెరిఁగినకొలఁది సట్టిభావమే మాఱినది— "గుళ్ళో దేవున కంగట్లో బెల్లం నైవేద్య" మన్నసామెత ప్రత్యక్షమైనది- ఈస్థితిని సమర్థించుటకు గొన్ని లక్ష్యములు భారతాదులలోనే దొరకెడిని. లోగడ నేదో వ్యాసమున నిది చర్చించినవిషయమే మఱియొకటి ఏల అనెడి యావ్యయమును కళగానే భారతాదిగ్రంథములవలనఁ దెలిసికొందుము, దానికి సంధిచేసినచోఁ గొంత శ్రవణాసుఖము పడును, పడినను-

" వా కే లింత సేగిం బడన్ "

వగైరా స్థలములలోఁ దిక్కనాదులు చేసియున్నారు. పదకవులు మాత్రము మిశ్రప్రకృతికముగనే వాడిరి.

" ఏలనే? మరులేలనే? చలమేలనే?

ఇత్యాదు లుదాహరణములు చాలఁ గలవు, మామతాతగారు ప్రత్యేకించి యొకపద్యము సర్వమును నియ్యది ద్రుతప్రకృతికముగనే యుండునట్లు రచించిరి.

ఉ. మేలనువొందలేని ఘన♦మేలను నాకిక సాటివారి నో
మేలను కల్మిచక్కదన♦మేలను జొక్కపుజవ్వనంపు సొ
మ్మేలను తేనికింతచల♦మేలను బిల్వఁ బలుకుఁ డేమరించు జా
మేలను నిట్టి జన్మఫల♦మేలను బాపపుదైవ మేలనుఙ్.

ఇది కవి బుద్ధిపూర్వకముగా వాడినదిగాని ప్రమాదప్రయుక్తము గాదు. ఇట్టివి దిద్ది కవియుద్దేశముమార్చుట తప్పని నా కిటీవలఁ దోఁచినది. మొట్టమొదట మామతాతగారి రచన యావత్తును నా మతానుసారముగ దిద్ద మొదలిడితిని. ఆదిద్దుఁబాటులోఁ గొన్నిటి స్వరూపమే చెడి తుదకు-

" అయ్యవారిని జేయఁబోతే కోతిగా తయారైనది " అను సామెత ప్రత్యక్షమైనది. అంతతో నాయుద్యమమునుండి విరమించితిని. ఇది యంతయుఁ బకృతగ్రంథమునకు సంబంధించినది కాదు. ఏతత్కవికృత మైన వేంకటేశ్వరవిలాసమునకు సంబంధించినది. ఈ విధమైన సంస్కరణము దీని తుది యాశ్వాసమునకుఁగూడఁ దగిలినది. ప్రథమముద్రణమునకు జంగముదేవరగారు దానిని నాదగ్గఱనుండియేకదా! సంపాదించిరి. అయినా ధీరమ్మన్య సంస్కర్తలవలన భారతాదిప్రయోగము లెన్నో యిటీవలఁ జెడి మొదటిప్రయోగముల ననుసరించి పుట్టిన లక్షణములగతి అధోగతిపాలైనది. కొన్ని దిద్దుఁబాట్లు మూలార్థానుకూల్యమును జెడఁగొట్టినవి భారతము నందలి " నమ్మిమ్మానమ్మక "

అనుచోట దిద్దిన దిద్దుఁబాటువలన నీయంశమువిస్పష్టము. ఈప్రయోగము ననుసరించి యెందఱో మహాకవులు ప్రవర్తించిరి. అయినామర్మ మెఱిఁగియో! యెఱుఁగకో! మొదటిప్రయోగమును సంస్కర్తలు దిద్ది చెడఁ

గొట్టిరి. ఆదిద్దుఁబాటును బట్టుకొని యేకర్మము నెఱుఁగని విమర్శకా భాసులు తప్పులు వట్టుట కుపక్రమించి యపహాస్యాస్పదులై తుద కేమియు గతి గన్పడక-

"మీరా? మీరా?"

అని ప్రార్థింప నుపక్రమించిరి, పెద్దపెద్ద పేరులు ప్రయత్నపూర్వకముగా సంపాదించుకొన్న మీరేమిటి? ఇట్టి విజ్ఞప్తు లంపికొనుట యేమిటి యని కొన్ని పత్రికలు పరిహాసించుట కారంభించినవి. దీని కంతకును గారణము సంస్కర్తల పాండిత్యలోపమును గనిపెట్టఁదగిన సామర్థ్యము లేకుంటయే వక్తవ్యాంశము. కవియుద్దేశము గనుఁగొనకుండ నెవరిగ్రంథమును గాని సంస్కరింపరాదనియే. వలసినచో నాకవి కవిత్వము జీవకళగలదేయైనచో దానికిఁ బ్రత్యేకించి వ్యాకరణమొకటి పుట్టితీరును. ఈ అభిప్రాయము స్థిరపడినపిమ్మట నిదియే మామతాతగారి గ్రంథముద్రణము నేను జూడఁ దటస్థించుట, ముద్రాప్రమాదము లిందు విశేషించి దొరలినవి. వానిని జూపినచో గ్రంథము పెరుఁగును, శ్లేషవాడినస్థలములలో నీయన రచనలోఁ గొంత వ్యాకరణము నతిక్రమించుట కనుపట్టెడిని, కొంచెము చూపుదును.

|| సీ. ఆలికుచంబు లేనంటి చూడఁగనా కెకి? కొనఁగోరునూటిపై కొనకు జాణ?

ఇదిపుష్పలావికావర్ణన ప్రశ్నోత్తరాలుగా సమన్వయించుకోవలయును, ఆలికుచంబులు=ఆనిమ్మకాయలు అని యొకఅర్థము. ఆలి= ఓచెలీ? కుచంబులు అని శ్లేషార్థము. ఈరెండర్థములకును సరిపడునట్లు పుష్పలావిక జవా బుండవలెను- కొనఁగోరు=కొనుటకు నిచ్ఛగింపుము నూటిపైన్= నూఱుకాయలకన్న హెచ్చుగా, కొనకు= కొనకుము, కాయలు చాలమందికి సప్లై చేయుటకు మాటయిచ్చియుంటచే నీకెక్కువగాఁ గావలసియున్నను నూటికన్న నెక్కువ యీయఁజాలనని బెట్టుసరిగా జవాబిచ్చినది. ఈ యర్థమునందు కొనన్— గోరుఅనుచో నర్థానుస్వారముండవలెను- నూటి పైన్- కొనకు అనుచో నర్థానుస్వారమేకాక సరళాదేశముకూడ రావలెను. గనుక నూటిపైఁ గొనకు అనికావలయును. ఇంతమాత్ర మీకవికిఁ దెలియదా? తెలియును. ఇట్టిపట్టుల నిట్టిస్వల్పములు విమర్శకులు పాటింపరని రాఘవపాండవీయాదులవలన నవగత మగుటచే నిట్లు చిత్రించెనని యెఱుఁగం

దగు- ఇప్పటికి లికుచ (నిమ్మకాయల) పక్షము ప్రత్యుత్తర మిచ్చినట్లాయె
నది. ఇఁకమిగిలినది కుచపక్షము, ఓయీ నీవు కుచములను ముట్టుకొని
చూడవచ్చునా? అని కొంటెతనముగా నడుగుచున్నావు, అంటె చూచి
నంతలోఁ జెడినదేమిగాని కొనగోరు= గోటికొనను, నూటి= నాటి, పైకొ
నుకు= ఆలింగనాదుల కుపక్రమింపకము, ఇది నడివీధి కనుక నట్టిపనుల కను
వైనచోటుగాదు, కామాంధానాం యుక్తాయుక్తవివేకశూన్యత్వాత్తని
యుంటచే నిట్లు మందలింపవలసి వచ్చినది. అన్యథా భావింపవలదని యాశ
యము- ఈయర్థమందు నూటుధాతు వొకటి నాటుధాతువునకు బదులుగా
నంగీకరింపవలయును. ఇది గ్రాంథికముగాదు. వ్యవహారమందుమాత్రము
సార్వత్రికముగాఁ గాకున్నను గ్వాచిత్కముగ శ్రుత మయ్యెడిని- ఎచ్చటను
శ్రుతమేకానిచో నీయనకుమాత్రమెట్లు వచ్చెడిని, భవతు ఇక్కడికి నొక
సీసచరణము వ్యాఖ్యానించితిని, ఇట్లే యావత్పద్యమును వ్యాఖ్యానిం
చుచో గ్రంథము పెరుఁగును. నాల్గవచరణములో-

"వెలదింపు నీపొందు గలువ నెమ్మది వచ్చు"

అనుచోట- కలువశబ్దము కల్వపువ్వనునర్థమిచ్చి అదనముగా కలి
యగ (కలియుటకు) అనునర్థాంతముగూడ నీయవలయును. అప్పుడు
నిలుచుధాతువువంటిది కలుచు ధాతువొకటి యుండవలసివచ్చును. వ్యావ
హారికములోఁదప్ప గ్రాంథికభాషలో నట్టిదిలేదు. ఈ మాట గ్రుడ్డువచ్చి
పిల్లను వెక్కిరించినదన్నట్లు నేను మాముత్తాతగారికి బోధింపవలయునా?
అక్కఱలేదు, ఆయన విద్వత్కవిగాని లాకలూకాయకవికాఁడు, ఇట్టిపట్టుల
వసుచరిత్ర (ముసలిమానులు చూ" ముసలిచెట్లనునర్థమున ముసలిమాకు
లని యుండవలయును) లోనైన గ్రంథములను మన్నించినట్లే తన్నుఁగూడ
విమర్శకులు మన్నింతురని రసలోభమున నిట్లువాడియుండును. ఒకకవి
యీపుష్పలావికావర్ణనమునే యుపక్రమించి-

"జాం పండుకొనియెదఁజానరో? వెలయెంత? జాంపఁడుకొనియెడి జాణగలఁడే"

అని చిత్రించెను. జాము- పండుకొనియెద అను నర్థమున క్వచిదు
కారస్య లోపః అని లోపము నెట్లో చెప్పికోవచ్చు ననుకొన్నను ఫలార్థ
మున జామి-పండు, అనుచో నికారణమునకు లోపము దుర్లభము. ఇయ్యెడ

ధమైన యుపపత్తి కలదు. యుక్తముగా నున్నచో సహృదయులు హించుదురుగాక. పలువురు ప్రాచీనకవు లొకరినిజూచి యొకరుగా ష్పలావికావర్ణనము నిట్లే చిత్రించి యున్నారు, కొందఱు స్వల్పముగను ొందఱు విశేషించియు వ్యావహారికమునకుఁ దావిచ్చి యున్నారు. కరికిఁ గాకున్న వేఱొకరికేని యిది విమర్శసహము గాదని శంక కుండునా? ఇట్లనుట పొసఁగదు కలిగియు నీవాక్యోపవాక్యములు ాయికానాయకులకు సంబంధించినవగుటచే నిందు యథాకథంచిత్తుగా తరస్ఫూర్తి కలుగుచోఁ దావన్మాత్రముతో సహృదయులు సంతుష్టి లయునే కాని అయ్యది వ్యాకరణాది శాస్త్రముల ననుసరించి లేదు గ్రాహ్యము గాదని వివరింపరని యట్లు వాడియుందురని నాతలఁపు- కు సహృదయాః ప్రమాణమ్ అసలు ప్రకృతకథకు బీజభూతములైన ములేఁబదిమాత్రమే. ఎంత పెంచినను ఆ యేఁబదిశ్లోకములును నాల్గ సవందలకన్న మించఁగూడదు, కవివంశవర్ణనవల్లఁగాని కృతిపతివంశ నవల్లఁగాని కొంత పెరుఁగుట కొన్నిపుస్తకములకుఁ గలదు, గాని నయ మిందు వర్ణింపనేలేదు. ఏకారణముచేతనో తనవంశమునుగూర్చి-

సీ. కుశలభారద్వాజ♦గోత్రవిఖ్యాతుండు వెంకయధీరుఁ డే♦వి భునితాత.

అని తనముత్తాతగారి నారంభించి తనతండ్రివఱకుఁ దక్కినచరణము నుట్టంకించి తేటగీతిలో—

"అమ్మహాత్ముని సకలజనానుమతిని"

అనిమాత్రము వక్కాణించి తనకన్నఁ బెద్దలగు సోదరులను—

"సరసకామయ యన్నయ ♦ నరసయాఖ్యు
లగు సుతత్రయజనకుఁడై ♦ యలరువాని
మద్గురుని గామయార్యుని ♦ మదిఁ దలంతు"

అని పితృనమస్కారమునందే వంశవర్ణన నిమిడ్చెను. ఈ పద్యములో- మయ- అన్నయ, అనుచోఁ దెలుఁగుసంధి చేసి, మరలఁ దుట్టతుదిని, సయాఖ్యులు, అని బహువచనాంతముగా ముగించుటచే ద్వంద్వసమాస నుకొనక తప్పదు. అగుచోఁ గామయాన్నయ, అని సవర్ణదీర్ఘసంధి

యుచితము, స్పష్టప్రతిపత్తికై ఆణిడుణ్, సూత్రమునందుగల వెసంధి సహ్యాము. ఇంతమాత్రమునకు సంస్కృతవ్యాకరణ పాండిత్యముతో నావశ్యకత లేదు, ఉన్నదనుకొన్నను మామతాతగారి కాపాండిత్యము విస్తరించియే యున్నదనుటకు స్వహస్తలిపితో నున్న కౌముదీసంపుటములే సాక్షులుగాఁ గన్పడుచున్నవి. అట్లున్నను గ్వాచిత్కముగా సంస్కృతవ్యాకరణ విరుద్ధప్రయోగము లుండుటకుఁ గతము నాయనుభూతింబట్టి వివరించుచున్నాఁడను. సుప్రసిద్ధవైయాకరణులు నాకన్న సర్వథా పెద్దలు నగువారు రచించిన గ్రంథములొకటి రెండు నాయొద్దకు గ్రంథకర్తలే సంస్కరణార్థము తెచ్చిచూపఁగాఁ జూచితిని, అష్టోత్తములలోఁ బలుచోట్ల, ధాతువున కాదియందుఁ జేర్చవలసిన అడాగమ ముపసర్గకుఁ బూర్వమందుఁ జేయఁబడినది. "చణ" అనెడి తద్ధితప్రత్యయము స్వతంత్రశబ్దమువలెవాడఁబడినది- (న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా నాఽపి ప్రత్యయః) అపాహరత్, అనుటకు బదులు అపహరత్, అని ఆడాగమశూన్యముగా నుపయోగింపఁబడినది- చాలసేపు వారి నిది యేమి యని ప్రశ్నింపనే లేకపోతిని, ఎందుచేత? పనివడినచో వారితో నేను వాదింపఁగలనో? లేనో? అనెడి భయముచేతనే, ఇది వినయార్థము వ్రాసినది కాదు, యథార్థము, చెప్పెడి దేమనఁగా? లక్షణజ్ఞానము లక్ష్యమునందుఁ బ్రతిబింబింపఁ జేయుశాస్త్రజ్ఞులు చాల నరుదుగా నుందురు- ఇది యొక వ్యాకరణశాస్త్రమునకు మాత్రమే కాదు. తుదకు నిత్యకృత్యముగానెల్లరును ననుభవించు శృంగార (రతిరహస్య) శాస్త్రమునకుఁగూడ సమన్వయించుకోవలసినదే, దానితోవ దానిదే, దీని త్రోవ దీనిదే, అనునట్లే పలువురపాండిత్యము లుండును- అందుచేత నిట్టి వైపరీత్యము కొందఱికిఁ గల్గుట వింతగాదు, అంతమాత్రముచే నాకవులు వైయాకరణులు కారని వ్రాయువిమర్శకులు తత్త్వవిదులు గారని నా యాశయము.

"అలరుమందాకినీ ♦ యార్యాసహాయుఁడై పొలుపొందు సర్వజ్ఞ♦మూర్తి యనఁగ"

అని మామతాతగారు వేంకటేశ్వరవిలాసములో వంశవర్ణనములో వ్రాసియున్నారు, లేఖకప్రమాద మనుకోవచ్చునసిన స్వహస్తలిఖితము- మందాకినీ=ఆర్యా, ఇకోయణచి అనుసూత్రముచే యణాదేశము రావలయు

నేనికూడ వారికిఁ దెలియదా? దీనినే ప్రమాదమందురు. ప్రమాదో ధీమతా
మపి, అనునభియుక్తోక్తి యిట్టిసందర్భమునకే పుట్టినది. ప్రతివిషయము
నకును ఆయీయభియుక్తోక్తి నుట్టంకించి సమర్థింపనెంచుట "పిడుక్కీ-
బియ్యానికీ" అనుసామెతవంటి దగును. దానిముద్రించునప్పుడు-

"అలరు మందాకిన్యహార్యజాయుక్తుఁడై"

అని సవరించి ప్రకటించుటచే నిప్పుడిందు స్ఫురింపనిచో నాపా
ఠము చదువరుల కగుపడనే యగుపడదు. తెలుఁగువిషయమునఁగూడ నిట్టి
ప్రమాదములు గొన్ని కలవు.

క. ఆ రాజేంద్రుని కగుభా
ర్య రతిశాస్త్రానురూప-

ఇయ్యెడఁ భార్య, అని హ్రస్వ ముండవలెను. దిద్దుచో గణమే
చెడును. ఇట్టి స్వల్పములు సహృదయులు పాటింప రనుటకు గుఱుతు
వీరేశలింగముపంతులుగా రీయనను సలక్షణకవియని వ్రాయుటయే వ్యాక
రణము తనకు వచ్చుననుటకు గుఱుతు స్వహస్తలిఖితమగు తాళపత్రగ్రంథమే
కాక యీ గ్రంథమునందలి కొన్ని పద్యములుగూడ నగును.

క. పదలక్షణసంజ్ఞావ్యయ
పదగుణవృద్ధిప్రయత్న ♦ పరరూపనవా
స్పదభావతద్ధితక్రియ
లాదనగ జెలిశబ్దశాస్త్ర♦మో యనఁదనరెన్ ,౧.

చ. చెలువగు ధాతురూపమును ♦ జెందుచుఁ బూర్వగుణానుభావమిం
పలరఁగ వృద్ధి భాసిలి ప♦రార్థనిధానత గాంచి వర్ణసం
కలితసులక్షణోన్నతి న♦గంబులు నాగములయ్యె వాఁగ మేల్
గలకలభంబు లుండఁ బుర♦లక్ష్మి గజాంతలక్ష్మియై తగెన్.

ఆయీ రెండుపద్యములును పాణినీయవ్యాకరణజ్ఞత కుదాహరణము
లగును. కందపద్యము స్త్రీవర్ణనము, చంపకమాల యేనుఁగులవర్ణన,
నగశబ్దము నాగశబ్ద మగుటకుఁ దగిన ప్రక్రియ యిందు శ్లేషతో వివరింపఁ
బడినది. ఆ పట్టణమునందలి యేనుఁగులు పర్వతములంత యుండునని ఫలి
తార్థము, ఇట్టి రచన పాండిత్యస్ఫోరకమే గాని కవితానైపుణీస్ఫోరకము

కాదు గాని శుద్ధచ్ఛాందసులగు కొందఱు పండితుల మెప్పును కాంక్షించి (తమ కిష్టము లేకపోయినను) యిట్టిరచన చేయుట మాకనుభూతము. విజయ నగర సంస్థానమున కేగినప్పుడు కొంత రచన మేమును జేసితిమి.

తే. గీ. అర్థవ త్తని యనధీన♦మని సమస్త
దేశసంగత మనియు న♦దేహమనియు
సర్ధవత్స్వాతంత్ర్యమందు నీ♦యాశము కొంత
గూఢముగఁ జెప్పెఁ బాణిని ♦ కువలయేశ.

క. మాపసమా ! నీపాగమ
గాపసమా ? మాపధాప♦గాగమనిసమా ?
మాపస నీపస గని గా
దా పరిపరి తుష్టిఁ జెందె ♦ నానందనృపా.

ఆయీ పద్యరచన వలన, కవి వ్యాకరణజ్ఞుఁడును సంగీతజ్ఞుఁడును నని తెల్పినట్లయ్యెడిని. కాని యీ రెంటియందును బ్రవేశములేనికవిగూడ నిట్టిరచన చేయవచ్చును. భవతు తగినంతప్రవేశముండి చేసినరచనకును తదితర రచనకును భేదము విజ్ఞులు పరికింపఁగలరు, మాముత్తాతగా రిప్పటికి సుమారు నూఱేండ్లకుఁ బూర్వమునఁగదా ? దీనిని రచించిరి. అంతకుఁ బూర్వమునందున్న గ్రంథములు దాదాపన్నియు సంపాదించి భద్రపఱచుకొన్నట్లు పుస్తకసామగ్రివలనఁ దెలియుటయే కాక కవితా రచన వల్లఁ గూడఁ దెలియుచున్నది. ఆయాకవుల పద్యముల పోలికలవలన నీయంశము స్ఫుట మగును.

సీ. ఒకపాలి పికబాలి♦కకు జాలి మదిఁ జిల్కఁ జిల్కలగ మికిరాఁ ♦ బల్కఁబల్క

పద్యమంతయు నిట్టియమకములోడనేనిండి యున్నది. ఈరచన వసుచరిత్రమునందలి—

సీ. ఒకవంక నలంక మకరాంక హయహేషలు !

అనుదాని ననుసరించి చిత్రించినది. మఱియు నిందు ఒకపరి, అనునర్థమున, ఒకపాలి, అని వాడఁబడినది. దిద్దిన-చో యమకము చెడును. ఈ పదము గ్రాంధికముగాదు సరిగదా ? వ్యావహారికముగూడఁ గాదనియే చెప్పవచ్చును. ఏదియునుగాక లోకమున లేకే పోవు-చో మాముత్తాతగారికి మాత్ర మిది యెక్కడినుండి వచ్చినది, వచ్చుటనుగూర్చి యోజించుటయే

కుమును గాదు. కాని మాగ్రామమున నిమ్నజాతులు
ఎన్ననాఁ డెఱుఁగుదును. ఆకారణమున మాతాతగారి
ని నే ననుకొందును. ఎచ్చటఁగాని దృగ్గోచరమో?
ని శబ్ద మేకవికవిత్వమందును దొరల దనునది నిర్వి
షపదము గ్రామ్యమని వాదించుటకుఁగూడ నాధార
జాతులు వాడినంతమాత్రమున గ్రామ్యమగునా?

రకులు, గొడ్లు, ఇల్లు, పొల్లు, వడ్లు, ఇవన్నియు గ్రామ్య
ము. ఉత్తమజాతులు వాడు—

రప - వుంచుంది - ఏమిషే - చూస్నావేం —

శుద్ధములు కావలసివచ్చును. గ్రామ్యముకూడ
వైదికగ్రామ్యము, నియోగిగ్రామ్యము, క్షత్రియ
గ్రామ్యము, శూద్రగ్రామ్యము, కాపుగ్రామ్యము,
కను నిట్లు పోఁగాఁ బోఁగా గ్రామ్యభేదాలు పెరుఁగు
పరల జిల్లాలను బట్టి కొంత విభజించ వలసి వచ్చును.
రిగినవాఁ డగునేని యితరమండలములందు వాడుకొను
లును. మాముత్తాతగారివలె నొకచోఁ గూపకూర్మము
ర్చువాఁడైనచో గ్రంథస్థమైన యితరమండలభాషతప్పఁ
తనయూరు తప్పదనయత్వారియూరు కాకరపర్తి
పొలముతప్ప నీమహాకవి యెఱుఁగనే యెఱుఁగఁడు,
క్కడనేని గ్రామ్యపదము దొరలినచో నది స్వగ్రామ
జాతులో వాడెడిదే కావలయును తదితరము కాదు.
ఱ ప్రతిపదమును గ్రామ్యమందురు, అది తప్పు స్వగ్రామ
అట్టి పిఠాపురప్రభువు తఱచుగాఁ దనగ్రామమున
అట్టితరుణములో నెందఱో ప్రభుదర్శన మెట్లో కలిగినఁ
ల మట, ప్రభుదర్శనమే విష్ణుదర్శన మనుకొనురోజు
చేసినపుడు పురస్త్రీలు పేలాలు చల్లుచు మంగళహారతు

లిచ్చునాచార మప్పుడున్నది-నాచిన్ననాఁడుకూడనున్నది- అట్టిధర్మికాలము లో నరసకవిగారు ప్రభుదర్శన మపేక్షించకుంటకుఁ గతమేమి.

"నిస్పృహస్య తృణంజగత్"

మ. ధనమంచుం గల దొక్కచి క్కదిగొనన్ దాత్పర్యమే లేనిచో
జననాథుల్ మఱి యెంద ఉందురో? కవీశద్వారముల్ గొల్చుచున్

అని నేను కామేశ్వరీశతకములో వ్రాసినయంశమును సార్థకపఱచిన విద్వత్కవులలో మామువ్తాతగా రొకరు, వక్తవ్యాంశ మీయనకవిత్వము సర్వమును గ్రంథావలోకనమువలనఁగల్గిన సాహితికిఁ జెందినదే గాని దేశాటనమువలనఁ గల్గిన సాహితికిఁజెందినది గాదనునదియే. తెలుఁగులో నెన్నివిధముల యమకము లున్నవో అన్నియు నొకచో చోటఁ దిలకింపవలె నన్నచో మాముత్తాతగారి యామినీపూర్ణ తిలకయందే యగుట కేవలస్వభావోక్తి, కథారంభపద్యమే.

సీ. అరుసంపు దొరలింపు, దొరలింపు మెఱుయింపుఁ బరువంపు నెఱగెంపుఁ జరులసొంపు

ఇట్లు నాలుగుచరణములును నిదే ధోరణియముకములో నడిచినది అర్థ మగుచున్నప్పుడుగాని యేపదమేని సవరించుట కవకాశ ముండదు-అస లర్థమే లేకుండ నేకవిగాని యేపద్యమును రచించుఁడుగదా! ఇది మేరుపర్వతవర్ణనము గీతిలో నీతెలుఁగుధోరణి వదలిసంస్కృతధార నడిపించినారు.

తే. గీ. మెఱయు పరగరుడోరగాం♦బరచరాది
పరమపురుషాతిశయ నిరం♦తరవిహార
విరచితాశ్చర్యరసధురం♦ధరశిరంబు
నిరుపమభరంబు నిర్జర♦గిరివరంబు.

ఈ సంస్కృతసమాస మన్వయించుట సుకరమే గాని అచ్చతెలుఁగు పదములే యైనను సీసచరణములందలి పదములు సమన్వయించుట సుకరముగా లేదు, దానికిఁ దోడు ముద్రాప్రమాణములు కూడఁ గలవు. ముద్రాపకు లేవో కొన్ని ప్రతులు సంపాదించియే దీనిముద్రణ కుపక్రమించినట్లు కొన్నిచోట్లఁ గొన్ని పాఠాంతరప్రదర్శనములవలనఁ దేలుచున్నది గాని ప్రూఫు చూచువారు సంస్కారులు కారని కొన్నిటివలనఁ దేలుచున్నది.

పూవింటి మేలని నవ్వె నొకతె

ఇది యేమాత్రము సంస్కారమున్నవారు ప్రూఫు దిద్దినను "పువ్వింటి" యని యుండవలయునుగదా? భవతు ప్రాజ్ఞులగు చదువరుల కిట్టి స్వల్పములు చూపి దిద్ద నక్కఱలేదు. రకరకాల యమకము లిందుఁ గలవు. వీని కన్నింటికిని మాముత్తాతగారికి మార్గదర్శకము లేపొత్తములో యని నా జీవితములో నేను జాలఁ బ్రయత్నించితిని గాని మాముత్తాతగారి పుస్తకసామగ్రియందే కాక యితరత్రకూడ నాకు లభించలేదు లేకపోవుఁగాక, ఈయనకు మార్గదర్శకు లుండకపోరని నేను దలంచెదను. ఈయన చూచిన పొత్తము లన్నియు నేను జూచితి నని చెప్పఁ జాలను గాని చూడకున్నను మార్గదర్శకులుండు రనియే నాయనుమితి. ఔచిత్య విషయమును జర్చించుచోఁ దెలుఁగు ప్రబంధములకెల్ల శిరోభూషణముగా గణింపఁదగిన వసుచరిత్రమే నిలువనియపుడు దానిని మాతృకగాఁ బెట్టుకొని పుట్టిన పొత్తములనుగూర్చి చెప్పనేల? తఱచుగా వసురాజుగారు విహారార్థ మరిగెడి కోలాహలపర్వతమందుఁ దత్పుత్రిక యూరుపేరు నెవరికిఁ గాని తెలియకుండ నిండుజవ్వనము వచ్చువఱకు డాగి అప్పుడు మాత్రమే బయలు వడుట సమర్థనీయమే యగునా? అది యటులుంతము. వసురాజుమిత్రుఁడు తనప్రభువున కచిరకాలములోనే పట్టమహిషి కాఁబోయెడి గిరికను జూచి రాజుగారితో మనవిచేయు నప్పుడు పాదాదిశిరఃపర్యంతమో? శిరఆదిపాదపర్యంతమో వర్ణించెను గదా? ఆవర్ణనలోఁ గుచముల వర్ణనకూడ నేచిన్నపద్యముతోడనో కాక పెద్దపద్యముతోడనే వ్యాఖ్యానింపవలయునా? అని విచారించినచోఁ దగిన సమాధానము కలదా? తెలుఁగుకవులేకాదు సంస్కృతకవులు కాళిదాసాదులమాటటులుండఁగా నీయౌచిత్యవిచారచర్చ కుపక్రమించిన క్షేమేంద్రుఁడుగూడ నితరులంత కాకున్నను నేకొంచెమో యీవిషయమున దొరకునని యే నేననుకొందును. దీనివలనఁ దేలు సారాంశము ప్రతికవియు నిప్పట్టున దొరకుచుండు ననియే, తక్కిన విషయములలో నితర తెలుఁగు కవులకన్న నెక్కుడుగా నౌచిత్య భంగ మీయన కవితలోఁ గనుపడదు గాని నాయికానాయకుల ప్రథమ సమాగమరాత్రియందే యావద్వాత్స్యాయనమునకును నుదాహరణము

లుపపాదించుటవలన నీకవి కేవలము ఛాందసుఁడు కాఁబోలునని సహృదయు లనుకొనుట కవకాశ మిచ్చుచున్నది.

శ్లో. ఆస్వాదిత దయితాధరసుధారసస్యైవ సూక్తయో మధురాః
అదళితరసాలముకుళో నకోకిలః కల ముదంచ యతి॥

అని గోవర్ధనాచార్యులు శృంగారమునకుఁ గొంత యనుభవ ముండు టావశ్యకమని వక్కాణించెను. ఈయన కించుమించుగా నలువదిసంవత్సరములు పూర్వుఁడు కూచిమంచి తిమ్మకవిగారు. ఆయన బహుగ్రంథములు రచించెను. భాషలో స్వతంత్రుఁడు. లాక్షణికుఁడు, కాని ఆయనపాత్ర ములలో నొకటియు—

"లోకులరసన లె యాకులు గా"

నుండుభాగ్యము పట్టినది కాదు. రాజశేఖరవిలాసములో నొక సీస పద్యము కాఁబోలును నాకు నచ్చినది-

సీ. నెఱజాణఁ డొకఁడింట ♦ నిద్దుర కున్నాఁడు రాఁడీరద నె నొక్క ♦ రాజవదన
కోడెకాఁ డొకఁడు తాఁ ♦ గోరినధనమిచ్చి వదలనీఁడ నె నొక్క ♦ వాలుగంటి
మిగులఁగూరిమి నేయువగ కాని నెడఁబాయఁ దగదుపొమ్మనె నొక్క తలిరుఁబోఁడి.

పయి భాగము జ్ఞాపకము లేదు, ఏదో కొంత్రిప్రోకడ యుండనిచో నెంత లాక్షణికమైనకవిత్వమైనను విశేషవ్యాప్తికి రాదు- కఠినపాకమైనను వసుచరిత్రకీభాగ్యము పట్టినది. మఱికొన్నిటికిఁ బట్టినది. భాషకొఱకు జదువ వలయునే కాని కొన్నిపాత్రములు, అన్యథాచదువ నక్కఱయే యుండదు. వీరేశలింగముపంతులుగారు వ్రాసినట్లు వసుమనుచరిత్ర లుదయించిన పిమ్మట నెందఱో కవు లదే ధోరణిలో రచన సాఁగించిరి, అట్టిరచన లేవియుఁ బేరంద లేదు. ఓగిరాల రంగయ్యగారో జగన్నాథముగారో? వసుచరిత్రలోనున్న ప్రతిపద్యమునకును నదేపోలికతో నొక్కొకపద్యమువంతునఁ జిత్రించి వ్యాఖ్యాన సహితముగా-

"సుమనోమనోజ్ఞ"

మనుపేరితో నొకసలక్షణప్రబంధమును బ్రచురించిరి కాని దానిప్రచారముగూడ నిపుడు కనుబడదు. వారిరువురును బ్రాచీనకవులలోఁ దుట్టతుది వారని చెప్పవచ్చును. మాముత్తాతగారికి సమకాలికులుకూడఁ గావచ్చును. నాకావ్యగురువులలో నొకరికి గురువులు. అచ్చు వేయకున్నను

అంతో యింతో ప్రచారము గల్గియున్నవి. అచ్చువేసినను గొన్నిటి
స్యము పట్టలేదు. మాముత్తాతగారి యామినీపూర్ణతిలక యేదో
వ నచ్చుపడినను అచ్చుపడనికబ్బములతో పాటిదే అయినను దీనిని
బు వ్రాసికొనుటవలన దీనియం దేదో గుణలేశ మున్నదని
ంప నయ్యెడిని. వసుచరిత్రలో వసంతవర్ణనలో నొక్కొక్కచరణము
కప్రాసములో లగించి సీసము చెప్పిన నంతకన్న నుత్కృష్టకష్టమని
ంకో యన మాముత్తాత పద్యము సర్వమును నొకటే ప్రాసతోఁ
దినాఁడు—

ీ. కాసారతరగవీచి ♦ కాసారభరమల్లి కాసారపరిఫుల్ల♦కేసరంబు

ఈనకారప్రాసములోడనే నడిసి తుట్టతుదకు— డాసె వాసిగమధు
ాసరంబు. అని డాసితోడనే ముగించినాఁడు. వసుచరిత్రలో నట్లు
యీచరణమున కాచరణము వేఱువేఱుప్రాసలలో నున్నది. స్త్రీవర్ణన
జాల వి స్తరించి చేయఁబడినది. శృంగారరసమునకుఁ బ్రధానపరీక్షా
ైన సంభోగవర్ణనకు సంబంధించిన సీసము చాలహృదయంగముగ
. దానిలో నున్న మొదటిచరణము నందలి యుత్ప్రేక్ష మాముత్తాత
కాని యితరులనుండి దొంగిలినది కాదని వ్రాయసాహసించుచున్నాఁ
ఎన్నోపొత్తములు చదివితినిగాని యీవిషయమున నీయుత్ప్రేక్ష
ెవలకుఁ గనుపడలేదు. అందుచే నిట్లు వ్రాయఁ గలిగితిని.

తనుసంగరకళా ♦ భ్యాసదేశికకళా ఘూతమో ? యన జడ ♦ కటి నటింప...
పినఁగి సిగ్గున సెద వ్రాలి ♦ బినరుహాక్షి

వర్ణ్యము పచ్చిశృంగారమే యైనను సంస్కృతసమాసాంతరిత మగు
ాసచ్చి కొంత కప్పుపడినది. ఇప్పటివా రీయుపరిసురతవర్ణనము నస
ుగాఁ దలఁచినను భోజమహాకవి లోనైనవారు దీనిని బరీక్షాస్థాన
సమ్మానించిరి. శిష్యురాలికిని గురునకును సంబంధించిన శృంగారము
మిక్కిలి యుచితమైన యుత్ప్రేక్షగానిది నాకుఁ దోఁచినది. దీనింబట్టి
ుత్తాతగారు అనుభవరసికులేమో యని కొంత అనుమానింతురేమో
కవులవిషయమున నట్లనుమానించుట యుక్తముగా దనుట కెన్నియో
సీసములు సాక్ష్యమిచ్చుచున్నవి.

"కవి గానని వో రవి గాంచ నేర్చునే?

చాలఁ దికమకగా నున్న పద్యము లున్నవి. సంప్రదాయజ్ఞులకుఁ గాని కొన్ని సమన్వయింపవు మచ్చు చూపెదను.

ఆ. వె. జలజ కనక కటక ♦ నళిన భద్రేభముల్
సకియకంఠకాంతి ♦ జఘనచరణ
గమనములకు సాటి ♦ గానక వనవృత్తి
నెదిరి పూర్వరూప ♦ పదమునొందె.

ఆయీపద్యము మొదటిచరణములోనున్న జలజ (శంఖ) ములోనైన యుపమానములైదును రెండవచరణములోనున్న కంఠము మొదలైన యైదింటికిఁ గ్రమముగా సమన్వయించికొని వనవృత్తి అన్న పదమునందున్న వనశబ్దమునకు నీరు, అడవి, అను నర్థద్వయమును గ్రహించి ఆయర్థద్వయములో, శంఖ నళినములకు నీటియందుండుటను దక్కిన త్రితయమునకు యథోచితముగా నడవిలో నుండుటను సమన్వయించుకొని ఆ యుపమానవాచకములైన నళినాదిశబ్దపంచకమును దలక్రిందుగాఁ బఠించి చూచుకొన్నచో దీని తాత్పర్యము గోచరించును. ఇవి యన్నియు శబ్దచిత్రముల కాహ్లాదించువారు సంతోషించు రచనలు. లక్షణగ్రంథములలో నధమకవిత్వములలోఁ జేర్చినను రచనమాత్రము సులభము గాదు. కవి చాలఁ గష్టించి రచించె ననునది ఆస్వాదించువారిరుచికి సాధనము గాదు. పాచకుఁడు కష్టపడి పచనము చేయుట ఆస్వాదించువారు గమనింతురా? వారి జిహ్వకు రుచిగా నుండుటయే వారికిఁ గావలసినది- ప్రకృతముగూడ నట్లే. గ్రామమునకుఁ జాతుర్వర్ణ్యముంబలెఁ గబ్బమునకుఁ జతుర్విధకవనము నవసరమే కనుక యమకముగూడ గ్రాహ్యమే. ఈమధ్యనే యొకరు నన్ను "యద్దేవ" సేయుచు నీవు చిత్రబంధాదికవిత్వములు చెప్పఁగలవా? యని ప్రశ్నించినారు- చిన్నతనములోనే "ఆయీముచ్చటతీరిన సందర్భము నెటిఁగియే ప్రశ్నించిన ప్రశ్నకు జవా బక్కఱలేదని జవాబీయక యూరకున్నాను- ఈకవిత్వరుచికూడ లాక్షణికుల వ్రాఁతలనుబట్టియే యుండుననుటకు వీలులేదు- ఒకొక్కకాలములో నొకొక్కమాదిరిగానుండు ననకతప్పదు. మాముత్తాతగారికాలమునాటికి యమకకవిత్వము చెప్పినట్టివాఁడే గొప్పవాఁడనికొనిచెప్పికొనువారనితోఁచెడిని- ఆకారణముచేతనే ఆకాలపుఁగవులకవిత్వ

ములు చాలవఱకు యమకప్రధానములుగా నగుపడెడిని. క్రమక్రమముగా మాకాలమునాఁటికిఁ దేలికమాటలలో నుండుటయే కవిత్వమునకు శోభావహమని తేలినది. అందుచే నేము బాల్యములోఁ దప్ప నిటీవల యమకము వదలుకొంటిమి. క్రమముగా మాకు వార్ధక్యమందుకొనునాఁటికిఁబద్యకవిత్వమునందే కాక పదకవిత్వమునందుఁగూడ రుచితగ్గి వ్యాకరణపుఁగట్టుఁబాట్లులేని లోకవ్యవహారపు మార్గములో నున్నదియే కవిత్వముగాని తదితరముకాదని తేలినది,

(1) అమ్మాయ్ ? మాదాకవళం తల్లీ ? నీబిడ్డలమన్నం తల్లీ,
(2) మహారాజులు తల్లీ ? లచ్చింతల్లీ,మీబిడ్డలపున్నెం అన్నంతల్లీ !
(3) ఓ ! గోఁవయ్యా ! కావు మాయింటిఁకేల రావు.

ఈమాదిరి శైలిలో నుండుటయే కవిత్వమునకు శోభావహమనువఱకు వచ్చినది. పలువురు నేఁడిట్లు రచించుచున్నారు. లోక మాదరించుచున్నది. సమర్థించుచున్నది. ఇంక ముందెట్లుమారునో తెలియదు. (హాసీతే కిం భవిష్యసి) లోకోభిన్నరుచిః, అనునభియుక్తోక్తి కాలో భిన్నరుచిః అని మార్చుకోవలసి వచ్చినది. ఎవరికాలములో నెట్టికవిత్వమునకు విలువ యుండునో ! ఆకాలములో నట్టికవిత్వము ప్రచారములో నుండును. మాతాతగారికిఁ గొంచెము పూర్వకాలపువారైన, అడిదము సూరకవి, తురగా రామకవిగార్లవలె రెంటిలో పెద్దదిగా నున్నను వారిప్రఖ్యాతి ప్రబంధమూలకముగా నిల్చినట్లు లేదు. చాటుపులుమాత్రమే వారివి శృతమగుచున్నవి. మా ముత్తాతగారివి చాటువులులేవు, ప్రబంధములే! అందును పేరుతెచ్చిన దీయామినీపూర్ణతిలకయే! నాకు శుద్ధమైన ప్రతి దొరకక దీనిని నేను ముద్రించుటకు సాహసింపనైతిని. ప్రకృత మిద్దానిని ముద్రించువారు నన్నుఁ బీఠిక వ్రాయుమని కోరుటచే నాకుఁ దోఁచిన యీనాలుగు మాటలును వ్రాసి మాముత్తాతగారియందు నాకుఁ గలభక్తిని వెల్లడించుకొనుభాగ్యము గల్గినదని సంతసించుచున్నాఁడను. మావంశము-

" కవితారంభప్రియుం భావుకం "

బనను ఈమహనీయుఁడు బయలుదేరనిచో నట్టి యశస్సునకుఁ దగిన దోహదము కలిగెడిది కాదు. కనుక మావంశము కవితావంశమని

యర్థము చెప్పికొని, కంఠము శంఖము వలెనున్నదియని సమన్వయించు కోవలయును.

సీ. వనకేతకిని జూడు♦మని వేడికొనినఁ బన్నగవేణి ? తాడింపఁ♦దలఁప నగునె !

ఈ సీసమంతటను నక్షరముల తగ్గింపుతో నర్థభేదము వచ్చి యేదో బాధ సూచిత మగును. తాడించు = కొట్టు, తా = తకారము, డించు = తగ్గించు, కేతకిలో తా డించినచోఁ గేకియగును. పన్నగవేణి కది బాధక మని తాత్పర్యము. తఱుచుగా నిట్టి తికమక లీయన కవిత్వమునం దుండు టచేఁ బండితు లెవరో తప్ప వ్యాఖ్యానించుటకు సాహసింపరైరి. చిన్నతన మందు సంప్రదాయజ్ఞులవలన వినియున్నకతన దీనిని నేను (అభిమన్యుఁడు పద్మవ్యూహమువలె) భేదించఁగలను గాల తుదనెగ్గు విషయమున నాకును సందేహమే, దానికిఁ గారణము సరియైన ప్రతి చూచుట తటస్థింపకపోవు టయే, అసలు మాచేయిదాఁటి పోయినను నీపాత్రము స్వరూపనాశమును బొందక భాషాప్రపంచమున నిలువఁ గల్గుటకుఁగారణ మీకవిత్వమునందు విద్వల్లోకమునకుఁ గలయాదరాతిశయమే కాని అన్యముగాదు.

చ. మునుపు మహాకవీంద్రులు స♦ముజ్జ్వలరీతి నొనర్చు కబ్బముల్
విను తికి నెక్కఁగాని యవి♦ వేకులకూఁతలు తాటియాకులం
దునె నశియించె — శతావధానసారము చూడుము.

మాముత్తాతగారికాలమున జనించిన యేపాత్రమునకుఁ గాని దీని కున్నంత ప్రఖ్యాతి లేదు. కవిత్వప్రభేదములు నేర్చికొనువారి కియ్యది పెద్దగురువని చెప్పుటకు సంశయింపను. నాకు మా ముత్తాతగారే యీ పుస్తకరూపమున వచ్చి

"కావ్యజ్ఞశిక్షయాభ్యాసః"

అనుసంప్రదాయము నెఱవేర్చుటచే నే నీయనయందుఁ గులగురు మర్యాదనుమాత్రమే కాక విద్యాగురుమర్యాదనుగూడఁ జూపవలసినవాఁడ నయ్యు నక్కడక్కడ శాస్త్రచర్చ చేసి కొన్నిదోషములు నిరూపించి యుంటిని. అట్లు నేను యథార్థమును వెలువరింపనిచో భావివిమర్శకులకు నవ కాశమిచ్చినట్లగును, ఇపుడో? గురువుగారికే తప్పులు చూప మొదలిడినాఁ డీప్రబుద్ధుఁ డందురు. (నేయ ముభయతఃపాశారజ్జుః) ప్రస్తుత మింతకా

కున్నను నేకొంచెమో గురుత్వమున్నవారివిషయమున నిట్టిదోషమునే చేయ వలసి వచ్చినను నందుల కంగీకరింపక వారిచే నాక్షేపింపఁబడిన యాక్షేపణ లకు సదుత్తరములుమాత్రము చూపి ఆయీపాతకమునుండి చాలవఱ కెట్లో తప్పించుకొన్న సంగతి-

"ఈచెళ్ళపిళ్లయే లేఁగుచో నిఁక దిక్కెక్కడ? కృష్ణభారతగవీనృత్యానకుఁ జూడవే"

అను జయంతిలోని పద్యమువలన విస్పష్టమే. ఈకులగురువువిషయ మున నట్లు తప్పించుకొనుట కవకాశము కలిగినది కాదు- కర్తవ్యమేమి? భవతు-

శ్లో. శత్రోరపి గుణావాచ్యా దోషా వాచ్యా గురోరపి.

అను సభియుక్తోక్తియే నాకు సర్వథాశరణ్యముగుఁగాక-శబ్దార్థ విషయ మున గురువుగారివిగాని తదితరులవిగాని అనఁగా? గురుగురువులవిగాని ప్రమా దములు చూపుట గురుదూషణముగా విజ్ఞు లెవరును భావింపరనికూడ నాకు ధైర్యము కలదు. ఇందుల కెందఱో వ్యాఖ్యాతలపోకడ లాధారమని యెఱుఁగఁదగు. ఈయనయందు నాకున్న గౌరవాభిమానములసాధారణములు.

ఈయనం బట్టియే నేను జయంతిలో-

"కులావిర్భూతితోపాటుగా
నెట్టో పుట్టినయాత్మసత్కవిత నే ♦ రేమాత్రముం దూఱునా
చెట్టుఁ సైఁపఁడు పార్థుఁడన్నపయి లే♦చెం జూచినా రేకదా?"

అని గర్జింపఁగాఁ గల్గినది- మా చెళ్లపిళ్ల యింటిపేరు గల భార ద్వాజగోత్రజులలో నంతో యింతో కవిత్వము రచించువారు పలువు రున్నను వంశమునకుఁ బ్రతిష్ఠ తెచ్చినది యీసరసకవిగారే, రచించిన గ్రంథ ములు మఱికొన్ని యున్నను పరిష్కృతగ్రంథమే యీయనరచనకెల్ల శిరో భూషణము. నే నీయన కైకొన్నకథావస్తువును బట్టియే శ్రవణానందములో-

"కవులకతలకు రాజులకతలు లొచ్చు"

అని వ్రాయఁగల్గితిని ఈకథలో నేమాత్రమో స్వకపోల కల్పిత ముండకపోదు గాని అట్లున్నను నిది జరిగినదిగాని కేవలకల్పితము గాదని చోరపంచాశత్తువలననే తేలుచున్నది- బిల్హణుఁడు విక్రమాంకదేవచరిత్ర ములోఁదన జీవితచరిత్రను గొంతవఱకు వ్రాసికొన్నాఁడుగాని యెత్తు కొనుట యుక్తముగా నుండదనియో యేమో? ఈశృంగారవిషయము

నె త్తినో లేదు. తుదకు వివాహము జరిగినది కనుక నిది యెత్తికొన్నను నంత యాక్షేపణీయముగా నుండెడిది కాదేమో? ఈవిషయ మెత్తికోలేదు గాని విక్రమాంకదేవచరిత్రములోఁ దాను మిక్కిలి సౌందర్యవంతుఁడనని మాత్రము కంఠోక్తిగానే చెప్పికొన్నాఁడు, దానింబట్టి—

"విద్యారూపం విరూపాణామ్"

అనుతెగలోఁ జేర్పఁదగినవాఁడు మాత్రము బిల్హణుఁడు కాఁడనియు నక్కతననే మహారాజపుత్రిచే వరింపఁబడెననియు నూహింప వచ్చును. వావికూడ కూతురివావి కూర్పవచ్చుననుటవలన దూష్యముకాదు. ఆదేశపు బ్రాహ్మణు లెల్లరును సౌందర్యవంతులే. మహా విద్వాంసులేయని చెప్పుట కనేకములు గ్రంథాధారము లున్నను విస్తరభీతిచే నుపేక్షింపఁబడియె.

"గాత్రేణ స్మరగర్వఖర్వణపరే"

అని శ్రీహర్షునిఁగూర్చి అన్న గోవిందపండితుఁడువర్ణించియున్నాఁడు. మన తెలుఁగువాఁడైనను పండితరాయలుకూడ మంచి యందగాఁడేయని తోఁచెడిని. ఈయన డిల్లీవల్లభుని కొమిరెకు వల్లభుఁడుకదా? భవతు మా ముత్తాగారు రచించుటచే నేను శ్రవణానందమునకుఁ గథావస్తువుగా నీయితి హాసము కైకొనలేదుగాని అట్లుకానిచో దీనినే కయికొనెడివాఁడను. ఇంకొక మాదిరి పద్యసమన్వయము చూపి దీనిని ముగింతును.

సీ. సతులు మాయాధుర్యచతురల్ గదే?
యార! యామాట పల్కఁ మేలగునటోయి?

ఇది గ్రంథము తుదిభాగములోనిది బిల్హణుని, శిరశ్ఛేదమునుండి తప్పించి కొమార్తనిచ్చి వివాహము చేసినపిమ్మట సతీపతుల ప్రథమసమా గమఘట్టమునందలిది. భర్త-స్త్రీలు మాయలాడులు అని వేళాకోళమునకై యనినమీఁద భార్య చెప్పునుత్తరముకూడఁ బ్రితిచరణమునందు నుత్తరదళ ముందుండును.

ఆ మాట పల్కుట యుక్తముగాదని పైకిఁ దోఁచునర్థము అంత రార్థము, ఆమాట అని కాక, యామాటఅని యకారాదిగనే చూచికొని యా అనెడి యక్షరముతోఁ గూడినమాట, యామాట (మధ్యమపద లోపము) అని అర్థము చెప్పికొన్నచో యామాట అనఁగా? మాయా

ధుర్యపదములోనున్న యా అనెడి అక్షరముతొలఁగింపవలయునని తేలును. అపుడు, మాధుర్యచతురలము గాని మేము మాయాధుర్యచతురలము కామని ఫలితార్థము తేలును. ఇట్లే యావత్తు సీసపద్యమును ప్రశ్నోత్తరములతో సమన్వయించుకొన వలయును. సుమా రేఁబదియేళ్లక్రిందట మాముత్తాఁతగారి గ్రంథము నేను కాపీ చేసినప్పటిజ్ఞాపకమును బట్టి యీపద్యచరణ ముదాహరించితిని గాని పీఠికవ్రాయవలసినదని కోరిన ముద్రణకర్తలు నా కిప్పటికిఁ బంపినది. మూఁడాశ్వాసములుమాత్రమే. ఈ సీసములో నింకొకచరణముగూడ జ్ఞప్తికి వచ్చినదిగాని సగముమాత్రమే,

"ఓంబోష్ఠులవసరప్రియతమల్ గదె? యకార?"

ఉత్తరదళము బాగుగ స్ఫురించినది కాదు.

ఈచరణములో, అవసరశబ్దములో నున్నసకారమును దీసివేయు నెడల మీారన్నమాట సరిపోవునని యర్థము రావలయును. నాకు జ్ఞాపకమున్న పాఠములో నట్టి యర్థము స్ఫుటమగుట లేదు, మార్గము చూపితిని గాన దీనిననుసరించి ప్రాజ్ఞులే తక్కినది సమన్వయించుకొందురుగాక- ఈయన కిట్టికవిత్వమందు మిక్కిలి ప్రీతి, "శరదంబువేణికి" అనుపద్యము యావత్తును నొకశరదశబ్దమునే నానావిధాలుగా మార్చి తుట్టతుదకు-

"అలరు చన్గుత్తు లీకొమ్మ ♦ కలరుఁజుమ్మ"

అని తేల్చిన మహానుభావుఁడు మాముత్తాత. నాజీవితములో నీమాముత్తాతగారు చాల ముదుసలియై జీవించియుండినచో నాకును నీయ నకును——

"తాతామనుమలవరుసగా"

నొక్కింత వాదోపవాదాలు పొసఁగి లోకము సంతసించుటకో! విచారించుటకో! కారణముగాఁ బరిణమించునని యీనాపీఠికను జదివిన విజ్ఞులనుమానింతురేమో యని నాకు శంక కలుగుచున్నది- కలిగి చేసెడిదేమి? నాకుఁ దోఁచినవిధమున దీనిని విమర్శించి వ్రాసితిని- సర్వవిధముల మా ముత్తాతగారు విద్వాంసులు. శ్రీరామమంత్రోపాసకులు. మహాకవులు. చతు

ర్వ్విధకవితాధురంధరులు. కాని సంస్కృతసమాసములందుఁ గ్వాచిత్కముగాఁ బొరఁబడినట్లు నాకుఁ దోఁచినది "కాదన్న వాఁడు కరణ మన్నట్టుగా నేదో అమర్చినదానిలో నత్తగారు వ్రేలు వెట్టినట్లు తెలిసీతెలియనిమాటలు వ్రాయుటకేమి? నామాత్రము పాండితి లేనివారుగూడ జాబితా తయారు చేయవచ్చును- ప్రబంధనిర్మితి కష్టసాధ్యముగదా? తెలుఁగు కూర్పులో నాయనకు జిక్కిన లక్షణ గ్రంథసామగ్రినిబట్టి ఆయన రచన నిర్దుష్టమే, కాని చిత్రకవిత్వసందర్భములలోఁ గొన్నిలోపములు విద్వాంసులు క్షమింపఁ దగినవి లేకపోలేదని నాయాశయము ఈయనయే యేదో వర్ణనావ్యాజము మీఁదనే గ్రంథమును పెంచెనుగాని అన్యథాగాఁ గాదు తన్ను స్వయముగా వచ్చి బహూకరించిన రాజు నొకపద్యములో - విమలరేచర్లగోత్ర పవిత్ర మూర్తి" అని స్పృశించి గౌరవించెను అంతే- నిస్పృహస్య తృణం జగత్, ఒక్కపద్యము యమకమున కుదాహరించి విరమింతును—

చ. గతితళు కంచకన్న మెఱుఁగా? మెఱుఁగా? మెఱుఁగారుతీరు ప
ర్వతకుచమోవి చూపు తొగరా? తొగరా? తొగరా మొగమ్ము స
మ్మతిమెయి కంఠ మెన్నఁ దరమా? దరమా? దరమావలగ్న సీ
మతురుము కేల్ తమోవిసరమా? సరమా? సరమార! నాభియున్.

దీని సమన్వయవిధానము వివరించ వలసియున్నను విస్తరభీతిచే జదువరులకే వదలితిని, దీనిలో సరశ్శబ్దమునకుఁ దెల్గులో సరస్సు సరసు అని కావలసియున్నను సరము అనుట యమకమునందలి లోభముచేతఁగాని కవికిఁ దెలియక కాదని విజ్ఞు లొప్పుదురు. నే నింతవఱకే తెలుఁగుపొత్తమునఁగాని చూచి యెఱుఁగని పోకడ గల పద్యమొకటి యుదాహరించి లోఁగడ నావ్రాఁతవలన మామత్తాతగారి కేమేని కోపముగల్గినచో నీద్వారమున దాని కుపశాంతిని గల్పింతును.

చ. మదభసలాళి వంటికచమా? మృదురంభలవంటి యూరులా?
మదనదరంబువంటి గళమా? విరిబంతులవంటిగుబ్బలా?
కదలనిమించువంటి తళుకా? ముకురమ్ములవంటిచెక్కులా?
మదవతిజవ్వనం బమృతమాధురి సేయదె? యెంతవానికిన్.

ఈపద్యమున కిదియే సాటి, ఎందుచేత నని ప్రశ్నించుచో జవాబు చెప్పఁజాలను కాని-

"తస్మై నమ స్స్వాదుఫలోన్ముఖాయ"

అని నమస్కరించి యూరకుందును, ఇట్టి మహాకవికి నేను అన్న గారి మునిమనుమఁడను.

నా రెండవపినతండ్రి కొడుకు చిన్న వేంకటశాస్త్రి తండ్రివంక నావంటి మునిమనుమఁడే కాని తల్లి యమ్మక మహామహునకు దౌహిత్రియగుటచే సాక్షాత్తుగా మునిమనుమఁడుకూడ నగుచున్నాఁడు, అతఁడల్పాయుష్కుఁడై త్రిదశపరిమిత వయస్సునఁ ద్రిదశాలయము నలంకరించినను దేవీభాగవత దశమస్కంధము నాంధ్రీకరించుటచేఁ గవులలో నొకింతస్థానము నార్జించుకొన్నాఁడు. నేను దీర్ఘాయుష్మంతుఁడనగుటచే నిప్పటికిని నేదో రచన సాగించుచునే యున్నాఁడనని లోక మెఱిఁగినదే! మా చెళ్లపిళ్లవంశమునకేమేని కవితా విషయమునఁ బేరుప్రతిష్ఠ లున్నచో నందులకీసరసకవిగారే మూలపురుషులు, మా కడియపుఁ గుటుంబమువారు గాని యితరత్ర నున్న కుటుంబములవారుగాని యీ సరసకవిగారిపేరు చెప్పికొనియే గర్వపడవలసినవారు (చెట్టుపేరు చెప్పికొని పండ్లమ్ముకొనుట సుప్రసిద్ధమే కదా) ఆగర్వ మీసీ: చరణము తెల్పును.

సీ. పెద్దకవీంద్రుఁడై * పేరు గాంచినవాఁడు పిన్నముత్తాత స*రసన్న గారు
తే. గీ. ..............................కలవి
[illegible]ల్లను చిన్న*ముత్తాత తనదు
గ్రంథముల విస్తరించె నా*కన్న నింటి
పే రొలుఁగఁ జెప్పుదను చెళ్ల*పిళ్లవారు.

తనయనంతరమున బయలుదేఱు తనవంశస్థు కవుల కుపకరింపవలయునను నూహతో నీమా ముత్తాతగారు తనవాటా పొలములో మంచి వెడల్పుగా నుండు నాకులుగల తాటివిత్తనములు నాటినట్లు మాతండ్రిగారివల్ల వింటిని. ఆ చెట్లిప్పటికిని గొన్ని కలవుగాని ఆపత్రములమీఁద వ్రాయుటచేత గాని మాకు వానివలన నేమి యుపకార ముండెడిని. నాచిన్ననాటికిఁ గొన్నివందల పుటలు గల ఆలేఖములు (వ్రాఁతకు సంసిద్ధపఱిచిన తాటాకు పుస్తకములకు నాలేఖములని పూర్వుల వాడుక) నాలుగైదుండెడివి. అవి

యును నా కుపకరింపకపోవుటచేఁ గొతికిఁ గొబ్బరికాయదొరకినట్లే యైనవి. కొంచెము వయస్సు ముదురునప్పటికే నవీననాగరికత ముంచుక వచ్చి పైఁ బడినది. ఇఁక తాటాకులజోలి యెవరికిఁ గావలయును ? వీని మాటటు లుంతము, కలము సిరాబుడ్డియుఁగూడ మూలఁ బడినవి. పౌంటెన్పెన్ను కవిత్వములోనికి దిగితిమి, ఇంత తేలికలోనికిఁ దత్రత్సామగ్రి వచ్చినప్పుడు

"అమ్మా ? మాదాకవళం"

దగ్గఱకుఁ గవిత్వముమాత్రి మేల రాకుండెడిని ? పూర్వకవులు కష్టించి చదివికొన్నారు. వారి కవిత్వముకూడఁ గష్టించినవారికిఁ గాని సమన్వయింపదని ఆయీ మాముత్తాతగారి రచనవల్లఁ దెలిసికొంటిమిగదా ? ఇప్పుడు లఘూపాయములో విద్య సంపాదించిన అస్మదాదులకో ? లఘు పరిశ్రమకూడ నక్కఱ లేకుండ దెలియఁదగిన-

మాదాకవళపుఁ

గవిత్వమే ఆస్వాద్యమని సమన్వయించుకోవలసి వచ్చినది. ఇట్టి రచనలు పాశ్చాత్యులలో నున్నవనియు నియ్యవి తదనుసరణప్రియుక్తము లనియుఁ గొందరనిరి. కావచ్చును! ఆభాష బొత్తిగారాని నా కందలి మంచి చెడ్డ లెట్లు బోధించెడిని-

"తెలియ దేమందురా ? దేవుఁడా ? యింగ్లీషు"

కదా ? మాబ్రదుకు, పై విషయమే కవికి వర్ణ్య మగుచో-

ఉ. కొందఱు సోదరీమణులు♦కొప్పులు మల్లెసరాలవాసనల్
చిందఁగ రోడ్డుప్రక్క నును♦చీఁకటియే తెరచీర గాఁగ నం
దందున నీళ్లచెంబు లిడి♦యావల దవ్వుననుండి యెట్లొ మ
మ్ముం దరి కేగఁ గాంచి పెడ♦మోమయి నిల్చిరి గ్రుడ్డివెన్నెలన్.

అనునదికూడ వర్ణ్యమే యగునేమో ? యని నే నొకరి నడిగితిని. వారు దానికామోదించిరి గాని దీని కామోదింపరైరి. భాషలు వేఱు వేఱయినను గవులభావములు చాలవఱ కేకీభవించుచునే యుండుననుట సర్వసమ్మతము. దీనింగూర్చి యన్యత్ర చర్చించి యుంటచే నిట స్పృశించి

విడిచితిని, పూర్వకవులలో నేదో కొంత నియమముతో జీవయాత్ర సాగిం చిన కవులలో మా ముత్తాతగారుకూడ నొక్కరు. కూచిమంచి తిమ్మకవి గారు పిఠాపురపుఁ బాదగయకు స్నానమునకు వెళ్లి అటఁ గుక్కుటేశ్వరు నభిషేకించి స్వగ్రామము చంద్రమపాలెములో రచన సాగించుచు రాజాను గ్రహము నపేక్షింపక దైవానుగ్రహమునకు దోసిలొగ్గుచుఁ గాలక్షేపము చేసినట్లే మా ముత్తాతగారును నిత్యమును రెండుమైళ్లదూరమున నున్న గౌతమి కేగి స్నానము చేసికొనివచ్చి విద్యాగోష్ఠితోఁ గాలము వెళ్లఁ బుచ్చిరి. వారివలెఁ బ్రవర్తింతమన్నను అస్మదాదుల కిప్పు డవకాశములేదు. తుద కఱఫర్లాంగులో నున్న కాలువ కేగుచో సైకిలే శరణముగదా! యిపుడు సర్వమును మారినది. ఇంకను మారనున్నది, కాని వారికున్న యానందముమాత్రము నేఁటివారికి లేనట్లే బాగుగ యోజించినచో గోచ రించును.

మ. చదువుల్ విస్తరికుట్లు జందెపుఁబనుల్ ♦ చాపల్ మటిక్ దొడ్లలో
బొదలుంగూగలు గాఁగ వర్తిలిరి త ♦ ద్భూమీసురుల్ నేఁటిసం
పద మోటారులు మేడ లోడలును గా ♦ మారెంగదా ? వీరి కు
న్నదె ? యవ్వారలతృప్తి వారిసుఖ మా ♦ నందంబు కామేశ్వరీ.

మాముత్తాతగారిని బ్రత్యక్షముగా నేను జూడకున్నను భావనచేఁ బైపద్యములో నాయనజీవితము వర్ణించితిని- అస్మనాదుల కట్టి మంచి జీవి తము కావ్యమైనను వాతావరణ మందులకుఁ బూర్తిగా వ్యతిరేకించి యుంటచే నలభ్యము, "నలుగురితోటిపాటు నారాయణా, కులంతోపాటు గోవిందా" అనులోకోక్తియే నేఁటికవులకు శరణ్యము, ఏదోపూర్వజన్మము నందలి సుకృత మొక్కింత తోడ్పడఁబట్టి ప్రాచీనమార్గానుయాయులైన పండితుల శుశ్రూషించు భాగ్యము కొంతమాత్రమేని కలిగినది యని సంత సింతును, శ్రీ నుదల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారితోఁ బ్రాచీనకవుల వేషము పరిసమాప్తమైనది. ఇటీవల వేషమే కాదు, భాషయే కాదు సర్వమును మారినది. సర్వథా ఆకవులు ధన్యులు-

"నా౽నృషిః కురుతే కావ్యమ్"

అను సభియుక్త్యోక్తి వారికే సమన్వయించును. మామున్త్రాతగారు వారిలో నొకరు-

"ధన్యో మాఘకవి ర్వయంచ కృతిన స్తత్సూక్తిసంశీలనాత్"

శ్లో॥ జయంతి తే సుకృతినో,
రససిద్ధాః కవీశ్వరాః
నాఽస్తి యేషాం యశఃకాయే
జరామరణజం భయమ్

స్వస్తి

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
శతావధాని.

# తప్పొప్పులు

—o—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 4 | 26 | లోకము | లోకనము |
| 5 | 3 | ఘూకము | ఘూకము |
| 15 | 19 | భామ | చామ |
| 17 | 14 | ము◆పం | ముం◆పం |
| 34 | 3 | సఖియ | సకియ |
| 43 | 11 | ధ్యాంఘ | ధ్యాంఘ్రి |
| 44 | 23 | మానితాంగ | మారసమానితాంగ |
| 51 | 10 | గ్రిహంబు | గృహంబు |
| 68 | 18 | పౌఢాం | ప్రౌఢాం |
| 75 | 4 | మధు | మృదు |
| 85 | 5 | నిన్మల | నిమ్మల |
| 91 | 4 | వ్రిదేశం | ప్రదేశం |
| 93 | 7 | బాతుల | బాతువుల |
| 95 | 15 | సాళికి | సాళికిని |
| 103 | 7 | పూవింటి | పువ్వింటి |
| 111 | 10 | లెగయఁగా | లెగయఁగ |
| 116 | 25 | చంద్రుడు | చంద్రుండు |
| 128 | 27 | గురుణ | గరుణ |
| 136 | 5 | గుణదామ | గుణధామ |
| 136 | 6 | ధామా | ధామ |
| 150 | 9 | వాతెటవాతెర | వాతెర |
| 150 | 15 | చూచ్చుక | చూచుకం |

| | | | |
|---|---|---|---|
| 156 | 6 | కాంతుని | కంతుని |
| 157 | 11 | నాహి | నాహిత |
| 167 | 16 | యేలమి | యెలమి |
| 168 | 7 | జొట్టు | బొట్లు |
| 168 | 9 | బాహులు | బహులు |
| 176 | 8 | త్మాంకన | త్మాంకమున |
| 178 | 14 | జాలముల్ | జాలకముల్ |
| 180 | 9 | యాల | యల |
| 201 | 7 | నగత్మాంగ | నగత్మలంగ |

——— o ———

శ్రీ ర స్తు.





# యామినీపూర్ణతిలకావిలాసము

## ప్రథమాశ్వాసము



శ్రీమద్దర్పణకల్పితాత్మసురత
క్రీడాగృహాభ్యంతర
క్షేమారంభనవప్రదీపకళికా
శ్రీరమ్యచిత్రావళీ
సామర్థ్యోదితదీపికాజనమతిన్
సద్యస్త్రసాలాప యా
భూమిప్రోద్భవఁ గౌఁగిలించి నగు త
ద్భూభర్త మమ్మేలుతన్.

సీ. హరితనూభవసూతుఁ ♦ డద్రిసుతోపేతుఁ
డబ్జారిధారి నా♦గాసురారి
1సవనఘనాకారి ♦ కువలయక్షయకారి
యాభీరహితుఁడు స♦త్యాభిరతుఁడు

---

పాఠాంతరము. 1. గోవర్ధనోద్ధారి ♦ కువలయక్షయకారి
మధుజిత్ప్రభారి మ♦న్మథవిదారి

నరకపరిభేది కి♦న్నరపావనవినోది
పరబాణశమితుఁడు ♦ భవవిజితుఁడు
భద్రరేఖాస్ఫూర్తి ♦ పదభవ్యమూర్తి పు
ష్కరనేత్రుఁ డండజా♦భరణపత్రుఁ
తే. గీ. డమలబృందావనవిహారుఁ ♦ డఖిలభూత
చారణుండును నిగమాంత♦కారణుండు
మాధవుండును నిఖిలక్ష♦మాధవుండు
భూరికృపచేత మము వేడ్కఁ ♦ బ్రోచుఁ గాత.

చ. వినుతమునీంద్రసంఘపరి♦వేష్టితుఁ డై ధవళాబ్జకర్ణికా
సనపరిసంస్థితుం డగుచు ♦ సర్వచరాచరరూపసంఘముల్
ఘనతరలీలచేఁ బ్రతిమ♦కాండముగా సకలేంద్రియాళిఖే
లనగుణపంక్తిగా 2నినిచి ♦ లాస్యగురుం డగు ధాత గావుతన్.
చ. పరిణయవాసరోత్సవస♦పర్యవిశేషవిలాసవైఖరిన్
వరపుర 3మార్గనిర్గమన♦వాంఛ జనం భృగుదారసద్దయా
పరవరవీక్షణేచ్ఛఁగని ♦ భక్తిని భర్తమనోనువర్తియై
నిరతము ముగ్ధవృత్తి మది ♦ నిల్పుధరాత్మజ మమ్ముఁ బ్రోవుతన్.
మ. కలహంసీనటనాను4మోదిని మధు♦గ్రాసోన్మదాళీలస
5త్కల సంగీతసమున్మనోబ్జ యగుచుం ♦ గారుణ్యాశోభాకృతి
న్విలసత్పుష్కరకర్ణికాత్మభవనో♦ర్వీపీఠికాసీనయై
యలరున్ లేములఁ బాపులేమ మము స♦ర్వైశ్వర్యులం జేయుతన్.
సీ. పల్కుటాల్ దొరగ్రుడ్డు ♦ పసటు లాటలపట్టి
సిరిబాసలిరుదట్టి ♦ చెలిమిజట్టి

పా 2 నిలిచి.
పా. 3 నిర్గమేచ్ఛఁజన ♦ నైళమి భార్గవకృశ్య మేలు సే
ర్పు రుచి సపత్నిశంక నతి♦భక్తిని
పా. 4 మోద మధులి♦ట్కల్యాణసంపల్లస
పా. 5 త్కల గీతామృతమానసాబ్జ యగుచుం

నుడిపడంతుకమాను ♦ యడుగుజాలేరాలు
మినుసికదోరసాము ♦ మేడగీము
[6]వేల్పుటోరెప్పుటిమ్ము ♦ వెలలేనితలసొమ్ము
చలువల వెదఁజల్లు ♦ మొలచి నిల్లు
పగడపంట నెసంగు ♦ బలువేలుపు నిసుంగు
క్రొత్తసింగపుసాని ♦ కత్తలాని

తే. గీ. గాఁగ జగములఁ గడలేని ♦ కనికరమున
మనుచు గోనములగని యనఁ ♦ దనరు చున్న
మొయిలు విరిదిప్పదొనజోదు ♦ ముద్దుగుమ్మ
మేలుఁ జేకూర్చి వేడ్క మ ♦ మ్మేలుఁ గాత. 6

సీ. సవనభుఙ్మూర్ధన్యభా♦స్వన్మౌళిమణిఘృణి
పరివేష్టితాంఘ్రి యై ♦ భాసురాంగి
చంద్రచంద్రామృత♦చందనమందార
కుందబృందాభ యై ♦ యిందువదన
శుకరాజహేమపు♦స్తకరత్నవీణాబ్జ
రాజత్కరాగ్ర యై ♦ రమ్యమూర్తి
ప్రమదసారససార్వ♦భౌమగంధర్వాభి
ధానవిఖ్యాత యై ♦ ధన్యచరిత

తే. గీ. యమ్మహావాణి జలధర♦శ్యామవేణి
పరమకల్యాణి సద్మసం♦భవునిరాణి
జితదరశ్రేణి మోక్షని♦శ్శ్రేణి మాకు
మృదువచస్స్ఫూర్తి యొసఁగూర్చి ♦ మించుఁ గాత. 7

మ. కరమొప్పం జనకాంకయుక్తిఁ దగుచుం ♦ గంగాసువర్ణాబ్జము
ల్గైరలింపం గర మూన భర్త కది సం♦కేతక్రియన్మ్రోయఁ ద

పా. 6 బలువిప్పు గళలపా♦స్తుల గుబ్బతలమబ్బు

7త్వరపశ్చాననదృగ్విశేషనివస♦ద్వామాంకుఁడై తత్పితృ
స్థిరసమ్మోదనకారి యౌ గజముఖున్ ♦ సేవించి కీర్తించెదన్.

సీ. ఆజి భూమైత్రి స♦ఖ్యానందసంధాన
కౌశల శేముషీ♦ దేశికములు
రాఘవజనకజా♦మోఘసందేశాక్ష
8రామృతసారక్షు♦ణ్ణాంకురములు
9నగభిద్భిదాస్త్రరు♦ణాక్షుణ్ణలక్ష్మణ
ప్రాణసంరక్షణ♦భౌరికములు
రాక్షసాంతవ్రతా♦రంభదీక్షాధిశ
సారదోఃకీలిత♦దోరకములు

తే. గీ. ఘనజగత్ప్రాణనందనా♦గ్రణి కృపాక
టాక్షవీక్షణములు సుధీ♦రక్షణార్హ
భాస్వదేతత్ప్రబంధమై ♦భవవినింద్య
మానకుకవిభయభ్రాంతి ♦ మాన్పుఁ గాత.

తే. గీ. దండి భవభూతి భవభూతి ♦ పండితాచి
రప్రసన్నమురారి ము♦రారి భోజ
ఘనమయూరమయూర స♦త్కాళిదాస
భద్రభారవిభారవి ♦ (ప్రభులఁదలఁతు.)

కం. ఘనవాగనుశాసను తి
క్కనయజ్వను సోము మల్లి♦కార్జును శ్రీనా
థుని ధూర్జటి భాస్కరులను
మనమున వినుతింతు నాంధ్ర♦మర్మజ్ఞులనున్.

తే. గీ. అమితదోషాచరత్వాది♦వాంధకత్వ
పక్షపాతాంచదినరశ్మి ♦ బాహ్యకత్వ

---

పా. 7. త్వరమా పంచముఖావలోకమునన్ ♦ తద్వామభాగాంకవి
ష్టురుఁడై వారల కాత్మమోద మొసఁగన్ ♦ స్కందాగ్రజుం గొల్చెదన్.

పా. 8. రాసృతముషిత బీ♦జాంకురములు

పా. 9. నగభిద్భిదాస్త్రారు♦ణల్లక్ష్మణప్రాణసంరక్షణాఘుట్ట♦భౌరికములు.

ఫలవిఘాతత్వమహిమ లే♦ర్పడుట కతన
కుకవులును ఘూకములు నొక్క♦కూటివారె! 12

తే. గీ. పుత్రవతిరీతి పృథుకసం♦భూతసమయ
గర్భనిర్భరవేదనా♦విర్భవంబు
వంధ్యలెఱుఁగుట యెట్లు కా♦వ్యప్రయాస
సుకవులకుఁ గాక తెలియునే ♦ కుకవితతికి. 13

ఉ. చేరికనారికేళపన♦సేక్షురసాలనుతావనీజఖ
ర్జూరఫలాదికంబులు వి♦రుద్ధతరాంతరబాహ్యమూలమై
మీరినమాధురీమహిమ ♦ మెచ్చరెలోకులు వారియట్లలం
కారరసార్థభావములె ♦ గైకొనుఁడీ[10]కవిచంద్రు లాదటన్. 14

సీ. కమనీయశృంగార ♦ గానమాధుర్యంబు
మోహంపుచూపులే♦మొనలవాడి
భామామనోహర♦ప్రేమానురాగంబు
లేజవరాలి పా♦లిండ్లబిగువు
మానవంతుని సన్మ♦నోనిశ్చలత్వంబు
ముద్దులగుమ్మ కె♦మ్మోవితీపి
నైజానుభవచిదా♦నందస్వరూపంబు
కవితాచమత్కార ♦ గౌరవంబు

తే. గీ. మన మన సెఱుఁగుఁ గాక యె♦వ్వనితరంబు
పాటిఁ జెల్పఁగ నాత్మాను♦భవముఁరీతిఁ
గాన ధారాప్రకల్పన ♦ కౌశలముల
ఫణితిఁ దెలియుఁడి కవిసార్వ♦భౌములార.

‡ కం. ప్రాకటముగ మత్కవనము
లూకొని బా గున్న వెంత ♦ యున్న వటంచున్
గేకలువేసెటివారికి
'లోకోభిన్నరుచి' యనఁగ ♦ లోకొనఁ దగదే. 16

---

పా. 10 కవులార వేఁడెదన్.

తే. గీ. సరససుజ్ఞాన వరమంత్ర♦చక్రవర్తి
సమదపరవాది గజగజా♦సనకరాగ్రి
జాగ్రదుగ్రప్రతాప స♦మగ్రమూర్తి
కోనయాఖ్యాంధ్రగురుకీర్తిఁ ♦ గూర్తుమదిని. 17

మ తనరార న్నుతియింతు దాంతులను మే♦ధావంతుల న్సాహితీ
ధనవిశ్రాంతుల భాష్యకారమతసి♦ద్ధాంతస్వాంతుల న్మానసా
ర్చనగౌరీమణికాంతుల న్గుణవిభా♦స్వన్మఖ్యనామాత్మభో
ధనహృద్వేదుల వేంకటార్యజనభృ♦త్సామంతుల న్శాంతులన్. 18

సీ. కుశలభారద్వాజ♦గోత్రవిఖ్యాతుండు
వెంకయధీరుఁ డే ♦ విభునితాత
రామనామార్యుఁ డే ♦ రామభక్తునితండ్రి
వినుతభాగాంబ యే ♦ ఘనునిజనని
వెంకయ యన్నయ ♦ విఖ్యాతవర్యు లే
ధన్యమూర్ధన్య స♦ద్భ్రాతృవరులు
అఖిలసంస్తుతవెంక♦మాంబాఖ్యవిఖ్యాత
పరమసుసాధ్వి యే ♦ వరునిరాణి

తే. గీ. యమ్మహాత్ముని సకలజ♦నానుమతుని
సరసకామయ యన్నయ ♦ నరస యాఖ్యు
లగు సుతత్రయజనకుఁ డై ♦ యలరు సట్టి
మద్గురుని 11 కామయార్యుని ♦ మదిఁ దలంతు. 19

సీ. త్రిభువనపూతకృ♦త్కృష్ణయ గల్గు గౌతమీ
తీరవిశీర్ణ ధా♦త్రీప్రసిద్ధ
తర మైన కంకణ ♦ పురవరస్థానసం
భూతిఁ జెందినవాఁడ ♦ భూసురుండ
శ్రీరామనామమం♦త్రారాధనపరుండ
సకలవిద్వన్మహా♦జనహితుండ

పా. 11 కామయాఖ్యుని

తే. గీ. సప్తసప్తాభిజనగోత్రుఁ ♦ డాప్తమూని
సప్తతంతుసమాప్త సం♦ప్రాప్తతృప్తుఁ
డనయదశకంఠకంఠలుం♦ఠనవిలుంఠ
శౌర్యవిస్ఫూర్తి రఘురామ♦చంద్రమూర్తి. 24

వ. ఏతద్గుణాలంకారభరితుం డగు నప్పరమపురుషుండు. 25

సీ. నీలనీలపుమేలు♦డాలు డీ లెడఁ జాలు
మేనితో సిరిదొర♦సానితోడ
పండువెన్నెలగోము ♦ నిండుఁ క్రొన్నెల మోము
తగవుతో వగగుల్కు♦నగవుతోడ
వెలలేని తమినేలు ♦ వలరాజుఁ గనఁ జాలు
రూపుతో దయఁజిల్కు ♦ చూపుతోడ
తొలుమెఱుంగుల కల్వ♦ముల మెఱుంగులమేల్వ
టంబుతో మణికిరీ♦టంబుతోడ

తే. గీ. వలపుకస్తురినామంబు ♦ వలపుఁ గొలుప
పేరెములువారు రతనంపు♦పేరు తోడ
నెలమిఁ గలలోన నొకనాఁడు ♦ గొలువు నెలయఁ
గలిమి చెలువార ప్రమోల సా♦క్షాత్కరించె. 26

తే. గీ. అటుల సాక్షాత్కరించి తా ♦ నాదరమున
నరసకవిచంద్ర యనుపేర ♦ నన్నుఁ బిలిచి
యామినీపూర్ణతిలకా శు♦భాంగిపెండ్లి
కథకు మాపేరఁ గృతియిమ్ము ♦ బుధులు మెచ్చ. 27

కం. కృతి యొసఁగుము మా పేరను
సతతము ధనధాన్యసకల♦సంపదలును శా
శ్వతముక్తిభుక్తులును నే
వితతంబుగ నిచ్చి ప్రోతు ♦ వెలయఁగ మిమ్ముల్. 28

వ. అని అనివారితకరుణానురాగాంచితంబుగా నాన తిచ్చి యమ్మ
హ్మం డంతర్హితుం డైన నేనును మేల్కాంచి మే ల్కాంచిన తెఱంగున

నముందానందకందళితాంతరంగుండ నై బంధుమిత్రామాత్యబుధజనంబుల తోడ నేతద్వృత్తాంతం బంతయు నెఱింగించిన నుదంచితామోదభరితాంతరంగు లై వార లొనర్చిన గౌరవోన్నతుల నస్మదీయజన్మసాఫల్యవిభవపరంపరల నలరి చమత్కృతి యగు మత్కృతికి నలంకృతస్వభావుం డగు నమ్మహాదేవునకు. 29

—♦ షష్ఠ్యంతములు ♦—

కం. శ్రీదునకు సర్వమంగళ
వాదునకుం గురుమతాభి♦వాదున కభయా
పాదునకు నిత్యజయసం
పాదునకుఁ భక్తకల్ప♦ఫలపాదునకుఁ. 30

కం. పుణ్యునకు సర్వలోకశ
రణ్యునకుఁ మానిహృచ్ఛ♦రణ్యున కగజే
ద్గణ్యునకు దళితచిత్రహి
రణ్యకళేబరమృగాసు♦రవరేణ్యునకుఁ. 31

కం. శాంతునకు కీర్తిభరితా
శాంతునకుఁ భక్తహృన్ని♦శాంతునకుం గృపా
స్వాంతునకుం బరమగుణవి
శ్రాంతునకుం గబంధరూప♦శాపాంతునకుఁ. 32

కం. భద్రునకు దళితగర్వస
ముద్రునకుం దుష్టపంక్తి ♦ ముఖకుత్కీలని
15 ర్ణిద్రార్ద్రాయుధవిశిఖా
16 క్షుద్రునకుం గంధవాహ♦సుతఖద్రునకుఁ. 33

కం. భేద్యమనవిరోధమహి
ధోద్ధర్వవిభేదసంయ♦మీశ్వరదత్తా

పా. 15 ర్ణిద్రాధినాథసాధన
పా. 16 చిద్రూపళరాఘుతూణ♦జిన్మదుర్నిసకుఁ

ద్విడ్గంధదళనకారణ
ఖడ్గాక్షయబాణతూణ♦ఘనధర్మునకున్. 34

‡ కం. కంధరజితవిగ్రహ దశ
కంధరబంధురమదాంధ♦కంధరవిలస
త్సింధురసంహారణాసిత
కంధరసతివాహశరజ♦గద్బంధునకున్. 35

కం. రామునకు సకలదురితవి
రామునకుం ద్రిభువనాభి♦రామున కనుజా
రామమధునామునకు భృగు
రామార్చితశౌర్యధుర్య♦రఘురామునకున్. 36

వ. సమర్పణంబుగా నా యొనర్పం బూనిన శృంగారరసాభంగరంగత్తరంగాయమాన సుధాసముద్రసంపూర్ణచంద్రోదయోల్లాసం బగు యామినీపూర్ణతిలకావిలాసం బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 37

సీ. అరుసంపుదొరలింపు ♦ దొరలింపు మెఱయింపు
బరువంపు నెఱగెంపు ♦ జరులసొంపు
సరసంపు విరిగుంపు ♦ లరజంపు మురిపెంపు
సురతంపు తరినింపు ♦ తరులసొంపు
పరులింపుదొరులింపు ♦ మరలింపుమరలింపు
మురిపెంపుసిగినుంపు ♦ పరెలసొంపు
విరలంపు తెరలింపు ♦ బరికింపుగరువంపు
గురిపంపుదొరలుంపు ♦ టరలసొంపు

తే. గీ. మెఱయు వరగరుడోరగాం♦బరచరాది
పరమపురుషాతిశయ నిరం♦తరవిహార
విరచితాశ్చర్యరసధురం♦ధరశిరంబు
నిరుపమభరంబు నిర్జర♦గిరివరంబు. 38

కం. సకలచరాచరభూత
ప్రకరాకరనిఖిలసృష్టి♦సాచక్రాధా

రకనాభీకృత మై దన
ఱు17కనకగిరిదక్షిణోద్వి♦రూఢం బగుచుఁ. 39

సీ. అంగ వంగ కళింగ ♦ రంగత్పుళింద సౌ
వీర సౌరాష్ట్ర గాం♦ధార మగధ
మలయాళ భోజ కే♦రళ చోళ భూపాళ
బంగాళ ద్రవిళ నే♦పాళ గౌళ
కరహాట మరహాట ♦ కాంభోజ పాండ్యపా
నాట విదర్భ క♦ర్ణాట లాట
సింధు బాహ్లిక పార♦సీక ఘూర్జరనాట
కామరూపాంధ్ర కే♦కయ వరాహ
తే. గీ. మత్స్య 18 హూర్ణవ శార్ణవ ♦ మద్ర సాల్వ
శూరసేన సుగంధర ♦ చోర ళాది
సరస ఛప్పన్నదేశరా♦జ్యముల లోన
పూజ్యతరగామి పాంచాల♦రాజ్యభూమి. 40

వ. ఇట్టి సకలదేశాతిశై భవాదేశంబు నగు నా దేశంబు నందు. 41

కం. సూక్ష్మాంతరగుణకాండవి
లక్ష్మాకర మగుచు రామ♦లక్ష్మణయుత మై
లక్ష్మీమందిర మన శ్రీ
లక్ష్మీమందిరపురంబు ♦ లక్ష్మిన్ వెలసెన్. 42

వ. మఱియు నప్పురవరంబు. 43

సీ. పద్మాకరమురీతిఁ ♦ బ్రమదాళులఁ జెలంగి
వనరాశి కరణి వా♦హినులఁ బెనఁగి
హారాళిపగిది నా♦యకరత్నముల మీఱి
పుష్పమంజరిభాతి ♦ భూతివెలసి

పా. 17 కనత్కూర్వేత్కణోర్వి♦రూఢం
పా. 18 హూణదశార్ణవ

విష్ణుచక్రములీల ♦ విశిఖావళుల మించి
19దివిమాడ్కి విబుధసు♦స్థితుల నలరి
కలభంబురీతి పు♦ష్కరసంపదలఁ గుల్కి
కులగిరిగతి దుర్గ♦ములఁ దనర్చి

తే. గీ. తరుణరాజీవమణిగణ♦స్థగితహేమ
కుంభసంభరితాగ్ర వి♦శ్వంభరాది
20నాథసౌధనిధానర♦థ్యాది వసతిఁ
దనరి చెలువొందు నా ప్రోలు♦ధరణి యందు. 44

తే. గీ. హరియుగంబున కావర♦ణాతిశయము
కతన శమనోత్తరాశల♦గతులు గలిగెఁ
గాన సప్తాశ్వుఁ డనెడు వి♦ఖ్యాతిఁ గాంచె
నినుఁడు ద్విజరాజు నియతిలే♦కను జరించె. 45

తే. గీ. పరభయంకర విషధర♦ప్రకటశమన
పరిఘగతి మించు విషధర♦పరిఘపురిని
కలితకమనీయకలశప్ర♦కాండఘటిత
గోపురము లయ్యెఁ దత్పుర♦గోపురములు. 46

కం. పురిసౌధము లమృతద్యుతి
కిరణాప్తిని సార్థకత్వ♦కీర్తినిఁ జెందెన్
హరిణాంకుఁడు 21సౌధామృత
కిరణాప్తిని సార్థకత్వ♦కీర్తినిఁ జెందెన్. 47

సీ. రాజహంసోద్వహా♦రంబు లైనవి గాని
రాజహంసోద్వహా♦రములు గావు
కమనీయపుష్కరా♦గ్రంబు లైనవి గాని
కమనీయపుష్కరా♦గ్రములు గావు

---

పా. 29 దివిమాడ్కి సకలస♦ద్విజుల నలరి
పా. 20 నాథసౌధనిధానగ♦ర్వాధివసతిఁ
పా. 21 సౌధామల

ఘనసువర్ణచ్ఛదాం♦కంబు లైనవి గాని
ఘనసువర్ణచ్ఛదాం♦కములు గావు
సరసాళిజనవిలా♦సంబు లైనవి గాని
సరసాళిజనవిలా♦సములుగావు

తే. గీ. ధర్మనీయుల కతివిచి♦త్రంబు లగుచుఁ
22బద్మ పద్మాకరంబులై ♦ పదవిఁ గాంచె
కాంచనాంబరరత్న సం♦ఘాతభామ
యంబు లైనట్టి మణినికా♦యంబు లచట. 48

తే. గీ. వెండిసీ రానుపగిది రే♦నిండుపండు
వెన్నెలలచందమామ రా♦వే య టంచు
రిక్కరాయునితోడ డీ♦డిక్కు లిడుదు
రాటబోటులు తిలకాంక ♦ మలర నచట. 49

మ. పురసౌధాంతరసీమలం గలరు సం♦భోగాభియోగంపు ద
ల్పురుతుంజారిపయింట లొత్తు తటి కెం♦దు జ్జేరు ముత్తెంపుదాం
తర లంచు న్మణిబింబితర్క్షముల నె♦త్తం బూని భాస్వన్నఖో
త్కరకాంతు ల్దనియింప సంతసిలు ము♦గ్ధల్ మెల్విదగ్ధ ల్నగన్. 50

చ. సరసకళానిమగ్నుఁ డగు♦చల్లనిరా జనురాగమగ్నుఁ డై
పురమున రాజసుందరులఁ ♦ బొందుహొరాయ ల్గనుగొంచు నేఁగ బి
త్తరు లటు నేర్పున న్మృగిసిఁ ♦ దార్చి మృగంబునఁ గూర్చి ప్రౌఢతన్
మఱల నొసంగ సిగ్గిలిన ♦ మర్మముగా శశి డెల్లఁబోవుటల్. 51

సీ. కనుద్రిప్పుచును గిరు♦క్కున మళ్లి క్రీగంటఁ
గనుఁగొన యతి లొట్టు♦క్కునఁ గఱంగు
వగఁగుల్కఁ బల్కు న♦వ్వఁగఁ గుల్కు వగలాఁడి
మాటకు మాని మో♦మాట మందు
మురిపెంపుపైఁట డె♦మ్మోర నవాదుగ సోఁక
వేదాంతి హా యని♦ వెనుకఁ జూచు

పా. 22 బద్మ సద్మాకరంబయి ♦ పదవిఁ గాంచె.

"సాబ గొందు నీ దండ ♦ జోడుగావలె బాల"
"పైకమ్మఁ జూచి చే♦పట్టు దిట్ట"
"వెలదింపు నీ పొందు ♦ గలువనెమ్మదివచ్చు"
"నీవిమ్మఁ జేర మ♦న్నించు దాన"

తే. గీ. ననుచు ననిచిన నెరజాణ ♦ తనపు వచన
రచన లలరించి మోహంపు ♦ రుచుల నించి
21మంచివిరు లంచు వలపుల ♦ మంచుఁగలపి
విలువఁ గొందురు పుష్పలా♦వికలు పురిని. 55

సీ. "అరిది ముద్దులగుమ్మ ♦ సరులమారుపులేమొ"
"కేళీఘనములంద ♦ గించు జాణ"
"పుష్పమంజరులింపుఁ♦బొదవు నీ యెద మీఁద"
"నమరిన రాజభో♦గములఁ గనుము"
"నలిమించువంక స♦న్నములు నీకొప్పనే"
"కుసుమసంగతు లందుఁ ♦ గూర్చి చూడు"
"రంభ చెక్కిళ్ల పై ♦ రాణించు రేఖలు"
"కందర్పభోగుల ♦ గరిమలవియె"

తే. గీ. యానె! బలుకొట్టు లేమి నిం♦డారఁగన్న
25భామ? చనుమధ్యమునఁగంటె ♦ చాల నలరు
ననుచు నెయ్యంబు గల పాంథ♦జనులతోడఁ
బల్కుదురు శాలిపాలికా♦భామ లచట. 56

చ. గురు తగు వాడిచూపు బెళు♦కుల్కుళుకు ల్తళుకు ల్వెలార్చి బి
త్తరి మొన లాని చాయ లరు ♦ దైబిరు దై గురుదై వమాయమే
ల్వరలఁ దనర్చి రందు మగు♦వ ల్నగవుల్ తగవు ల్జెలంగ బోం
ట్లరి వలరేనిసాధన కు♦టారికిటారికటారులో యనన్. 57

పా. 24 మంచివిరు లంచు వలపుల ♦ మచ్చుఁ గొలిపి
పా. 25 చామరనుమధ్యఁ గంటిని ♦ చాల నలరు

మ. పురిరాజద్విజరాజు లక్షయకళా♦పూర్ణు ల్ప్రసన్నాత్ము లం
26తరమెంచం ద్విజరాజు బ్రహ్మకుల గా♦ఢప్రౌఢదోఃషార్థి స
ద్గురుకాంతాసఖుఁ డుత్పలప్రియుఁడు స♦ద్గోత్రుండు సౌమ్యారి పాం
థ రిపుస్ఫూర్తి సురానుమోది యనఁ ద♦ద్వర్ణాన్యుఁ డై వర్తిలెన్. 58

చ. కడువడిమాటవచ్చు నెడ ♦ కాతర మంది స్వధర్మహీనతం
బడసి యధర్మవృత్తిఁ గని ♦ ప్రాణభయంబున పుణ్యమార్గము
ల్విడివడ నుండె భార్గవుఁడు ♦ వీరవరేణ్యుఁడె యంచు నిత్యముం
నుడువుదు రన్నివన్నెలఘు♦ను ల్గద రాజకుమారు లచ్చటన్. 59

కం. అర్థ మొనగూర్చె ననుటకు
నర్థము గాఁ జేసె సఖుని ♦ యనవరతనిధా
నార్థుఁ డగు రాజరా జని
యర్థులఁ బూర్ణులుగఁ జేతు ♦ రచ్చటివైశ్యుల్. 60

కం. భద్రులు భుజబలమున బల
భద్రులు ధర్మామరర్ష♦భద్రులు జయసా
భద్రులు కీర్త్యాదరహార
భద్రులు నప్పురము నందుఁ ♦ బరగినశూద్రుల్. 61

చ. చెలు వగు ధాతురూపమునఁ♦జెందుచుఁ బూర్వగుణాంతభావమిం
పలరఁగ వృద్ధి భాసిలి ప♦రార్థనిధానతఁగాంచి వర్ణసం
కలితసులక్షణోన్నతి న♦గంబులు 27నాగము లయ్యె నాగమే
ల్గలకలభంబు లుండఁ బుర♦లక్ష్మి గజాంతరలక్ష్మి యై తగెన్. 62

చ. భువనతురంగపుంజకిలి♦బొమ్మను బొమ్మను గొమ్మ లొమ్మనం
జవనతురంగము ల్సవతుఁ ♦ జాలునె జాలునె వ్రాలు నప్పురీ
జవనతురంగసంఘముల ♦ సంగతి సంగతి నింగిఁ బొంగినం
భువనతురంగము ల్విరగఁ ♦ బూనవె పూనవె శృంగభంగముల్. 63

---

పా॰ 26 తర మేచ్చం ద్విజరాజు బ్రహ్మకుల గా♦ఢప్రీతిదోఃషార్థి స
పా॰ 27 నాగములై విచిత్రలీలలఁ జెలువారు తత్పురవి♦లాసవిశేషసుభూములం దఁగ

చ. నిరుపమసాహసాతిశయ♦నిర్భరదుర్భరవైరివీరసం
హారణరణోత్సవోచితవి♦హార28 మహారథికప్రిదప్తస
త్వరిణయకార్యధుర్యతర♦ధాణధణంధణనాదఘంటికా
నురమితనిర్ఝరీజనమ♦నోరథముల్ రథము ల్పురంబునన్. 64

ఉ. 29సాధనపట్లనెన్నికలు ♦ సాహసవృత్తికి మూలకర్తల
త్యాదరభావ మందు బిరు ♦ దాంకులు పౌరుషధాటి మాటమ
ర్యాదల మచ్చుమొల్కలు ప♦రాక్రమశక్తికి విక్రమార్కునిం
గాదన జాలు మేలునడ ♦ గండ్రలుగాఁ బురి నున్న పోటరుల్. 65

కం. 30ఆసారగంధ మధుర ర
సా సారవిసారసార♦సానీకబలా
కాసారస భాసురమిహి
కాసారము లచటి కమల♦కాసారంబుల్. 66

మ. 31ప్రికటప్రావృతభోగసంపదలు ము♦పం భాస్కరాబ్ధి న్నియా
మక మూహించి సమంచితాశయమతి♦న్మందాకినీదర్పనో
త్సుకత న్భోగవతీస్రవంతిని మన♦స్స్ఫూర్తిం బ్రికల్పించు స
న్మకురాకీర్ణవిలోకనాశము లనం ♦ బొల్చుం బురాంధోఘముల్. 67

సీ. మోహనాకారస♦న్మఖవిలాసము లొప్పఁ
గాంచనద్యుతులు న♦ల్గడలఁ బర్వ
పల్లవాలంకార♦పత్రరేఖలు దేర
జిల్గుకంచెలఠీవి ♦ చిందు లాడ
వెలలేని మురిపెంపు♦వలపులు నిండార
మన్మథసహాకార ♦ మహిమ మెఱయ
జిలిబిలిముద్దుచి♦ల్కలపల్కు లలరింప
కలకంఠు లెలమిని ♦ గలసి మెలఁగ

పా. 28 మహారథికప్రవాసన
పా. 29 సాధులపట్ల
పా. 30 ఆసారగంధ శిశిర ర
పా. 31 ప్రికటాపూర్ణకళాభిసంపదలసింపొ

తే. గీ. నిగనిగ ల్గలపండ్లు వ♦న్నియలు గులుక
తమిని సరసాళు లలమిగీ♦తములు బాడ
నలరు బురలక్ష్మితోడినె♦చ్చెలు లనంగ
[32]బొల్చె నెల్లెడ నుద్యాన♦భూము లచట. 68

—♦ లయగ్రాహి ♦—

తమ్ములను గ్రమ్మి కుము♦దమ్ములను గ్రుమ్మి విరి
గొమ్మలను దొమ్మి గను♦జిమ్మి తమిగ్రుమ్మం
జు మ్మనుచుఁ దుమ్మెదలు ♦ నెమ్మిఁ దమసొ మ్మని క
రమ్ము గని గ్రిమ్మరిత♦నమ్ము మది నమ్మన్
ముమ్మరపు కమ్మవిలు ♦ పమ్మినదురమ్ము గని
సొమ్మసిలు కొమ్మలకు♦రిమ్మ లటుఁ జిమ్మన్
గు మ్మనుచుఁ బమ్మి వెలి♦దెమ్మరదళమ్ములు బు
రమ్ముపయి గుమ్మరు ము♦దమ్ము జెలువమ్మౌ. 69

వ. మఱియు నప్పురవరంబుపురవరంబునుం బోలె సరసజ్ఞమనోహరం
బై హారపురంబునుం బోలె నిరంతరసర్వమంగళావాసం బై వాసవరాజ్యంబు
నుంబోలె సకలఫలప్రదానసంతానవిరాజమానరాజాప్తరోద్యాకరం బై కరంబు
నుంబోలెవివిధకార్యనిర్వాహకశుభలక్షణాలంకృతం బై కృతయుగంబును బోలె
నిష్కపటధర్మసంగ్రహం బై గ్రహమండలంబునుం బోలె కవిగురుబుధమిత్ర
మందారకువలయప్రియాహీనకేతుచక్రం బై చక్రంబునుంబోలె * చక్రధర
సాధనం బై ధనపతినివాసంబునుం బోలె చిత్రరథనిశాంతం బై నిశాంతంబు
నుం బోలెఁ గమలామోదకారణం బై రణాంగణంబునుం బోలె సగుణధర్మ
ప్రధానశాస్త్రాభిరామం బై రామావతారంబునుం బోలె విభీషణసంసేవ్య
మానం బై మానవతీవతంసంబునుం బోలె పరపురుషావగాహదుస్సహామా
నసం బై మానససరోవరంబునుం బోలె రాజహంసవిహారం బై హారంబును
బోలె కంధరాభిశోభితం బై ధరాభిశోభితం బగుచు నధరాభిశోభితం బై
వారణవిభవాస్పదం బగుచు నవారణవిభవాస్పదం బై నవరతానుకూల

పా. 32 వన్నె లలరారు శృంగార♦వనము లచట.
పా. * పురుషోత్తమసాధనం బై

బాలికావినోదం బగుచు నవరతానుకూలబాలికావినోదం బై భోజాభి
సన్నుతగోప్రసాదప్రధానం బగుచు నంభోజాభిసన్నుతగోపరిసాదప్రధానం బై
మర్త్యానందబంధురకళ్యాణధామాభిరామంబగుచునమర్త్యానందబంధురకళ్యాణ
ధామాభిరామం బై నిశాధినాయకావతంసవిరాజితంబగుచు ననిశాధినాయకా
వతంసవిరాజితం బై పర్వరంభాభిషక్తాస్త్రిరామసామం బై పూర్ణచంద్రో
దయాభియోగంబున నమరి వియద్వాహినీలోచనాసురవదోపమానం బై
తారకానుగతి నలరి విజయుడై వజ్రశాస్త్రకైలాసనసిద్ధాశ్రమసంకాశంబై సుభ
ద్రానందప్రదం బగుచు ముదం బొసంగు నప్పురంబున కధీశ్వరుండు. 70

కం. ఆనగరిపుఁ డానగరిపుఁ
డానగరిపుఁ డై నవాని♦33నసురావాప్తిం
గానఁబడఁ జేయు విజయవి
ధానుఁడు మదనాభిరామ♦ధరణిపుఁ డలరెన్. 71

తే. గీ. తరమె యెన్నంగ నతనిసౌం♦దర్యమహిమ
రామలకుఁ జూడ మదనాభి♦రామ మగుట
కతన మదనాభిరామాఖ్యఁ♦గాంచె నృపతి
రూపురేఖల కిఁక సాటిఁ♦జూప నేల? 72

సీ. త్రిదశాలయముఁ జొచ్చి ♦ తేరె తృణగ్రాహి
హారికర మంటె గో♦త్రాంతకారి
కాకోదరముఁ బట్టె ♦ కాత్యాయనీభర్త
క్ష్మాతలం బంటె కం♦జాతమాళి
ఘనతారకంబుల ♦ కరము లానె కళంకి
34కొలనుసీటను నిల్చెఁ ♦ గుముదకోటి
హారిశిరస్పర్శ ని♦ర్జరుఁ డయ్యెఁ గరదుండు
ప్రజ నంటె నమితవ♦ర్ణస్వరూపి

తే. గీ. యనుచు వారలఁ దత్సమా♦ఖ్యల జయించి
రూపసంపదలకు మున్ను ♦ ప్రాపుఁ గొన్న

పా. 33 నసురహితావాప్తిం
పా. 34 సలిలావ్తిగనె పంక♦జాతకలము.

సారసంగ్రహమై భవో♦దారలీల
వెలసె మదనాభిరామభూ♦విభునికీర్తి. 73

చ. అతనిపరాక్రమస్ఫురణ ♦ మద్భుత మబ్ధిపరీతభూతల
స్థితకలుషాహ్వ్యతాహితప♦తివ్రతలన్ వ్రత మూనఁజేసి త
త్స్మృతుల మతానుసారవిభ♦వమ్ములఁ బ్రాణపదమ్ము గాఁదె ల
క్షితభువనాంతరమ్ములఁ బ్ర♦సిద్ధిగ వారలఁ బాయ కుండుటన్. 74

ఉ. అరు దందన్ మదనాభిరామనృపవీ♦రాంకప్రసిద్ధోజ్జ్వల
త్కరఖండమై కవిధాతచాతురిని మా♦ద్యచ్ఛత్రుమిత్రాళి సం
భరితస్వస్థలభోగభాగ్యవిభవ♦ప్రఖ్యాతి నొందించె నా
ధర నే చందము జేయఁ జెల్లదె స్వతం♦త్రప్రస్ఫురచ్ఛక్తికిన్. 75

కం. అనిమిషదానప్రదుఁ డని
కొనియాడఁగఁ గర్ణనామ♦కుఁడు వెలయుట యా
తని దానవారివార్ధికిఁ
గొనకొని సత్కర్ణధార♦కుం డౌటఁ జుమీ. 76

తే. గీ. రామనామంబు వెలయ నా♦రాయణుండు
మూఁడుయుగముల జన్మించి ♦ మోద మలరఁ
గలియుగంబున జన్మించెఁ ♦ గ్రమముతోడ
ననఁగ మదనాభిరామరా♦ఘవుఁడు దనరె. 77

సీ. కర మొసంగుట లేని ♦ ఘనసార్వభౌముండు
దరముఁ బూనని చక్ర♦ధారణుండు
భువనజాతులకార్తిఁ ♦ బూనఁ జేయని రాజు
పౌరుషచ్యుతి వీడు♦పడు కిరీటి
గోత్రవిద్వేషంబుఁ ♦ గూర్ప మానిన యింద్రుఁ
డగతి వీడ్కొనిన ధ♦ర్మాధిభర్త
పుట్టుభోగుల కింపు ♦ బుట్టఁ జేయు విశిష్టు
పరభూభృదార్తిఁ జొ ♦ ప్పడని యినుఁడు

తే. గీ. నిఖిలదిగ్జయశాసనో◆ల్లిఖిత వితత
జాగ్రదుగ్రప్రతాపబా◆హాగ్రగణ్యుఁ
డలరు హితపద్మహేళి క◆ళ్యాణరూప
శాలి మదనాభిరామరా◆జన్యమౌళి. 78

సీ. వరకరగ్రహణంబు ◆ వైవాహికములందు
ఖలవృత్తి ధాన్యసం◆గ్రహములందు
నియమప్రమాదంబు ◆ నిద్రాతిశయమందు
పాదబంధాపత్తి కా◆వ్యంబులందు
రాజవైరుధ్యంబు ◆ రాజీవములయందు
వర్ణమిశ్రితచిత్ర◆పటములందు
రహోగళాభంగంబు ◆ రతివిలాసములందు
పరిభవం బతనుచా◆పంబునందు

తే. గీ. గాని తద్వ్యతిరిక్తప్ర◆కారమూల
కారణాభావభావసం◆గతుల సతుల
గతుల పరిపాలనవ్రత◆నుతుల సలరె
విజయమదనాభిరామనృ◆పేశ్వరుండు. 79

కం. ఆ రాజేంద్రుని కగు భా
ర్యారతిశాస్త్రానురూప◆లావణ్యకళా
సారశుభలక్షణాలం
కారిణి మందారమాలి◆కారత్న మనన్. 80

సీ. 35 సరసాంతరంగాతి◆శయసారసుకుమార
సముదాళి విభ్రమాం◆కముల నమరి
36 భవ్యగుణోజ్జ్వల◆భావసద్రూపసం
పదకేళికాకలా◆సములఁ దనరి
వరజనానందసుం◆దరగంధబంధురా
భరణశోభాపరం◆పరల నలరి

పా. 35 సరసాతిశయమహో◆హారసారసుకుమార సరసాళిజనవిలా◆సముల నమరి
పా. 36 సురభాగధేయభా◆సురభవ్యగుణనిరంతరభాసమానని◆ర్భరతఁ దనరి

హరిమానసానంద♦కరమానితక్రియా
దరమాధురీ సుఖో♦త్కరము లొదవి

తే. గీ. వరలు మందారమాలికా♦వై ఖరులను
వరలు మందారమాలికా♦వై ఖరులను
దరమె యెన్నఁగ నామసా♦ర్థకము నొందు
తరుణులకు విందు సొబగుబి♦త్తరుల యందు. 81

సీ. అసమానరూపమో♦హనలీల నలరారు
రతిమన్మథుల విహా♦రంబు పగిది
లావణ్యసత్కళా♦లంకారముల మీఱు
రోహిణీపూర్ణచం♦ద్రుల విధంబు
సౌభాగ్యవైభవా♦స్పదభోగభాగ్యముల్
వరలు శచీపురం♦దరుల కరణి
మృదులకోమలశుభా♦భ్యుదయం బలరు పద్మి
నీనవోదితధామ♦నిధులమాడ్కి

తే. గీ. (సకలసంపదలారాజ♦జంపతులకు)
గలుగ నన్యోన్యసంప్రీతి ♦ ఘనత మీఱ
నెపుడు నిష్టోపభోగంబు♦ లెలమి గాంచి
రలఘుతరలీల నఖిలభా♦గ్యములు గలిగి. 82

ఆ మెలనవ్వు లా సొబగు ♦ లా నెఱజాణతనంబు లా గుణా
రా యమకంబు లా గురుతు ♦ లా మురిపెంపుభరంబు లా సుధీ
లా యొడబాటు లా సిరియొ♦యారము లా నెఱజవ్వనంబు లా
ప్రాయము లొక్కరూప మని ♦ ప్రస్తుతిఁ జేతురు వారినన్నిటన్. 83

తే. గీ. ఇటుల నున్నంతవేళఁ బ్ర♦స్ఫుటతరాత్మ
పూర్వపుణ్యంబు వలన సం♦పూర్ణ సకల
కామితార్థైకమదనాభి♦రామనృపతి
జాయ కంతంతఁ జూలు చూ♦చాయ నిలిచె. 84

కం. చెలు లానందము నొందఁగఁ
జెలియును నెల దప్పి మేను ♦ జెలువము నొందెన్
వెలదిం జేఁ బలుకు లందము
నెలఁదికి సంతసంతోఁ జాల ♦ వేవి ళ్ళొదవెన్. 85

సీ. పూర్ణగర్భరుచుల సొం♦పులు గుల్కె నెమ్మోము
పూర్ణగర్భరుచులసొం♦పులు దనర్చె
భంగంబు లసఁగ నే♦ర్పా టొందు వళు లన్ని
భంగంబు లగుచు నే♦ర్పాటుఁ బూనె
వివరంబు పటంచు భా♦వించిన పొక్కిలి
వివరంబ టంచు భా♦వింప నయ్యె
వలిమించి నునుజాడ♦ లలరించు నూఁగారు
వలిమించి నునుజాడ♦ లలరఁ దాల్చె
తే. గీ. చేసటలు గాంచె నడ లందు♦ విసువు మించె
వన్నచిన్నల పైఁ బ్రేమ♦ సన్నగించె
నలతరంబుగ రామిన్న♦ నెలఁత దొలుత
సిరులు దోఁచఁగ నేఁటి కా♦నీటు దోఁచె. 86

కం. కలిమిగల చెలియా కటికుచ
ముల మధ్యము సహము వృద్ధి ♦ పొందెను ధరలోఁ
గలిమి గల వారితోడను
జెలిమిని గావించు పేద ♦ సిరి గను టరుదే. 87

కం. కడు నిగ్గన బంగరంబుల
నదికిన సీలలంపు ముల్కె ♦ లన నొప్పెఁ గడున్
సదమల మేచక రుచులను
సుదతీమణి గుబ్బదోయి ♦ సుధతీరు లొగిన్. 88

చ. కలికిపయోధరంబు లతి♦గాఢపయోధరపూర్ణభావమై
నిలచెటివేళఁ దద్గుణము ♦ నిర్గుణవృత్తిని భేదపూర్వమై

వెలువడ సాగెనో యనఁగ ♦ వింతమెఱుం గలరంగ
లలనకుఁ జన్మించె న్కాడు వి♦లాసముగా నలుపెక్కె

సీ. మమతచేఁ జేర ర ♦ మ్మని బార జాచి
లంటిన కరము వె ♦ న్నంటు
దిగిచిన నగుచు మే ♦ లగు బాల నీ లీల
లని లేని 37సిగ్గుసి♦గ్గనుచు
మొగ్గినఁ బ్రియభావ♦ములకు నెమ్మది
విన్ననై మనసు ని♦వ్వెరగు
దలఁచిన పనుల పై ♦ తడబాటు లొదవ
చ్చికమాట లందు ని♦చ్చక

తే. గీ. జూపు లందునె యెడబాటు ♦ సొం
నించువిల్కానిపనుల కా♦సించు విభు
గాంచు నోపక యలసటఁ ♦ గాంచు
సుద్దులను బొద్దు జిల్కఁ లేఁ♦జూలి

సీ. కలకంఠి కొంకవింత ♦ గాఁ దోఁచె గర్భం
దొడవు లంతంతకుఁ ♦ బెడి
బడలిక చెమటజి♦ త్తడులు రాఁబడు ల
నడు గొంకయామ డై ♦ 38
నాహారముల మీఁద ♦ నాదరం బెడ బా
బహువాంఛ లొదవె మృ♦
జెలులముచ్చట లెల్లఁ ♦ జిందరవంద నై
పలుమారుఁ జిరచిరఁ ♦ బల

తే. గీ. పక్కలను జేతు లాని "య♦బ్బబ్బ
నించు కేనియు దాళ" న♦టంచు "

పా. 37 సిగ్గుసి♦గ్గనను మొగ్గు
పా. 38 యలసటమరె

రంచుఁ బలవించు "నీశ్వరా" యని తలంచు
39చుంఁడ నెలఁతకు నెల లన్ని నిండి యుండె. 91

కం. అప్పుడు వృద్ధాంగన లోగి
ముప్పిరిగొను మోహమునను ముద్దియ మనకుం
జెప్పదు సిగ్గున మిక్కిలి
నొప్పులు గాఁబోలుఁ జాల నొగిలిన దనుచున్. 92

చ. తడయక జల్క మార్చి విశదంబుగఁ గల్పిన యన్న మింత య
ప్పుడఁతి భుజింపఁ జేసి బహుభంగుల వేల్పుల మ్రొక్కి మంత్రముల్
గడువిన జేసి భామలకు గండముగా యిది మేలుగూడఁగా
గడిపెడువాఁడు శ్రీధరుఁడు గావలె నంచుఁ దలంచు నత్తటిన్. 93

తే. గీ. పురజనంబులు సంతసంబునఁ జెలంగ
నధిపజనమాళి హర్షవార్నిధి మునుంగ
నమితసుముహూర్తసమయము నందు రాజ
పత్ని గాంచెఁ గుమారికారత్న మెలమి. 94

వ. అయ్యవసరంబున భేరీమృదంగపణవానకగోముఖమహోత్కట డిండిమానేకశంఖకాహళవేణువీణాదితూర్యనినాదంబులు జెలంగ వందిమాగధ సందోహంబులు కైవారంబు లొసంగ హాహాహూహూప్రముఖగంధర్వ సమానపాఠకానీకపరికల్పితమృదుమధుర సరససంగీత నిక్వాణంబులు జెలంగ సర్వతోముఖసంభవసంభూతముఖోద్భూతప్రముఖవిరచిత తర్కవ్యాకరణ మీమాంసభాట్టపరిభాకరవేదవేదాంతాది విద్యాపరిసంగంబు లెసంగ సకల జనానురూపలావణ్య విలాసవిశేషభాషావిభూషితాశేష వారాంగనాజన నృత్యంబులు పొంగ నయ్యుర్వీధవసార్వభౌముండు సర్వసర్వంసహాగీర్వాణ సమూహంబులకు నపరిమితానురూపంబుగాఁ బుత్రికోత్సవంబున యుచిత ప్రకారంబున సపరివారబంధుమిత్రామాత్యకవిబుధభటగాయకాదిజనంబు లకుఁ దాంబూలజాంబూనదాంబరాభరణాగ్రహారాది బహుమానంబు

పా. 39 చుండ నంతకు నెల

లోసంగి దేవతారాధనంబును బితృదేవతాపూజావిధానంబును స్వకులధర్మాచారవిధానంబును నిర్వర్తించి క్రిమక్రమంబున. 95

తే. గీ. స్వస్తిపుణ్యాహవచనంబు ♦ సంస్మరించి
సర్వసౌభాగ్యవైభవ ♦ స్వాంతుఁ డగుచు
యామినీపూర్ణతిలక య ♦ టంచు దుహిత
నామకరణంబు వ్రాసె భూ♦నాయకుండు. 96

వ. మఱియు నబ్బాలికాజనచూళికారత్నంబు యామినీపూర్ణతిలకాంకురం బగు నూత్నకురంగాంకరేఖయుం బోలి యామినీపూర్ణతిలకాభిరామనామంబున దినదినప్రవర్ధమాన యై. 97

సీ. రవనూనెమెఱుఁగుచే ♦ రాణించు పాపట
యల్లికజడల సొం ♦ పామటింపఁ
దోలుదోర్త్త బొమలపై ♦ మొలచి నక్షీర్పడు
నొసటఁ గస్తురిచుక్క ♦ మిసిమిఁ గ్రక్క
చొక్క మై నునుసోగ♦ముక్కునఁ దళుక్కటం
దపుటాణిముత్తియ ♦ మెప్పుడు మెఱయఁ
జిన్నిపొన్నలపొందు ♦ జెన్నగు సన్నంపు
వన్నె చెంగావిపా♦వడ జెలంగ

తే. గీ. నరుతతరగతిపేరు లం ♦ దందఁ జెల్గు
పనిమెఱుంగులరవికె పై ♦ గునిసి యాడ
గజ్జె లందెలు బదముల ♦ ఘల్లు రనఁగ
ముద్దు జిలిబిలిపలుకుల ♦ మురియు బాల. 98

వ. వెండియు. 99

రగడ. చెలువ జెలు వలరగనుమచ్చికి ♦ జిల్కఁ జిల్కలఁ బెంచ నేరిచి
పలుకుపలుకుల తేనె లొలుకఁగ ♦ బన్ని బన్నిదములకు నోరిచి
పొందు పొం దగు ననుచు బంగరు♦బొమ్మ బొమ్మలపెండ్లిఁ జేయుచు
విందువిందుపటంచుమదిఁ జన ♦ వియ్య వియ్యము లనుచుడాయుచుఁ
గోరి కోరినవారి గుజ్జన ♦ గూళ్ల కూళ్లకు దనివి దీర్చుచు

సారెసారెకుఁ జెలుల ముచ్చట ♦ సాగ సాగన మేలుఁ గూర్చుచు
బంతి బంతులు సాగి పువ్వుల♦బంతి బంతుల తరమి ఱువ్వుచు
వింతవింతల విరులసరిక్రొ♦వ్విదల వెదలఁగ దురిమి నవ్వుచుఁ
కేళి కేళీవనుల పూఁదీఁ♦గెలకు గెలకుల బోదె లుంపుచుఁ
దాళి తాళీరుచుల పువ్వుల♦దండ దండలుగాఁగ నింపుచు
గుమ్మగు మ్మన మేలుతావుల ♦ గుప్పు గుప్పఁగ బనటులరయుచుఁ
గొమ్మ కొమ్మలఁ గూడి పూవుల ♦ గోల గోలతనమ్ము మెఱయుచుఁ
దరిమి తెరి మిగులగను మదనునిఁ ♦ దలఁచి తలఁచినపనులఁ దెల్పుచు
గరముకరమునఁ జనిచి చెలులకుఁ ♦ గల్లకల్లలకథలు విప్పుచు
40బాల బాలతలంపుజిలిబిలి ♦ పాటపాటల మరునిఁ బాడుచు
మేలి మేలిమిగొలుసు టుయ్యెల ♦ మేర మీఱఁగ నూఁగ వేడుచుఁ
జల్లచల్లని చూపు లలమఁగ ♦ సారెసారెకుఁ జెలుల నేలుచుఁ
గొల్లగొల్లలు గాఁగ సిరు లిడఁ ♦ గోరి కోరిన వానఁగఁ జాలుచుఁ
దరతరంబగు సొబగుబిగి నూ♦తనము తన మురిపెములఁ జెలఁగుచు
మఱియు మఱియును దల్లిదండ్రుల ♦ మనసు మనసునఁ బెనిచి
మెలఁగుచు. 100

సీ. సిరిసింగణావంతి ♦ చిన్ని వెన్నెలరాసు
లలపోఁకముడిచాలు ♦ కలిమి బంతి
నచ్చుసగండ్లు వి♦న్నాణంపు దోసిళ్లు
మవ్వంపు మువ్వన్నె ♦ గవ్వలాట
కనుమూత తెత్తన♦గాయ లందపు మేల్మి
బంగరుపనిరింగు ♦ బొంగరములు
సరిచేసి సంజముల్ ♦ సరివిప్పు పొడుపొటి
కతలు జిత్రపుయంత్ర♦కముల కేళి
తే. గీ. గూఢమణికందుకక్రీడ ♦ గొనబు నటన
లాది గాఁ గల్గు బాల్యంపు ♦ టాట లందు

పా. 40 బాల బాలతనంబు

మిన్నయై జాణతనమున ♦ వన్నెచిన్నె
లెన్న మన్నన మించె రా♦కన్నెమిన్న. 101

చౌపది. శ్రీ లలరఁగ బహుచిత్రగతుల జవ
రాలు మెఱయు చతురంగము లందుఁగ
డీలువెడలి గరిడీల దేరు సాగ
టాలున దనరు మిటారము లందుఁగ. 102

సీ. ఒకపాలి పికబాలి♦కకు జాలి మదిఁ జిల్క
జిల్కలగమికి రా♦బల్కు బల్కు
నొకమా టనక తేట♦నకలాట లిడు నెమ్మి
నెమ్మికొమ్మల కాద♦రమ్ముఁ గ్రమ్మ
నొకవేళ నొకపాళ♦ముకుమేళముగఁ గోరి
గోరికలకు పాటఁ ♦ 41గూర్చు నేర్పు
నొకసారి సుకుమారి ♦ బకదారిమూఁకల
కలరవంబులఁ దీర్చుఁ♦గనుచు మనుచు

తే. గీ. నెనరుటంచకు గతులపొం♦దికలు గూర్చి
సరసములు నేర్చి సరసవై ♦ఖరులఁ జేర్చి
భావములు దార్చి మదిని వై♦భవముఁ జేర్చి
యలరుఁగన్నియ కన్నెపా♦యంబు నందు. 103

కం. శృంగారతాళసంగత
రంగద్వీణాదివాద్య♦రచనానుమితా
భంగతరంగితమంగళ
సంగీతకళారహస్య♦చాతురి మెఱసెన్. 104

తే. గీ. యామినీపూర్ణతిలక యొ♦య్యారములకు
నాదిగాఁ గల్గు క్రీడావి♦నోదములను
మోద మలరించు తఱిని స♦మ్మోదమొదవ
కొదువ లేజవ్వనంపు జాడ ♦ లొదవె నంత. 105

పా. 41 గొసరుగొసరు

శా. కల్పాకల్పనిదాన దానసుమనః♦కంజాత కంజాతసం
కల్పావిర్భవభూతి భూతి42కతద్బ్ర♦హ్మాండ ప్రకాండార్ణవా
కల్పాంతజ్వలనప్రద ప్రదరచ♦క్రాచక్రవాళక్షమా
కల్పాత్మప్రభులక్ష్మ లక్ష్మణమనో♦గ్రగ్రంథతత్త్వాత్మకా. 106

సుగంధివృత్తము. హారహీరతారకావి♦హారశారదభ్రనీ
హారతారకాచలప్ర♦హారసాధనామరా
4 హారనారదస్వరగ్ర♦హారహాట్కురుణ్మనో
హారిభూరిసద్యశోవి♦హారవీరకారణా. 107

‡ కం. దశకంఠకంఠలుంఠన
దశరథపుత్త్రా శ్రితత్రి♦దశమండలరా
డ్దశదిగ్భరసంపద్ద్వా
దశరూపకులేంద్ర మోక్ష♦దశరణదక్షా. 108

గద్య.

ఇది శ్రీరామచంద్రగురుకరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సరస శృంగారరస
ధారాధారమాధురీధురీణాంధ్రగీర్వాణకవితావిలాస విచిత్రవిలసితాప
స్తంబసూత్ర భారద్వాజగోత్రపవిత్ర చల్లపిల్లకులసుధార్ణవ
రాకానిశాకర యశోధురంధర ధరామరప్రవర్య రామయ
నామార్యపౌత్ర కామకవిసుపుత్ర సకలవిద్వజ్జనవిధేయ
నరసయనామధేయ ప్రణీతం బైన యామినీపూర్ణ
తిలకావిలాసం బను శృంగారమహాప్రబంధంబు
నందుఁ బ్రథమాశ్వాసము
సంపూర్ణము.

పా. 42 కృతద్బ్ర♦హ్మాండ ప్రకాండాత్మనా.
పా. 43 హారనారదామరాగ్రి♦హారరాట్కురుణ్మనో.



# యా మి నీ పూ ర్ణ తి ల కా వి లా స ము

## ద్వి తీ యా శ్వా స ము



కం. శ్రీమత్తావకపదయుగ
తామరసరసామృతంబు ♦ ద్రావక భవభా
వామయజనులకు సుఖమే
భూమిసుతానందసాంద్ర ♦ భూపకులేంద్రా.

వ. దేవా అవధరింపు మనంతరంబ. **2**

కం. తళతళ నై బెళపెళ నై
మిళమిళ నై మేనికాంతి ♦ మిఱుమిట్లుఁ గొనన్
గళలలముకొనియె దినమొక
నెళవున లేజవ్వనంపు ♦ నిగ్గులుదీరెన్. **3**

సీ. కలకంఠినీలాల♦కములు వక్రితఁజెందె
చపలతఁదాల్చె లో♦చనయుగంబు
విరిబోఁడినునుబల్కు ♦ వింతఁజేయఁ దొడంగెఁ
జనుదోయి కాఠిన్య♦మున నెసంగె
తిలనాసమధ్యం బ♦దృశ్యభావము నొందె
ఘననితంబంబొత్తు ♦ గొనఁ దలంచె
మదిరాక్షిగమనంబు ♦ మందమైకనుపట్టె
పాణిపాదము లెఱ్ఱ ♦ బాఱియుండెఁ

తే. గీ. సకట చెల్విసిఁగిన చనువు బూ♦టకముగాన
మానినీలున కతులస♦న్మానమిళిత
2వంచనఘటింపఁ దలఁచి నిం♦దించుపగిది
నంబుజాసన మేనిబా♦ల్యంబు సడలె. 4

సీ. జిగిఁగప్పు నెఱిగొప్పు ♦ చిటిమొగు త్రైలఁగొప్ప
మెయిచాయ లేఁతచాయ ♦ మించులలమె
బొమలు వేలుపుసామి ♦ జమలిసింగిణు లొప్పె
శృంగారరసవృష్టి ♦ జిలుఁగువాతె
వలిగబ్బిగుబ్బలు ♦ వజ్రోపలములంటెఁ
గోరికలతలు హెచ్చె ♦ కొనలుసాఁగ
మదినమ్మికప్పురివిచ్చె ♦ 3ముదమునాటలొసర్చె
భావంబు కోలఁదు లే♦ర్పాటునొందె

తే. గీ. నూఁగుటూఁగను హాలకేఖ ♦ నూలుకొనియె
మ్రుహాసస్యంపుదినుసులు♦ మొలకలెత్తెఁ
జూపరుల కింపుదులకింప ♦ సుదతిమేనఁ
గొమరుప్రాయంపుఁ దొల్కరి ♦ గుల్కరింప. 5

కం. పదలక్షణసంజ్ఞాన్వయ
పదగుణవృద్ధిప్రయత్న♦పరరూపసవా
స్పదభావత్వక్రియ
లొదవఁగ చెలి శబ్దశాస్త్ర♦మో యనఁ దనరెన్. 6

చ. పొలఁతి నితంబవేదికడఁ ♦ బొక్కిలికుండముగా రచించి యు
జ్జ్వలరుచిపొంగుపారి కుచ♦చందనపూర్ణఘటంబులుంచి వే
నలిశిఖిపింఛలాంఛనఘ♦నస్థితిఁగొల్పి మనోజమాంత్రికుం
డలవడఁజేయు మోహనపు♦యంత్రమనం జను జవ్వనంబునన్.

---

పా. 2 వంచనఘటింపఁ దలఁచి నిం♦దించుపగిది

పా. 3 ముదపుటాట లొనర్చె.

సీ. అలివేణి నవమంద♦హాసంబు కౌముది
4కొను వివాదప్ర♦కాశకంబు
పల్లవాధరి దంత♦పాళి ముక్తావళి
తరళాక్షి నెమ్మోము ♦ దర్పణంబు
5కుటిలకుంతలిశ్రోణి ♦ కువలయానందంబు
కోపనపాణి ర♦త్నాపణంబు
శృంగారమంజరి ♦ చెలియచన్గవశీవి
భ్రమరసందేశంబు ♦ పడంతివేణి

తే. గీ. పుష్పబాణవిలాసంబు ♦ పొలుపు వచన
రచన సాహిత్యరత్నాక♦రంబు గాఁగ
రసికజనవిభ్రమస్ఫూర్తి ♦ యొసఁగు టరుదె
యనఁగఁ జెలువొందు కన్నెప్రా♦యంబునందు. 8

చ. మృగధరబింబసంపదల ♦ మీటు వధూటిముఖంబు వేణిచె
ల్వగు నునుజూపు కొను కటి♦యందపుటారును మోవిపల్కు ల
బ్జగురుబిసాళిచందములఁ♦బైకొను సంఘ్రుదరస్మితాక్షులుం
బిగిచనులుం భుజంబులును ♦ బేర్మినడల్కురులంగకంబులున్. 9

కం. ఖగరాజకరకుతూహల
ఖగరాజవిరాజితములు ♦ కామినికన్నుల్
ఖగరాజకరకుతూహల
6ఖగరాజవిరాజితములు ♦ కామినిచన్నుల్. 10

కం. కనకంబు మేనిచందము
కనకంబగు గళము పిఱుఁదు ♦ గనకంబులస
త్కనకంబు వలపు మిగులన్
గనకం బగు నడుముగలుగు ♦ కాంతామణికిన్. 11

పా. 4 పైదలిమోవి ర♦సోదయంబు
పా. 5 కోమలికటిసీమ ♦ కువలయానందంబు
పా. 6 ఖగరాజకుతూహలములు ♦ కామినిచన్నుల్

క౦. కుముదవిలాసము కనుఁగవ
కుముదవిలాసంబు పిఱుఁదు ♦ గొనబగు నడకల్
కుముదవిలాసము లనఁదగుఁ
గుముదవిలాసంబు నడుము ♦ కోమలి కెన్నన్. 12

సీ. కలకంఠి నెమ్మోము ♦ కంజాతవిభవంబు
కంజాతవిభవంబు ♦ కంధరంబు
కంధరంబు మనోజ ♦ కమనీయశంఖంబు
శంఖభాగము బాల♦చంద్రమూర్తి
మూర్తిసౌందర్యంబు ♦ కార్తస్వరావళి
వళివిలాసము వీచి♦కలనికరము
కరము కోమలదళా♦కరవారి జఘనంబు
జఘనంబు పులినసం♦స్థానజగతి

తే. గీ. గతిమదేభేంద్రనిస్తంద్ర♦గంధసరణి
గంధసరణిసువర్ణసం♦కల్పపదము
పదము లలివేణికగు శుభా♦స్పదములనఁగఁ
(దము లనగఁజాలు నతివ కుం♦తలపుఁజాలు.) 13

సీ. కనకరంభాతిర♦స్కారంబు విరిబోఁడి
సారసౌందర్యోరు♦సౌష్ఠవంబు
సవచక్రవిభవంబు ♦ నారీశిరోమణి
శ్రుతినితంబస్తన♦చతురిమంబు
మృగరాజవిభవంబు ♦ మేచకాంబుదవేణి
నయనవక్త్రావల♦గ్నప్రభూతి
వజ్రపుష్పాకార♦వైభవంబు లతాంగి
రదమ్మృదుత్వఘూర్ణ♦లక్షణంబు

తే. గీ. సారసాళివిలాసంబు ♦ సన్నుతాంగి
గమనకుంతలపంచశా♦ఖద్వయంబు
శంబరారాతివననాటి♦శంబరం బ
నంగ వగఁగుల్కు కల్కి నె♦న్నంగఁదరమె. 14

తమ్ము లెంతేని 11 సిరినిశాం♦తమ్ములైన
తమ్ము లనుమాట విడువకఁ ♦ దగిలి యుండె. 27

తే. గీ. వదనకమలమరందాప్తి ♦ వ్రాలి యచటి
గంధవహకాంచనప్రియ♦బాంధవంపు
వచనరచనలఁ దగు మధు♦వ్రతము లసఁగ
కాంతకర్ణాంతగతకటా♦క్షములు దనరె. 28

చ. కపురఁపుగంధి నెన్నొసట ♦ కస్తురితిన్ననిముల్కిఁ గూర్చి చొ
క్కపుబొమవింట మారుఁడు జ♦గజ్జయలీల సమర్చి యున్న ని
12క్కపు నవహేమకోశపరి♦కల్పితమోహనబాణపుంఖరే
ఖపు శిరిఁ దాల్చె నాస సుము♦ఖస్థితి నంబకసీవ్యభవ్యమై. 29

చ. మలయజగంధి వక్త్ర మను ♦ మన్మథపుష్పవనంబు నందు రం
జిలు నయనోత్పలంబులను ♦ జెల్వగు భ్రూలతలం బెనుపఁగా
నలర ఘటించి నట్టి యధ♦రామృతసంగ్రహయంత్రయుక్తని
13ర్మలకలశం బన న్విమల ♦ మౌక్తిక మొప్పె లతాంగి ముక్కునన్. 30

చ. సరసవిలాసవాగ్విభవ♦సారమెఱింగి మెఱుంగుఁబోఁడి కం
ధరవివరప్రవర్తిత ప♦దప్రచురాత్మహయగ్రహోత్సుకో
త్కరమకరాంకనిర్మిత♦రదచ్ఛదబింబఫలోపరిస్థవా
గురయన మౌక్తికాభరణ♦గుచ్ఛ మెసంగె లతాంగి ముక్కునన్. 31

తే. గీ. బోటి నెన్నొసము మరువిరి♦దోఁట నలరు
భూరిదళంబులు కస్తురి♦బొట్టు దలిరు
మోపు గల నాస పసి డంటి ♦ మొలకనీటి
బోదెగతి గంధవహమూల♦పుటము దనరె. 32

---

పా. 11. సిరికి నిత్యమ్ము లైన
పా. 12 క్కపు బలు మోహనాంబక వి♦కస్వరకాంచనకోశభాసుగో
ద్విపులవిచిత్రపుంఖనవ♦విభ్రమ మూర విలాసనాసయున్.
పా. 13. ర్మలకలశం బజుండనఁగ ♦ మౌక్తిక మొప్పె లతాంగి ముక్కునన్.

సీ. మానినీమణి సుధా♦మధురాధరము బంధు
జీవంబునకు బంధు♦జీవమయ్యె
తెరవ నున్నంబుగునా♦తేటి పూర్ణ పరిపక్వ
బింబంబునకుఁ బ్రతి♦బింబమయ్యె
మదిరాక్షి కెమ్మోవి ♦ మహిమంబు రత్నసం
తానంబునకును సం♦తాన మయ్యె
కలవాణి రదనాంశు♦కంబు దాడిమపుష్ప
1 నామంబునకు శుభ♦నామమయ్యె

తే. గీ. చెలియ వగడాలు నునుపగ♦డాలు గెంపుఁ
గలువచేరువఁ గని పొందుఁ ♦ గలువఁ జేరు
చిలుకమొగముల గల వన్నె♦ చిలుకమొగము
కళల దిగుబావి చెలిముద్దు♦కావిమోవి. 33

కం. తరుణీమణి వదనవిధ
స్వరకాంతస్వరసహస్ర♦పత్రాంతరభా
స్వరతరుణారుణదళసుం
దరమున రసనాంచలంబు ♦ తద్దయు నమరెన్. 34

చ. అతులితమోహనావిభ్రమర♦సాతిమనోహరమాధురీధురీ
ణత15పరిశుద్ధవర్ణ సుమ♦నఃప్రియలక్ష్మణకామనియ్యసం
తతమృదుసౌఖ్యసంపద లు♦దారత దాల్చి సుధారసంబు భూ
పతిసుతముద్దుపల్కులకుఁ ♦ బల్చనగాఁడె తలంచి చూడఁగన్. 35

తే. గీ. హారనీహారములయుజ♦క్షీరహీర
కుందమందారచంద్రికా♦కుముదచంద్ర
16తారకాతారడిండీర♦పారదప్ర
హాసభాసుర మగు మంద♦హాసగరిమ. 3

పా. 14 సారంబునకుఁ బుష్ప♦సార మయ్యె.
పా. 15 పరిశుద్ధవర్ణగణ♦నవభ్రమదభ్రధుదభ్రభూతిసం
పా. 16 తారకాహారడిండీర♦తారకవ్ర

తే. గీ. మగువ జిగిబిగిపలుచాలు ♦ సొగసుఁ జూచి
మొనలు విచ్చెను మల్లెపూ♦మొగ్గ చాలు
నీరసంబున మరరాలు ♦ నేలఁగ్రాలె
సరసదాడిమబీజముల్ ♦ సవతుఁ గాంచె. 37

తే. గీ. కులుకువిరిఁబోఁడి ముద్దుచె♦క్కుల మెఱుంగు
మిసమిసల దేరి పసిమి ను ♦ న్నసనెసంగు
కతన నెల్లెడ నిద్దంపు ♦ గళలు గుల్కు
తళ్కుటద్దంపుగమి చూడఁ ♦ దగిన దయ్యె. 38

తే. గీ. లలనలావణ్యరసధునీ♦లహరి విహార
మాణయువజనదృఙ్మత్స్య♦మత్స్యబంధ
17నద్వయం బొనఁ గూర్చెమీ♦నాంకుఁ డనఁగ
గండమండితచికురరే♦ఖలు దనర్చె. 39

తే. గీ విమలకమలాసనస్థితి ♦ వెలసి యున్న
శ్రీసమాకృతు లన మణి♦శ్రీవిచిత్ర
భూషణాలంకృతులు రాజ♦పుత్రికాప్రి
శోభితశ్రుతు లతులవి♦శ్రుతుల నలరె. 40

కం. మధురాధరాధరాధర
పృథుతరచుబుకప్రదేశ♦బింబం బలరెన్
విధువదనవదనగుహ యం
దధిగత మగు 18విధివధూవి♦హారం బనఁగన్. 41

పంకజగర్భుఁ డందు మృదు♦భాసురగీతగుణప్రయూర్థరే
ఖాంక మొనర్చి శంఖనివ♦హాన్వయదేశికభావ మిచ్చి ర
త్నాంకితపట్టబంధఘట♦నామృతపూతకృతాభిషేకధా
రాంకత నిల్పె నాఁగ మణి♦హారములం గళ మొప్పె నింతికిన్. 42

తే. గీ. సమదగజయాన భుజముల ♦ చంద మరయ
విమలహేమమృణాళనా♦ళములు గావె

పా. 17 నీయుగంబు మనోజుండు ♦ నిల్పె ననఁగ
పా. 18 విధివధూవి♦హారపీఠ మనన్

కాక యెటు గల్గు పాణిపం♦కజవిలాస
భాసురము లైన ఘననఖ ♦ కేసరములు. 43

కం. కరకంకణోర్మికాకర
(కరకమలము లిందుముఖికి)♦కర మల రారెన్
బరిఫుల్లలతాంతాంతర
పరికల్పితహేమదామ♦భరము లనంగన్. 44

సీ. అలరు చల్లనితావు ♦ లలము దట్టపు లేఁత
పసిమిచే నెసఁగు పూ♦బంతు లౌర
నునుమెఱుంగులచాయ ♦ లొనరి యాసలు గొల్పు
కళకు లూరెడు పైఁడి♦కలశ లౌర
కౌమరుప్రాయపు ముద్దు ♦ గుల్కు టామఁన నోల
లాడు జక్కవజోడు ♦ నాడె మౌర
పటుతరోన్నతనిత్య♦భద్రలీలల మించు
మదగజరాజకుం♦భంబు లౌర

ఆ. వె. ప్రేమసామదాన♦భేదదండము లనఁ
గలుగు చతురుపాయ♦ములను సవతు
బోల్పఁ దగిన రాజ♦పుత్రిక వలిగబ్బి
గుబ్బదోయిసొబగు ♦ నిబ్బరములు. 45

కం. చిలుకలకొలికికుచాంత
స్థలమిళితము లగుచు చిలుక♦తాళీరుచు లిం
పలరె రతిమదనమోహన
19కలితాబ్జవిలాసడోలి♦కారచన లనన్. 46

తే. గీ. కుందనపుబొమ్మ గాఁ బోలు ♦ కుందరదన
గాన నీలపుజవ రీతి ♦ గాన నగుచు
గారుకొని యున్న నునుమెఱుఁ ♦ గారు గఱికెఁ
జేర బారడె కడు బ్రహ్మ♦చారి యైన. 48

పా. 19 కలితవిలాసైకడోలి♦కారచన లనన్

కం. విచికిలగంధిమనోహర
కుచదుర్గవిహారకేళిఁ ♦ గోరెడి రతిరా
డ్విచితాధ్వయుక్తసోపా
నచయం బన వళులు నమరె ♦ నారీమణికిన్. 48

కం. హరిమధ్య మధ్యనిర్జిత
హరి పుష్కరసీమ లలిగి ♦ హరిపదవిభవ
స్ఫురణఁ గనె నంత విడువక
హరిపరమాణుస్వరూప ♦ మననెన్నడుమున్. 49

తే. గీ. హారరోమావళీపుష్క♦రాపగాక
ళిందజాసంగమక్షేత్ర♦లీల లమరె
16సకియపాక్కిలి గాదేని ♦ సరసజనదృ
గాళు లటు మున్గి రా నేమి ♦ కారణంబు. 50

కం. 17విలసత్సువర్ణమణి రే
ఖల వెలఁదుక జఘనసీమ ♦ ఘన మై యుండెన్
లలనాలలామ రోమా
వళి నవయౌవనలతాల ♦ వాలం బనఁగన్. 51

కం. ఇంపుగ మరుఁడు జగంబుల
చంపకసౌరభనితంబ♦చక్రోన్నతిచేఁ
బెం పలర జయించె నవ
శ్యం పితురాచార మనుట ♦ సత్యము గాదే. 52

మ. 18కరికర్ణాంతతిరస్కృతచ్ఛదనవ♦ర్గస్ఫీతిఁ ణ క్రోధహృ
త్కరివర్గంబు గ్రసింప పల్లవలవ♦గ్రాసాప్తి సర్వద్రుమాం
కురభేదంబుఁ దలంచి పిప్పలదళాం♦కూరంబు కాంతామనో
హరలీలాంగక మై మృదూరుకరిహ♦స్తాశ్రిత్యవృత్తిం దగెన్. 53

పా. 16 సకియపొక్కిలి గాదె స♦త్సరసజనదృ
పా. 17 విలసత్సువర్ణమణిమేఖల వెదుకఁగ జఘన
పా 18 కరికర్ణాంతతిరస్క్రియాభ్యసనరే♦ఖం బొల్చినం గోరిక

‡ తే. గీ. కరకుటులవృత్తి దెల్పి త♦ద్గంధగంధ
బంధురధురంధరత్వసం♦బంధ మంది
23శారదములు మృదూరులై ♦ మీఱెఁ గదళి
వారణంబుల కిది వైర♦కారణంబు. 54

తే. గీ. చిక్క బాబావజీరుచేఁ ♦ జిక్కి హాాయలు
గ్రిక్క తూణీరముల వన్నెఁ ♦ జొక్కమైన
నాతి పిక్కలకును రాజ♦నంపు బొట్ట
లీ తలావుల వే రీతి ♦ నీడు వచ్చు. 55

తే. గీ. కలితలావణ్యసారశృం♦గారసరసిఁ
దేలి మురిపెంపు గతులచే ♦ నోల లాడు
పైఁడి తాఁబేటిపిల్లల ♦ పగిది మించు
చెలియ మీఁగాళ్ల పొందికఁ ♦ జెప్పఁ దరమె! 56

‡ ఉ. శోకయుగప్రహాసకుచ♦కుంభవిలాసిని ముద్దుపాదముల్
కోకనదస్వరూపముగఁ ♦ గూర్చియు వాగ్వనితాధినాథుఁ డ
స్తోకతరప్రకాశముఖ♦శోభ లనారతము న్వెలుంగ ని
త్యాకృతు లైన తత్పదన♦ఖాంకురతారక లుంచె నేర్పునన్. 57

‡ తే. గీ. శంబరారాతివిజయశా♦సనపటం బ
టంచు నెంచెద రది మది ♦ నెంచి చూడ
గొనబు దనరెడి తళుకు కుం♦దనపు టనఁటి
నెలమి నలరు కోటాకు లా ♦ వెన్ను వెన్ను. 58

‡ తె. గీ. ఆ యలరుఁబోఁడి నెమ్మేని ♦ చాయ కెదిరి
ఘననిశాఖండములు నల్గెఁ ♦ గడు మెఱుంగు
లడరి గడగడ వడకెఁ బు♦త్తడి గరంగి
పెక్కువన్నెల రారాపు ♦ జిక్కి యుండె. 59

పా. 23 శారదములు తదూరుల ♦ సాటిమున్న
కతన గజరంభలకు వైర♦కారణంబు

‡ తే. గీ. ఎందుఁ జూచినఁ గాని పూ♦ర్ణేందువదన
యానముల పోల్పఁ గన నిభ♦యాన నెపుడు
యా నలినసంభవుని చిత్ర♦యానములకుఁ
దలఁచి చూచిన లేని సం♦కెలలు గావె. 60

‡ సీ. రతిరాజశంఖశీ♦లత నైన లత నైన
మించు కంధరము నె♦మ్మేనిచాయ
బలితంపు పండువె♦న్నెల నైన నెల నైన
మురియించు నగుముద్దు♦మోము గోము
సమదకిశోరకే♦సరి నైన సరి నైన
లాలించు నడుము కెం♦గేలు మేలు
మరుపంపుచిల్వ లే♦మల నైన మల నైన
వెల దేర్చు సొబగు గు♦బ్బలబలంబు

తే. గీ. లెన్న దగు రన్న 24 చెలిమిన్న ♦ పొన్నగున్న
వన్నె చిన్నె లి కె న్నెన్ని ♦ యున్న వన్న
యన్ని నిజ మెన్న డిటు లున్న ♦ వన్నెలాఁడి
నెన్నికల నైన విన్నవా ♦ రెన్న నరిది.

‡ సీ. గజయాన నెమ్మేని ♦ కాంతు లొసలు గొల్పు
దాని దోఁబూఁచుల ♦ దాని నెన్ను
కలకంఠకంఠి లే ♦ గొను రూపము లేని
దాని నో రెడబాటు ♦ దాని మించి
వెలఁది తియ్యసిమోవి ♦ 25 వేల్పుటోగిర మైన
దాని క్రొన్నన జీలు ♦ దాని నేలు
కొమ్మ వేసలి గుత్తు ♦ లొమ్ము నానుపు బాటు
దాని పాటలబోటు ♦ దాని మీటు

పా. 24. రాక న్నె♦మిన్న వన్నె చిన్నె లెన్నని క న్నెన్ని♦
పా. 25 వెలుపుటోగిర మైన

తే. గీ. మగువ నెమ్మోము సరిసాటి ♦ మాయ లలరు
దాని సింగపుదొర మెచ్చు ♦ దాని కెచ్చు
భావముల ధాత్రి శతపత్ర♦పత్రనేత్ర
రమ్యశుభగాత్రి మదనాభి ♦ రామపుత్రి. 62

‡ సీ. అబ్జశోభాస్ఫూర్తి ♦ నలరారె విమలాంగి
వదనకంఠద్యుతి ♦ వచన రచన
నాగప్రభూతిబాం♦ధవ మొందె విరిబోఁడి
నెరిఁగొప్పు గతి నాభి ♦ మెఱుగు టారు
పుష్కరాభిఖ్యాతి ♦ బూనె సారసనేత్ర
యూరుమధ్యాంఘ్రి వ♦యోవిభూతి
గోప్రభంగాకృతి ♦ గోన బారె నలివేణి
దంతనితంబదృ♦గంతవళులు.

తే. గీ. నిండి కనుపండు వై యుండు ♦ రెండు మూఁడు
నాలు గై దారు పది నూరు♦లోలి గల్గు
నోరులదొర ల్గణింపఁగాఁ ♦ దీర దనిన
నితరు లెన్నఁద రనుచు నూ♦హింపఁ దరమె. 63

ఉ. డాలు మిటారిమేను మరు ♦ డాలు నెదుర్కొను జూపు చంద్రఖం
డాలు నఖంబు లేర్పఁగ♦డాలు రదచ్ఛదకాంతు లేన్గుతుం
డాలు తొడ ల్మదాళి జగ♦డాలు కురుల్ నునుదమ్మికెంపు తం
డాలు రదాళి బ్ణైబిర♦డాలు కుచాగ్రము లవ్వధూటికిన్. 64

‡ కం. కుందమ్ములకుం దమ్ముల
కుం దమ్ము లనంగ వన్నె ♦ గొను రద పదముల్
కందమ్ముల కందమ్ముల
కందమ్ముల నెసఁగుఁ గుంత ♦ లాళులు సఖికిన్. 65

చ. 26మగువపదంబు కోకనద ♦ మానదమానద మాప్రభావాభి న
మ్మగ నగు రూపు భాగ్యకర ♦ మాకర మా కరమా మృదూక్తు లిం
చఁగఁ గటిసీమ మోహాదర ♦ సాదరసాదరసాధుకంఠలీ
ల గళనినాద మెన్నఁ బిక♦లాపికలాపిక లా కచాళియున్. 66

చ. గతితళు కంచ కన్న మెఱుఁ ♦ గా మెఱుగా మెఱుఁగారులీరుచ
ర్వతకుచమోవి జూపు తొగ♦రా తొగరా తొగరా మొగంబు స
మ్మతి మెయి కంఠ మెన్న దర ♦ మా దరమాదర మా నలగ్నసీ
మ తురుము క్రేల్గమోవి సర ♦ సా సరసా సర సా ర నాభియున్. 67

చ. 27ఘనకబరీ స్తనాకృతులు ♦ కందర మ్ము దర మ్ము ర మ్ముకృ
జను మది కంతవక్త్రములు ♦ సాదర మా దర మా రసాక మా
దినుసుగ వాక్సితాంగములు ♦ తే నెలతో నెలతో లతో క్షితో
నెన యగు నాభిజంఘగతి ♦ హేమకరి న్మకరిం గరి న్నగున్. 68

చ. కలికి మెఱుంగుఁదీఁగె మొల♦కా తళుకా 28వలకాకఁ జేయు లీ
లల నగుమోము దమ్మి మిగు♦లా వగ లా వగ లాఁడి వల్కు చి
ల్కల నలరించు గుబ్బ లరు♦లా శిరులా మరు లానజేయు కో
మ్మల తలమిన్న చక్కదన♦మా ఘనమా జనమాన్యకన్యకన్. 69

క. కందనిమానుపండు కను ♦ గందని జాబిలినిగ్గు లేటి ము
క్కందని పూలగుత్తి మరు ♦ గందని తళ్కుమెఱుంగు జిల్గు వా
గం దని ముద్దుచిల్క తరు ♦ గందని బంగరు మొల్క పూలుడా

---

పా. 26 చ. మగువపదంబు కోకనద ♦ మానదమానద మాధ్వక్షితి న
మ్మగ నగు రూపు మోహాకర ♦ మాకర మా కరమా మృదూరు యు
గ్మగతి ముఖంబు తామరస♦మారస మా నితాంగ మిం
పగు కటిసీమ వేణి ఘన ♦ మాఘన మా ఘనమార్గమధ్యకున్.

పా. 27 చ. ఘనకబరీ స్తనాకృతులు ♦ కందర మై దర మై ర మైకృతిన్
జను మది కంతవక్త్రములు ♦ సాదరమా దర మా రమాక మా
కనుఁగవ మోహదేహములు ♦ గల్వలతో వలతో లతోన్నతిన్
దిన సగు పల్కు బల్వలపు ♦ తియ్యన నై యనమై నమైకృతిన్.

పా. 28 బలుకాదరంపు లీ

గందని మారువాటి నెర ♦ గందని క్రొన్నెలజింకకూన నూ
గందని తమ్మిమొగ్గపులు ♦ గందని ముత్తెము సుమ్ము కొమ్మయున్. 70

‡ సీ. కళలు దేరెడు నిండు ♦ జిలుగు వెన్నెలగుత్తి
గమగమ వలచు బం♦గారుమొలక
క్రొందమతుమ్మెద పాదు♦కొనని క్రొన్ననదండ.
నడువనేర్చిన రత♦నంపు బొమ్మ
కదలక నిల్చు తొ♦ల్కరిమించుదీఁగె దె
మ్మెర చూఱ గొనని క♦ప్పురపుతావి
తొడరి కోయిల సుంక ♦ మడుగని యెలమావి
వెల లేని జిలుగువ♦న్నెలకొటారు

తే. గీ. కాంత రతికాంత కాంతు బూ♦జింతు ననుచు
సంతసము నెంత సంతనల్ ♦ దొంతరిలఁగ
సంతరించిన వింత చా♦మంతిబంతి
వంతుకెక్కిన వలరాజు♦దంతి యింతి. 71

సీ. కపురంపుతావి చి♦ల్కులకొల్కి చిన్నిపూఁ
దేనె తొల్కరిమించు ♦ తేటుకత్తె
వలపులమూట న♦వ్వులదొంతి జిల్గువ
న్నెలగనివగనిగ్గు ♦ తలిరుమావి
చక్కెరబొమ్మ ము♦చ్చటదీము మోహంపు
టచ్చు తళ్కుల ముత్తి♦యంపు క్రోవ
సొగసులగుత్తి సం♦పెఁగమొగ్గ సారంపు
మొలక శృంగారంపు♦కొలను ముద్దు

తే. గీ. పలుకులమిటారి మరునిచా♦యలకటారి
మొగలి విరిబాకు తమ్మికెం♦పులసలాకు
నాణెములదీవి చక్క♦దనంపురీవి
కన్న విరిపొన్నగున్న రా♦కన్నెమిన్న. 72

చ. చతురతరప్రధాన మతి ♦ సారసయాన మదేభకుంభజృం
29 భితకుచకుంభభారరుచి ♦ పేశలబింబఫలాధరోష్ఠి సై
కతజఘనాళి కుంతలి ప్ర♦గల్భగుణోన్నతి భాగ్యమూర్తి వి
స్తృత నయనాబ్జవక్త్రిమద♦రేఖ యనం జను జవ్వనంబునన్.

తే. గీ. మవ్వముగ మేన నిండారు ♦ జవ్వనమున
నాతి నూతనపద్మినీ♦జాతి రీతి
నలరె కవిరాజహంసప్రి♦యాళు లలమ
సరసులకు వన్నె లొదవింపఁ ♦ జాల కున్నె.

తే. గీ. ఇటుల నెన్నఁగఁ దగిన మి♦క్కుటపుఁ గొమరు
ప్రాయమున సరసాళి బిం♦బాధరోష్ఠి
మదనమోహిని శశిరేఖ ♦ మంజువాణి
సరసమంజరి మొదలైన ♦ సఖులఁ గూడి.

కం. ఒకనాఁడు కుతూహలపూ
ర్వకముగ కేళీవిహార♦రచనల బహుచి
త్రకళాకౌశలవిభవా
త్మక యై సకలైనభర్తృ♦దారిక యంతన్.

సీ. వలి గప్పురపు టంటి ♦ మొలక బోదెలచాలు
దులకింప సంపెఁగల్ ♦ గులుకరింప
విరిమల్లెబోదల పం♦దిరుల సొరులు మీఱ
చామంతు లొకవింత ♦ జాడ నలరఁ
బొగడతావులు మేలు ♦ బొగడఁ జాల నెసంగ
పొన్నగున్నల బాగు ♦ పొందుఁ దెలుప
వీడెంపు టాకుదీ♦వెలు సంపదల నింప
పోఁకమ్రాఁకుల ఠీవి ♦ జోక నెఱప

తే. గీ. సన్నవిరజాజు లలరు గొ♦జ్జగుల చెఱకు
సరకు దాడిమ ఖర్జూర ♦ సాల ద్రాక్ష

పా. 29, భితకుచకుంభభారప్రతి♦బింబితబింబఫలాధరోష్ఠి

తెలమి ఫలపుష్పముల కల్మి ♦ యెపుడు గల్గి
తనరు నెర వైన యుద్యాన♦వనములోన. 77

సీ. నిల్వుటద్దపుగోడ ♦ నీలంపు దూలముల్
బవడంపు గుంద్రకంబ♦ములు జికిలి
తెలిరాల తలుపు రి♦క్కలపుల్గు రాపచ్చ
రాలఁ గూర్చిన చిత్ర♦జాలకములు
బలుగెంపు వాసము ♦ లలరింపు జిగి పెంపు
పైని బంగరుకప్పు ♦ బల్మెఱుంగు
వన్నె జిల్కిన చందు♦వానిగ్గు నిగనిగల్
దిల కింపు తెరలు ము♦త్తెముల జాల

తే. గీ. రులును మరకతసోపాన♦ములును జంద
మామ రానిగ్గు టరుఁగులు ♦ మానికముల
గద్దియలు చిత్తరుల పొందుఁ ♦ గలిగి యెపుడు
సుందరం బైన కేళికా♦మందిరమున. 78

తే. గీ. విరచితా స్తరణాంబరాం♦తరముఁ జేరి
కోరి తనచుట్టు చెలు లెల్లఁ ♦ గూరు చుండ
పసిడిపూవుల దంతపు ♦ పని మెఱుంగు
లూరు వీణెను బూని యొ♦య్యారి మొదవ. 79

సీ. కడు విల్వ లిడు జల్వ ♦ బడు వల్వ గటి చెల్వ
రంగుఁ జందఱు కావి♦రంగు లీన
నునుదళ్కులను జిల్కు ♦ గనుబెళ్కు లెన గుల్కు
దుముకు లై కర్ణపూ♦రముల కెగయ
వగ లెన్నఁ దగు చన్ను ♦ జిగి మిన్న లగు జన్ను
లెద గప్పు జిలుగు ప♦య్యెదను గదుమ
30తగుతీవి జిగికావి ♦ నగు మోవి గదుర నా
సామా క్తికము బ్రభా♦సము జెలింప

పా. 30. తగుతీవి జిగితావి ♦ తొంగవావి నగుమోవి గదుర నాసామాక్తికము జెలింప

తే. గీ. పసిడి గాజులు కేలఁ బెం ♦ పెసఁగ గల్లు
గల్లు రనుచును సరితాళ♦గతుల నెఱపఁ
దనరు మందర మధ్యమ ♦ తారకముల
వీణె మీటుచుఁ బాటఁ గా♦వింపఁ దొడఁగె. 80

కం. సరిగమపధనిస యను సు
స్వరరచనల సప్తతాళ ♦ సంగతులను ద
త్తరి యను శబ్దాదికముల
మఱిమఱి యందములఁ బాడె ♦ మాధుర్యముగన్. 81

శా. గౌరీ నాట ముఖారి మాళవి ధనీ ♦ గాంధారి దేశాక్షరీ
పూరీ భైరవి ఘూర్జరీ మలహరీ ♦ పున్నాగ సౌరాష్ట్ర సా
వేరీ కన్నడ గౌళ మోహన య సా♦వేరీ వరాళీ బిళా
హరీ మారువ లాది రాగములు మే♦లొందన్ వడిన్ బాడఁగన్. 82

ఆ. వె. సరసులకును మోహ♦సంపద లొదవించె
పూలు పూచెఁ దరులు ♦ రాలు కరిగె
నేమి చెప్పవచ్చు ♦ నేలోకమున నైన
గానమునకు సాటి ♦ గానఁ గలదె. 83

తే. గీ. సరసవైఖరి షడ్జమ♦స్వరము రాగ
సరణిఁ బాడిన మది భయ ♦ సంభ్రమములు
గలిగి భ్రమఁ జెందుఁ బున్నాగ ♦ గణము లెల్ల
న్యాయనయ మప్పు డరయ న♦న్యాయ మయ్యె. 84

వ. ఇట్లు విచిత్రం బగు గానం బనూనంబుగఁ గావింపు చున్న విని
యు కన్నెమిన్న యెన్నఁ దగు మిన్న యగుట మన్నింపుచు నన్నరనాయ
ండు. 85

కం. కనువేడుకఁ గొని తనయను
దన యనురాగమునఁ జూచి ♦ తగ ముదము మదిం
బెనఁగ మనోరంజనుఁ డను
జనుఁ డను గగు మంత్రి యగుట ♦ జనవరుఁ డనియెన్. 86

సీ. సరససారంగాతి♦శయనిరూఢి దనర్చె
పున్నాగవైభవ♦స్ఫూర్తి నలరె
రమణీయరూపవ♦రాళిసంగతి మించె
శంకరాభరణసా♦ష్టవముఁ జూపె
గరిమ కల్యాణివై♦ఖరులు గానఁగ నయ్యె
ఘనమేఘరంజనీ ♦ క్రమత దనరె
మంజుల శ్రీరాగ ♦ మంజరి సిరు లబ్బె
హితజగన్మోహనా♦కృతి వహించె
తే. గీ. కలికి దృఙ్మాభిమూర్ణకుం♦తల వితాన
రోమరేఖాపఘనకచ♦స్తోమ కుచ వి
లాసమహిమాతిశయముల ♦ లలిత గీత
కృతకవిద్యాధిదేవతా♦కృతి నటించె. 87
తే. గీ. గానవిద్యాంబునిధి సుధా♦కరకళాస్వ
రూప మగుఁగాన నిటువంటి ♦ రూఢిగతుల
వెలసెఁ గా కౌర వేలుపు♦వెలఁదులకును
గలుగు నే యిట్టి యతులశృం♦గారమహిమ. 88
చ. అని యిటు లెన్ని మిన్న యగు ♦ నాత్మజ నప్పుడు కన్నులారఁ గాఁ
గనుఁగొని సంతసించి నృప♦కాయజుఁ డాత్మపవిత్రవంశసం
జనితయు గీతసేవధియు ♦ సారసుధీ యగుఁ గాని సాహితీ
ఘనచతురత్వ మించుకయుఁ ♦ గాన దటంచుఁ దలంచి వెండియున్. 89
తే. గీ. పూర్ణచంద్రాస్య యామినీ♦పూర్ణతిలక
గాన విద్యాప్రవీణతఁ ♦ గాంచె నెంత
యకట సాహిత్యహీన యై ♦ యలరెఁ గావ్య
భవ్యనాటకములు జెప్పఁ ♦ బ్రౌఢ యగును. 90
కం. మొగ మెల్లఁ గన్నుగవ మేల్
జిగిగుబ్బ లురమ్ము గమ్మెఁ ♦ జిలుగు నడుము మి
న్నగు వగలాఁడికి విద్యలఁ
దగు శిక్ష యొనర్చు రసిక♦తము లెవ్వరొకో. 91

వ. అని యడిగిన రాజునకు నిష్టసఖుం డైన మనోరంజనుం డిట్లనియె. దేవా సర్వజ్ఞుండైన నీకుఁ దెలియనియది యేమియుం గలదే! ఐనను నాకుం దోఁచిన విధంబు వివరించెద నాకర్ణింపుము. సకలశాస్త్రపురాణేతిహాసతత్వజ్ఞు లైన విద్వన్మహాజనులచేఁ బరిపూర్ణం బైన నగరంబున కధీశ్వరుండవు. తదాశీర్వచనరచనావిశేషసమర్థతావిశేషసౌభాగ్యభాగ్యోదయుండవు. పండితజన మనోరథఫల ప్రదానసంతానమహీరుహుండవు. సంతతానంతదేవబ్రాహ్మణాభక్తితాత్పర్యుండవు, సకల విద్యా విశారదుండవు, కార్యాకార్యవిచక్షణుండవగుటం జేసి తావకానుగ్రహాపేక్ష క్షమాదేవతావర్యులం బిలిపించి యేతద్వృత్తాంతం బంతయు నెఱింగించిన వార లెవ్విధంబునం బల్కుదురో తెలియ వలయు ననిన ధరావరపుంగవుండు నిజాంతరంగంబున నంగీకృతహర్షోత్కర్షతరంగితుండై నిజాంతఃపురంబుజేరం జనిన మనోరంజనుండు ననుజ్ఞాతుం డై నిజనివాసంబునకుం జేరి యుచితప్రకారంబుననుండె ననంతరంబ. 92

కం. మందారమాలికాగృహ
మందాత్మజగోష్ఠి పరత ♦ నానందరసా
స్పందాయమానమానస
మందారమరందమధుర♦మదమధుకరుఁ డై. 93

కం. ఆనందనిధానం బగు
నా నందని గుణగణంబు ♦ లాత్మప్రియస
న్మానంబు మీఱ లసదుప
మానంబున కతిశయించి ♦ మహిమల మించెన్. 94

వ. అంత వింత యగు కేళీనిశాంతప్రాంతంబున నిశాంతంబు శాంతంబుగాఁ దెల్పు వేణువీణాదినినాదంబుల మేల్కాంచి శ్రీరామచంద్రపాదారవిందధ్యానపరాయణుం డై మణిదర్పణాదిదర్శనంబు గావించి కాల్యకరణీయంబులుతీర్చి నిమిత్తకోవిదప్రోక్త వచనరచన లాకర్ణించి సముచితాంతరాంతరనమజ్జనప్రదర్శిత మజ్జనగృహాంతరాళచంద్రోపలపర్యంకికావిషణ్ణుం డై గంధసలిలాభిషేచనంబు నిర్వర్తించి నూత్ననిర్ముక్త గూఢపాత్ర్యాః నిర్మోకసమానమానితధవళాంశుకోత్తరీయుం డై సూర్యార్ఘ్యప్రదానాది సంధ్యా

ద్యనుష్ఠాన విధివిధానంబునం బ్రవర్తించి బ్రహ్మయజ్ఞాగ్ని హోత్రాదిపవిత్ర కర్మంబు లాచరించి రామాయణాది పురాణపారాయణత్వంబు వాటించి హాటకప్రాకారసుందరం బగు దేవతామందిరంబుఁ బ్రవేశించి తదంతరాళసంస్థాపిత హేమకమల కర్ణికాసనాసీన పట్టాభిషేకసమయ సమాక్రాంతదిగంతరానంత పుణ్యాపుణ్యజనాన్వయ విభూషణ విభీష ణాంజనే యాంగద జాంబవద్భరతభరతానుజన్మ లక్ష్మణ ప్రముఖ సంవాహిత శ్వేతచామరాద్యఖిల శుభలాంఛనాంచిత శ్రీ సీతారామాభిరామ రామవతార విగ్రహానుగ్రహానుసంధానవిధాన షోడశోపచారపూజాకలాపంబు కలాలాపంబుగా సమర్పించి తత్ప్రసాదానుమోదితహృదయారవిందుం డై పూజాగృహంబు వెడలి యెడ నెడం దొడరు జన్నవ గడుసునఁ బడుగు నడుములు గడగడ వడఁక దడబడ నడుగులిడిన కుడి యెడమల మడము నొడియుచు జడల బెడంగు లడర నంజల కంజరాగపుంజ రంజిత మంజులమంజీర శింజితంబు గ్రిందుకొన నందఁబు లగు కేలు దీవల నం దంద నందగించు కుందనపు బాజు బందులకుం బొందికలు జిలుకు జికిలి కుచ్చుల మెచ్చులచ్చపు బచ్చవిల్తు ముచ్చట మచ్చికలకు మచ్చుఁ గొలుప వలపులకుం జాలు జూపు వాలుజూపు జూపరుల కాప రాని తరితీపు నెఱప యొఱపు మురిపెంపు టిరవు లగు మరుని వాగురులకుం గురువు లగు మెఱుఁగు టుంగరపు ముంగురుల సిరులు మిసమిసల నెసఁగు పసిఁడి క్రొందమ్మి మిసిమికిం బస గొని ఘుసరి గుసగుసల మసలు భసలవిసరంబులం గసరు మసరున నోల పెంపెసలు గూయ డాయం జను ప్రోడ లగు నూడిగపుచేడియల గై దండ గొని మెఱుంగు బంగారు సింగారంబులం బొంగారు శృంగారరచనాగారంబుఁ బ్రవేశించి విలాసినీసమర్పితేందూపలపీఠికాసీనుం డై యున్న య న్నరనాథాగ్రణికి నొక్క రమణీశిరోమణి మణిముకురావలోకనంబు గావింప నొక్క వధూతిలకంబు రాజతిలకంబునకుం నిటలతటఘుటితచటుల కస్తూరికాతిలకరేఖావిలాసంబు వికచకమల మరందరసాస్వాదనాంతర్లీన మదవదిం దిందిరార్భకనిర్భరత్వంబు సంపాదింప మఱియు నొక్క శంపాలతాంగి యా రాజపుంగవున కభంగురమంగళప్రదాదభ్రశుభ్రవిభ్రమైకముక్తాఫలప్రపూర్ణ స్వర్ణకర్ణాభరణయుగళంబు వదనసుధాసదనదర్శనాగత చిత్రానలతారకాంశమూ

రు లతులకీర్తనంబులం గపోలపాళికాన ర్తనానువర్తనస్ఫూర్తుల నందె న
విందుదేర వే ఱొక్క నారీరత్నంబు నృపరత్నంబునకు మవ్వంపుఁజెల్వు నివ్వ
టిల గెంపురవ్వల సంతసల వింతఁ దనరు దంతపుదువ్వెన నెవ్వగల మెఱుఁగు
లడరదువ్వి గమిచిన సనిచిన తనులతామోదమ్ముసనం గ్రమ్ముకొను
కొందమతుమ్మెదల మెదల నీక జోకగాఁ గూర్చి తార్చిన వెగటుసొం
పెగయు సంపెఁగమొగ్గ నిగ్గు లుగ్గు లిడుటకు మొగ్గించె నన పసిండితాయె
తుల జతలకుం బట్టగు హారంబట్టు బొండుసంబొండుపడం జుట్టిన దట్టంపు
సోగపెన్నెరులసిగ వగలు గులుకఁ మిన్న యగు నొక్క కన్నియ యమ్మన్నె
తేనికి సన్నంపువన్నె లెన్నఁ బన్నిన చెన్నున చిన్నినెన్నల నిగన్నిగల
మెఱయ శిరంబునం బ్రబలు ధవళోష్ణీషణాభూషణంబు రోహణాచలశిఖ
శృంగారరసాభంగరంగత్తరంగమాలికాసుందరం బగు మందాకినీహ్రదంబు
చందంబునం బొందు నెరప రయిం డొక మెఱుంగుఁబోఁడి యా రాజహంస
మాళికాభాగభోగార్హ్యలాంఛనాకల్పం బనల్పంబుగా మెఱయ మఱియు నొక్క
తరుణీలలామం బ భూపాలలలామంబునకు ఘుమఘుమాయమాన మృగ
మదసారభాసారఘనసార సారతుషారాంబుమిళిత పాటీరపూరాభిబంధురగంధ
సారం బవిరళమనోంబురుహాంతరాళప్రభూత నూతనకృపారసాభివృద్ధిప్రద
ప్రసిద్ధసిద్ధౌషధక్రియ ననుకరింప భాసురవిలాసంబుగా నొక విలాసినీరత్నంబు
రత్నకంకణ ఝుణఝుణత్కారంబు లెసఁగ సలరు సురటి విసరఁ దద్దయు
నొక్క ముద్దియ ముద్దు నెరప నన్నరపతికిం బ్రశస్తవిస్తీర్ణతరోరస్థలన్య
గోస్తన స్తబక నిస్తులస్వర్ణమాలికాపుంజంబు రంజితాత్మగుణమణిగణార్పణ
పత్రికాళభాసురత్వంబు నాదరింప సాదరంబుగా నొక్క తలోదరి యా ధర
ధరవరేణ్యునకుం భుజార్గళగ్రథితరత్ననూత్నాంగదయుగ్మంబ యుగ్మత
ప్రాజ్యరాజ్యేందిరానుబంధురబంధశృంఖలావిలాసరూపంబు ప్రాపింప లీలావ
యొకర్తు కా రాజమూర్తికిఁ బ్రిబల బిలేశయోపమానాంగుళులకు శేశయాంగ
ళంబుల మణిఘృణివిరాజమానోర్మికానికరంబు మకరంద బిందు నిష్యం
మాణ సుమనోభినందితమందారశాఖాశాఖా శోభాకరత్వంబుఁ దెలుప కలి
యొకతె యా రాజకొమరునకుం గొమరుమిగుల మిగుల నిగన్నిగల
మెఱయు బిరు దగు మగరాలజగజంపుటందియ సందియంబులొలియు స

లితపల్లవస్తోమవాదం బగు వామపాదంబునం బ్రణమితామితవితతసంగరాం
గణ ప్రభూతభీతచేతోంబుజాతాహితక్షమాధర శిరస్థగితమకుటతటఘటిత
రత్ననిర్యత్నప్రభాభవనసముదయావలంబితాలవాలలీలాకలాపం బననుకరింప
నలంకరించిన భువనమోహనాకారంబుగా నలంకృతుండై కురంగట మెలంగు
కురంగదృక్సమాసాదితాంభోజరాగప్రసాదపాదుకాద్వంద్వంబు విపక్షక్షమా
వరదంపతీస్వాంతాంతర్ధాళంబుగా నంఘ్రినాళీకంబులం దొడంగి విలాసినీపరి
వృతుండై యచటవెడలి సప్తకక్ష్యాంతరంబులు త్వరణంబుగావించి నిజ
విలాసదర్శనానందరసమరందబిందుసందోహసుందరహృదయారవిందవందిమా
గధయూథంబు సముచ్చార్యమాణధైర్యస్థైర్యశౌర్యగాంభీర్యచాతుర్యసౌం
దర్యౌదార్యైశ్వర్యదాక్షిణ్య పుణ్యాగణ్యవిద్యావిశేష హృద్యానవద్య గద్య
పద్యంబులం బ్రస్తుతింప విద్యోతమాననూతనశాతకుంభరంభాస్తంభ సంభార
పూర్ణకుంభాభిశోభితద్వారపార్శ్వవేదికాప్రదేశంబును దేశాంతరాగత వివిధ
శిల్పికానీకప్రకల్పితానల్పచిత్రపాంచాలికాముకురఫల కోమల స్థగితభిత్తికా
విలసితంబును సితాంబువాహినీఫేనగుళుచ్ఛస్వచ్ఛరుచిస్థూల ముక్తాఫలస్వర్ణ
శృంఖలాఘటితఘంటికా కాంతప్రాంత హరిణాంబరవితానాయమాన కాయ
మానంబును మానితేందూపలవిరచ్యమానసోపానపార్శ్వప్రమద రదావళీకర
శ్రీకరాకారరేఖా తిరస్కారితాభ్రముతురాషాణ్మతంగ జోత్తమాంగంబును
మాంగల్యదేవతానివాస భాసురవిలాసభవనవిశదంబును విశదవిస్ఫుటస్ఫటికో
పలస్థాపితవితర్దికాంతరవిస్తీర్ణస్వర్ణచిత్రకంబళాస్తరణబహుళసుందరంబును సుం
దరతరపురందరోపలవలభికాధారదారుకావలగ్నమకరత మాణిక్యపుంజరంజిత
కనకపంజరచకోరకీర శారికా కపోతపాళికాజాలకంబును జాలకమాలికాలం
కృతోద్యానవనసటత్కురంగశాబకమయూరరాజహంసాభినర్తితాంగణ విశాలం
బును విశాలాదిదేశాంతరావసవిధాననగరాగతార్థిజనంబును జనమనోహరపరి
మళద్గంధవిలసితాంత రాష్ట్రదిగ్భాగభాసురంబును సురవరాశ్మస్నిగ్ధగంభీరవేదిం
ద్రహస్తస్తంభానుమేయకమలశీకరోద్గీర్ణయంత్ర స్తంభాభిరూపవాపికోత్కం
ఠంబును కంఠీరవంబులేవ దుర్గాధివాసభరితంబును భరతశాస్త్రంబు డంబున
హంసమయూరభాణపతాకాది లక్షణప్రకరంబును కరంబు కరణి మణివలయ

ప్రకోష్ఠవైభవంబును భవశరీరంబు పోలిక సర్వమంగళాభిరామంబును రామ
కథా విధానంబున సుమిత్రానందనైకప్రధానవిశ్రుతంబును శ్రుతివాక్యంబు
పగిది సకలలోకార్హక్రియాకలాపంబును కలాపంబు రూపంబున వివిధ
వర్ణావలోకనాశ్చర్యప్రదంబును ప్రదరౌఘ జనోద్భాసితం బైన సుమనః
ప్రకాశితంబును పుణ్యజనాధిష్ఠితం బైన విబుధసేవితంబును విరాడ్విహార
యోగ్యం బైన భోగినీప్రదేశంబును రాజమండలప్రదర్శితం బైన పద్మినీమనో
హారంబును విస్మృతమార్గం బైన దుష్ప్రవేశప్రసిద్ధంబును చంద్రాంశు
సమాకీర్ణం బైన సమాహ్లాదిసుహృచ్చక్రంబును నగు వైభవాక్రాంత
భువనాంతరాళంబగు సభాభవనాంతరాళంబుఁ బ్రవేశించి రత్నసింహాసనా
సీనుం డై రాజమన్మథుండుఁ గావున నొక్కకేల లీలారవిందంబు గీలించి
విలాసినీసమర్పిత కర్పూరతాంబూలికాచర్వణంబుఁ గావించుచు నితంబినీ
హస్తవిన్యస్తవిస్ఫురద్రత్ననాళావలంబమాన ధవళచామరస్తోమాభిరామంబు
సకలదిగంతరాక్రాంతనిజకీర్తిలతావితానమాలికావిలాసంబుఁ బెంపుఁ జేయ
నిజరూపవయోవిలాసగుణగణతృణీకృతరంభాద్యప్సరోగణగణికాజన ప్రవృత్త
నృత్యవిద్యావిశేషంబు సంతోషంబు నెఱప వేణువీణాదితూర్యనిక్వణంబులానం
దంబు పొందుపఱుప సన్నిహితపురోభాగనియమితస్థలస్థిత భృత్యహస్తస్థిత
రత్నత్సరుఃఖడ్గనిర్మలభర్మనిర్మితచర్మఫలకంబులు జూపరులకుం బులకంబు
లొనరింప సమ్ముఖోభయపార్శ్వస్థవేత్రధరోచ్చార్యమాణజాగ్రద్వచనరచనా
చమత్కారంబు కర్ణోత్సవంబు సంపాదింప సుందరీమదనాభిరామరూపత్వంబు
బ్రాపింప మదనాభిరామభూమీశ్వరుండు నిండోలగం బున్న యవస
రంబున. 9

తే. గీ. ఉజ్జ్వలద్రాజగోత్రోద్భ♦వులు బుధేంద్ర
గురుకవులు మిత్రపుత్రభో♦గులు మహార్హ
లాంఛనాశ్రితు లతులక♦ల్యాణమతులు
బలసి సేవింతు రా జగ♦ద్బంధుఁ డలర. 9

వ. మఱియు హితపురోహితమంత్రిసామంతాదిజనంబు లుచితరీతి
గొల్వునగొలువై యుండి దుష్ప్రధానపరిబోధితప్రయోజనాభ్రప్రభంజను

డగు మనోరంజనుం బిలిచి నగరస్థితాశేషవిద్వన్మహాజనుల రావింప నియో
గింపు మనిన మే లని యతండు. 97

కం. తమపురమునఁ గల విబుధో
త్తమవరులకుఁ బ్రభువరాజ్ఞ ♦ దగఁ దెలిపి పికా
సమయంబుగఁ జను దేరఁగ
సమయం బని లోడ్కు-రాగ ♦ చారులఁ బనిచెన్. 98

కం. పనిచిన వా రతిశీఘ్రుం
బునఁ జని రా జాజ్ఞ విప్ర♦పుంగవులకు మ
న్ననవిన్నవింప విని మే
లని సత్వరమంది వార ♦ లతిముద మొదవన్. 99

సీ. పాలనిగ్గులఁ దెల్పు ♦ జాలగల్గిన భూతి
నొసటి పై తిరరేఖ♦లెసఁగఁ బూని
నవరత్నఖచితకుం♦డలములు గండభా
గముల పై గదిసిక♦ర్ణములఁ గదల
తరతరంబుగ జన్ని♦దములతో గరిపూస
పేరులు పే రెదఁ ♦ బెనఁ గొనంగ
నేర్చినగతి పింజ♦దీర్చి కట్టిన మొల
వలుద నీ ర్కా-విధో♦వతులు మెఱయఁ
తే. గీ. దగిన పన్నియశాలు లొ♦దలలఁ దాల్చి
కరతలంబుల పుస్తక♦క్రమ మెలర్ప
నమలయజ్ఞోపవీత ఫ♦లాక్షతములు
సంగ్రహింపుచు నందఱు ♦ సంతసమున. 100

మ. ఘను లా భూసురు లేగి రాజగృహమా♦ర్గద్వారపార్శ్వప్రవ
ర్తను లా చందమురాక తేనికి హిత♦వ్రాతంబు దెల్పన్ సుహృ
జ్జనులం బంచిన వారు బిల్వఁగ సభా♦స్థానం బనూనంబుగాఁ
గని త న్మధ్యము జేరి రందఱు నృపో♦త్కృష్ట ప్రహర్షో త్కలై. 101

వ. ఇ ట్లందఱు నా సభాభవనాంతరంబుఁ జేర నా రాజసింహుండు
సింహాసనంబు డిగ్గి నమస్కారపూర్వకంబుగాఁ గుశలంబు లడిగిన వార

లాశీర్వచనప్రయుక్తంబుగా సంతోషాతిశయంబులు దెలుపుచు నుచితప్రకారంబున నందఱు నాసీనులై యున్న సునాశీరునింబోలియున్న యన్నరనాయకుండు గూర్చుండి వారల కిట్లనియె. 102

కం. భూమీసురాగ్రగణ్యా
స్వాములు మీ మహిమలెన్న ♦ శక్యమె మీయందేమి విశేషసువిద్యా
సామర్థ్యమొ తెలియ నాజ్ఞ ♦ నలిపితి మిమ్ముల్. 103

వ. అనినం బ్రత్యేకంబుగా విభుని కిట్లనిరి. 104

సీ. తర్కశాస్త్రోక్తసి♦ద్ధాంతమార్గార్థవే
దండుం డననియె ను♦ద్దండశాస్త్రి
ఘనశబ్దశాస్త్రపరి♦కర్ణార్థసూత్రభా
ష్యాఢ్యుండ ననియె బ్ర♦హ్మాండశాస్త్రి
యుభయమీమాంసవా♦క్యోచితార్థనిధాన
సాధ్యుండ ననియె ప్ర♦చండశాస్త్రి
ధర్మవేదాంతత♦త్త్వప్రపూర్ణస్వాంత
దాంతుండ ననియె వి♦తండశాస్త్రి

తే. గీ. ద్యూత గజ హయ శకున సం♦గీతశాస్త్ర
లక్షణజ్ఞుండ ననియె స♦ర్వజ్ఞశాస్త్రి
గణిత మణి మంత్రశాస్త్రల♦క్షణ మనోవి
హారి నని పల్కె జగదీశ్వ♦రాఖ్యశాస్త్రి. 105

తే. గీ. బహుపురాణ పురాణప్ర♦పంచసరణు
లెఱుఁగుదు మ టంచుఁ బల్కె రా♦ర్యేంద్రు లందు
నందరారోహణావరో♦హణజటార్థ
శిక్షలను వేదసమితి భా♦షింతు మనిరి. 106

చ. అని సకలంబుఁ దెల్పు విన♦యాన్వితుఁడై పతి యిట్లుబల్కె మ
త్తనయకు కావ్యనాటకవి♦ధాన కళాభరణాద్యశేషల
క్షణము లెఱుంగఁ జేయుఁడి ర♦సజ్ఞులు మీ రొక రిందులోన నా
మనమున సంతసంబొదవ ♦ మచ్చిక లచ్చుపడంగ మెచ్చుచున్. 107

చ. అనవుడు వార లిట్లని ర◆హో జనవల్లభ యేమ నందు మి
ప్పనికి రసజ్ఞతాన్యులము ◆ భవ్యరసజ్ఞతసత్కవీంద్రజీ
వనము కవిత్వముల్ దెలియు◆వారము గాము కవిత్వబోధ తె
ట్లనుపుగ బుద్ధిజాడ్యహృద◆యాంధులు ఛాందసు లందుఁ జేరునే. 108

సీ. సకలార్థతత్వజ్ఞ◆శబ్దశాస్త్రజ్ఞుని
కన్నతండ్రిగఁ జూచి ◆ గారవించు
ఘనతరసాహిత్య◆కల్పకులైనట్టి
తార్కికులందు సో◆దరతఁ దాల్చు
పరమపుణ్యామ్నాయ◆పఠనశీలురఁ దల్ప
రాని వారనుచు దూ◆రతఁ జరించు
మహదనుష్ఠానమీ◆మాంసశాస్త్రజ్ఞుల
పుంస్త్వహీను లటంచు ◆ బుద్ధినెంచు
తే. గీ. భూరినాటకకావ్యశృం◆గారభావ
కనదలంకారశబ్దల◆క్షణము లరయు
వాని దగఁ జేరి మదిలోన ◆ వలపులూరి
తోడరివరియించు కవితావ◆ధూలలామ. 109

వ. అనిన. 110

కం. సరసాలంకారుఁడు భా
సురనాటకకావ్యనిపుణ◆శుద్ధిఁ గలుగు స
ద్గురు కవి యెవ్వరో? మీ మది
నరసి ప్రబోధింపవలయు ◆ ననవుడు వారల్. 111

కం. మలహాణుఁడను నొకకవియును
బిలహాణుఁ డను నొక్కకవియుఁ ◆ బెంపొందుదు రా
మలహాణ బిలహాణు లందున
బిలహాణు కవిరా జటంచుఁ ◆ బిరుదువహించెన్. 112

సీ. వివిధాంబరము లందు ◆ ధవళాంశుకవితాన
మఖిలర్తువుల వసం◆తాగమంబు

నెల్ల పుష్పము లందు ♦ మల్లికాకుసుమంబు
ధానుష్కచయ మందు ♦ దర్పకుండు
సారభావళు లందు ♦ సారంగనాభంబు
నస్త్రంబు లందు శ♦రాసనంబు
సుందరోక్తివిలాస ♦ మందు తర్కరసంబు
ప్రియతమంబుల వల♦పింపశ్యామ
తే. గీ. మొనయు ప్రాయము లందు జ♦వ్వనము ముక్తి
మార్గముల యందు శాంకర♦మతము మధుర
గీతముల యందు పంచమ♦గీతి రీతి
కవుల యందును బిల్హణ♦కవి ఘనుండు. **113**

**వ.** అనిన రా జిట్లనియె. **114**

**ఉ.** ఎన్నఁడు జూడలేదు విభు♦ధేశ్వరుఁ డెచ్చటనుండుఁ గాపురం
బున్న పురోత్తమం బెచట♦నుండు నతం డిటువచ్చునే సదా
భ్యున్నతిఁ జెంది యేమనునొ ♦ యుక్తము దెల్పుఁ డటన్న విశ్వవి
ద్వన్నుతమూర్తి బిల్హణుని♦వార్త లశేషజనార్హమూలముల్. **115**

సీ. చిత్తగింపుము దేవ ♦ సింధుజవిద్యావ
తీపురం బతనికి ♦ కాపురంబు
లక్షణనాటకా♦లంకారకావ్యశా
స్త్రాగమోభయకవి♦త్వాతి చతుర
శృంగారవిద్యావి♦శేష శేషాహి బి
ల్హణవరభుక్కుండుఁ ♦ డనెడి పేరు
లలరెడివాఁడు మే ♦ లలరుప్రాయమువాఁడు
తగుగుణంబుల మెచ్చుఁ ♦ దగినవాఁడు
తే. గీ. పరమపావనుఁ డఖిలప్ర♦పంచసార
మరసి తావకపురము వి♦ద్యాదిదైవ
తావిహారస్థలం బని ♦ తలఁచి తన కు
టుంబసహితంబుగా నివా♦సంబుఁ జేసె. **116**

తే. గీ. అఖిలవిద్యార్థులకు రహ♦స్యార్థబోధ
జేయు నుచితంబుగా నయా♦చితపదార్థ
మనుభవింపుచు నెవ్వని ♦ నాశ్రయింపఁ
డతఁడు సర్వస్వతంత్రుఁ డు♦ద్యద్గుణాఢ్య. 117

కం. కావున మీ రిప్పుడు వి
ద్యావిభవానందసాంద్రు ♦ లగుటఁ దెలియ మే
ధావు లగు వారిఁ బంపిన
దేవ భవద్దర్శనేచ్ఛ ♦ దీరఁగ వచ్చున్. 118

చ. అన విని మంత్రిశేఖరుల ♦ నంపిన వా రతివేగనేగి వా
గ్వినయమెలర్ప భూరిగుణ♦విశ్రుతుఁ డా మదనాభిరామ రా
ఢ్ఘనుఁడు భవత్ప్రసంగరస♦కల్పనముల్ వినఁ గోరి యుష్మదా
త్మనిభృతభావ మారసి ము♦దంబునఁ దోడ్కొనివచ్చువారిగన్. 119

తే. గీ. వేగర మ్మని బనిచె మా ♦ విన్నపంబు
చిత్తగింపుచు తమరు వి♦చ్చేయవలయు
ననుచుఁ బల్కిన బిల్హణుఁ ♦ డధిపమౌళి
దర్శనార్హవిలక్ష ణా♦దరము మెఱయ. 120

తే. గీ. రాజభవనంబుఁ గాంచి నీ♦రాజనముల
రాజిలుచు నున్న తత్సభా♦రాజమునను
రాజసౌందర్యమదనాభి♦రామరాజ
రాజ సన్నిధి సత్కవి♦రాజు చేరి. 121

వ. ఉన్న యన్నరనాయకుం డనర్ఘ్యరత్నోన్నతపీఠంబున నధివసింపం
జేసి యుచితాభివందనంబుల నమందానందంబు సంధింపం జేసిన సునాశీరునిం
జేరు వాచస్పతి-చందంబున న మ్మహీసురవరుండు. 122

తే. గీ. సామువెన్నెల గుత్తిపూ ♦ సజ్జదాల్ప
వేల్పు టిల్లాలి పైదోడు ♦ విడిదిగన్న
మిన్నపావడగల కన్నె♦మిన్న గన్న
కన్నెదొరసామి సిరి మిమ్ముఁ ♦ గాచుఁ గాత. 123

కం. ఘనసారసారబాంధవ
33ధనరాజహితాత్మభూజితప్రౌఢిమ లో
జనవర భవపదఘనమం
డనరూపయశఃప్రతాప ధర్మ స్ఫురణల్. 124

తే. గీ. బహువిచిత్రంబు రాజేంద్ర భవ దుదార
చక్రదర్శన విమతరాట్చక్ర మవని
చక్ర మను నామ మిలకు నిర్వక్రముగ నొ
సంగి విక్రమమదవృత్తి సలిపెనెందు. 125

గీర్వాణభాషాకందము—

మదనాభిరామనిరతా
ర్ద్రదయా దృగ్భిస్సదాదదాత్వైశ్వర్యా
స్పదపుత్రపౌత్రరాజ్యా
భ్యుదయాదీంతేరమాహ్యదోకస్సహరిః. 126

వ. అని యాశీర్వచనయుక్తంబుగాఁ బ్రశంసించిన సంతసించి వినయ సంపన్నుండు గావున నా నృపాలాగ్రేసరుండు పండితాఖండలున కి ట్లనియె. 127

మ. కవిరాజోత్తమ మిమ్ముఁ గన్గొనుట యోగ్యం బయ్యె సౌభాగ్యదా
యివి పూజ్యంబది మీరె మీ రనఁగ వాగీశావతారంబు మ
ద్భవనోత్పన్నతసార్థమయ్యెను కృపాపారీణ సౌఖ్యావహో
త్సవము ల్గల్గుఁ గదా గదాధరుని సాక్షాత్కారకార్య స్థితిన్. 128

మ. కలదే మీ కిచటన్ సుఖంబు మహిభృద్గంధేభసౌఖ్యంబు సం
ధిలు యుష్మత్పరిపాలనక్రమముచే ధీవర్య మత్పట్టణ
స్థలసంస్థానతనొంది దర్శనవిశేషావాప్తియుక్తం బె ని
34త్యలసత్తావకధర్మసంభరితవిద్యాగోష్ఠిచే నుండెదన్. 129

కం. ధరణీధరేంద్ర భవదా
చరణీయము లఖిలవర్ణ సద్ధర్మము లెం

పా. 33 ధనరాజహితాత్మభూసదార్వా పరిదమా.
పా. 34. త్యలసత్తావకకీర్తివద్యఖిలవిద్యాగోష్ఠిచే నుండెదన్.

దరయ నటుగాక భూసుర
పరిరక్షణనిలిచెఁ గాదె ♦ భవదసిధారన్. 130

వ. అనిన వినయోచితవ్యాపారపరాయత్తచిత్తంబుల నుత్తరప్రత్యుత్తరోత్తరంబుగా సంభాషింపుచుఁ జతురానన వంశభూషణునిం జూచి రాజకులభూషణుం డి ట్లనియె. 130

తే గీ. భూసురోత్తమ యామినీ♦పూర్ణతిలక
యనెడు మత్కన్యకామణి ♦ దనరు కావ్య
నాటకాలంకరణముల ♦ నూటి దెల్పి
సత్కళానిధి యగు నట్లు ♦ సలుపుఁ డనిన. 132

కం. బిల్హణకవీంద్రుఁ డనె రా
ట్కల్హారప్రియసుధాని♦కరములు నీ భా
షల్హర్షమొదవఁ జేసెను
బల్హితముగ నీ కభీష్ట♦ఫల మొనగూర్తున్. 133

వ. అని ప్రియపూర్వకంబుగాఁ బల్కిన తదనంతరంబున. 134

చ. సకలధనాఢ్యుఁ డిచ్చె కవి♦చంద్రునకున్ మణినూపురాంశుకో
ర్మికధనమేఖలాంగదకి♦రీటపటీరకతారహారచం
ద్రికకటకాంకకుండలర♦థద్విరదాశ్వభటాగ్రహారమౌ
క్తికశిబికాతపత్రముఖ♦దివ్యల సద్బహుమాన దానమున్. 135

వ. ఇట్టి సన్మానంబున బిల్హణుని నిజనివాసంబునకుం బనిచి యున్నవారల నందరి న్వీడుకొల్పి మనోరంజనుండునుం దానును నిజసౌధాంతరంబుఁ జేరి చోరవిబుధేంద్రునింగూర్చి ప్రసంగంబునందు నేకాంతంబుగా మహీకాంతుం డి ట్లనియె. 136

చ. గొనఁబగు రూపసంపదల♦కు న్వలరా జనవచ్చు సాహితీ
ఘనత చమత్కృతు ల్దలఁపఁ♦గా గురుఁ డీతఁ డనంగవచ్చు నీ
తనిగని జవ్వనుల్ నెనరు♦దాల్చెడినాథుల కూటమొల్లమం
చని పలవింతు రీ తనయ ♦ కాతఁ డెటుల్గను విద్యనేర్పుటల్. 137

కం. సుందరయువజనకల్పక
మందలి తారుణ్యపుష్ప ♦ మంజరి మహిళా
నందాంతఃకరణోజ్జ్వల
దిందిందిరతతిని బిలుచు ♦ నిటు ర మ్మనుచున్. 138

చ. ధర నటుగావునం బహువి ♦ ధంబుల కన్నియయొద్దఁ జేరి వా
క్యరసమెలర్ప బ్రాహ్మణుఁడు ♦ సత్కళలభ్యసనంబొనర్చు చె
ట్లరయఁగ నన్యు లెవ్వరిటు ♦ లన్నిట నెన్నికగన్నవార లీ
వరధరణీసురుండె గురు ♦ వౌటదగు న్మఱి మీఁదనెట్లకో. 139

మ. అని సందేహమునొంది దీనికి నుపా ♦ యంబాత్మనూహింపు మం
చనిన న్మంత్రివరుండు బల్కె సుగుణా ♦ ధ్యక్షుల్ గదా మీ రెఱుం
గని దే మున్నది యైన నా మదికి యు ♦ క్తం బైన కార్యోక్తి దోఁ
చెను వీరిద్దరికిన్ వ్రతద్వితయ మ ♦ క్షీణస్థితిన్ గల్గుటన్. 140

తే. గీ. దేవ సర్వంబుమదిలోన ♦ దెలసెగాదె
కన్యకారత్న మంధులఁ ♦ గన దటంచు
ప్రతినజేసెను బ్రాహ్మణ ♦ ప్రవరుఁ డెప్పుడుఁ
జేరి చూడఁడు కుష్ఠశ ♦ రీరపరుల. 141

కం. ఇది నే మును వినియుందును
మదిరాక్షికి కుష్ఠ టంచు ♦ మఱి బ్రాహ్మణుతో
విదితముగఁ దెల్పి బ్రాహ్మణు
డుదయాంధుఁ డ టంచుఁ దెల్ప ♦ నొప్పగుసతికిన్. 142

కం. ఇటు లేకాంతక్రియలను
మటుమాయలు పన్ని వారి ♦ మధ్యను తెర సం
ఘటనంబుఁ జేయ రక్షిత
పటసన్నిధిఁ జేరి చదువు ♦ బాల నృపాలా. 143

తే. గీ. అనిన యుక్త మటంచును ♦ హర్షమొదవ
నట్లు గావింపుమనిన మే ♦ లనియె మంత్రి

రాజమతమున మదనసాం♦మ్రాజ్యలక్ష్మి
గరిమకలకంఠి సిత్రతంతి♦కమున నిలచె. 144

చ. నిలచినఁజూచి సంతసిలి ♦ నెమ్మికవుంగిటఁ జేర్చి తళ్కుఁజె
క్కుల శిరిముద్దుఁగొంచు వగఁ♦గూర్చుచు నుందొడమీఁదనుంచి కుం
తలములుదువ్వుచుఁ శిరము ♦ తద్దయుమూర్కొని బుజ్జగింపుచుఁ
బలికె నృపాలశేఖరుఁడు ♦ బల్కుల చక్కెరపల్కులొల్కఁగన్. 145

కం. జాత్యంధుండు బుధోత్తముఁ
డత్యంతఘనుండు బిల్హ♦ణాఖ్యుఁడు మత్పౌ
సిత్యుం డాతని కృపచే
నిత్యోన్నతిఁ జెందుకళల ♦ నీతికుమారీ. 146

తే. గీ. సకలశృంగారవిద్యావి♦శారదుండు
గాన సంగీతసాహిత్య ♦ గౌరవంబు
సుమగుళుచ్ఛంబునకు గంధ ♦ మమరినట్లు
మొనయుగద నీకుఁ దగులీల ♦ ముద్దుబాల. 147

తే. గీ. అనఁగ నంధునిఁజూడ నా ♦ కదివ్రతంబు
గాదె యిటు లానతిచ్చుట ♦ కార్యమగునె
యన్న యన, నీదు వ్రతమేల ♦ బన్నమగును
తెలివ యిరువురసందున ♦ తెరయొనర్తు. 148

చ. అని తనయన్ మృదూక్తులపి♦తాదరవృత్తిమెలంగఁజేసి వా
గ్వినయమెలర్ప బిల్హణుని ♦ వేమఱుబూజల నొందఁజేసి మ
త్తనయకుఁ గుప్తరుగ్భరము ♦ దార్కొనె నించుక మిమ్ముగొల్వ సా
ధన మగునో భవద్ధితగ♦తక్రమమో వివరింపుఁ డొప్పుగన్. 149

వ. అని పల్కిన. 150

‡ కం. విని బిల్హణుఁ డిట్లనె నేఁ
గనుఁగొన కుష్ఠులను కన్య♦కామణికిని మా
కును మధ్య తెరయొనర్చిన
ననువగు నన జనవరేణ్యు ♦ డతిముదమొదవన్. 151

తే. గీ. 35సాధువాక్యప్రసంగంబు ♦ సలుపునపుడు
ఘనకవీంద్రుండు భూజాని ♦ వినఁగ నిట్లు
పలికె నిర్బంధవృత్తిమై ♦ బలిమికోనిన
నీమహితమున విద్యలు ♦ నీ దుహితకు. 152

వ. సానుపూర్వలక్షణలక్ష్యప్రబోధితంబుగా బోధింపుచు సకలకళావతీరత్నంబుగాఁ జేసెద నని విన్నవించిన కవిరాజశేఖరుని ననిచినప్రియంబున ననిచి నిజామాత్యసహితుండై భక్తితాత్పర్యంబున నొక్క నిమిత్తకోవిదునిం రావించి శుభావర్తంబైన ముహూర్తంబు నొక్కశుభవాసరంబున నిశ్చయించి భూవల్లభుండు పురంబును నిజభవనంబును నలంకరింప నియోగించిన పూర్వోదితంబైన కేళీమందిరంబునందు. 153

కం. పన్నీట మెదిచికస్తురి
గ్రన్నన నునుపూఁతఁబూసి ♦ కప్రపుముగ్గుల్
సన్నవిడి దీర్చి చిత్తరు
లన్నియు నున్గొత్తజేసి ♦ రయ్యె డలన్. 154

తే. గీ. పరము పరమైన చలువచ♦ప్పరము లర్హా
కేతనంబులు బహుచిత్ర♦కేతనములు
తోరణంబులఁ దగు పచ్చ♦తోరణములు
కటకమునఁ గల్గి శృంగార♦కటక మయ్యె. 155

పంచచామరము—

పురంబు నాల్గువీధులందు ♦ పొందుగారచించి కా
పురంబుసేయు వార లెల్ల ♦ భూషితాంగు లైన య
బ్బురంబుగా గృహంబు లెల్ల ♦ పూజితంబు లై మరు
త్పురంబు గేలిసేయు చుండు ♦ భూరివై భవంబులన్. 156

వ. ఇట్లు సకలమహోత్సవంబులుగాఁ గల్పించియుండు నంత. 157

సీ. మంత్రిసామంతక్ష్మా♦నాథబుధకవి
36హితపురోహితతతి ♦ హేళితంబు

పా. 35. సాధువాక్యప్రసంగ మిా ♦ సరణియైన
పా. 36 హితపురోహిత మనో♦భీప్సితంబు

గంధసింధురతురం♦గ స్యందనస్తోమ
సుభటవేత్రధరాళి ♦ శోభితంబు
గీతాభినయశబ్ద♦కృతతాళనై పుణీ
వారాంగనానృత్య ♦ వైభవంబు
భేరీమృదంగ గం♦భీరకాహళవేణు
వీణాదితూర్య ని♦క్వాణనంబు
తే. గీ. జనపరంపరసంతోష ♦ శాశ్వితంబు
బిల్హణకవీంద్రసన్మనః ♦ ప్రియకరంబు
మంగళప్రదలాంఛన ♦ సంగతంబు
వాసిగనె సత్కళాభ్యాస ♦ వాసరంబు. 158

వ. అట్టి సమయంబున. 159

చ. సరగున రాజపుత్రికకు ♦ సంపఁగినూనెఁ దలంటి దానిపై
దొరగెడి గంధపుంబసపు♦తోడ నలుంగిడి గంధతోయముల్
వరుసనుజిల్కి మై దుడిచి ♦ వాటముగాఁగలపం బలంది బా
37గరుపనిరంగు జెందొగవ♦గల్గల కావిపటంబు గట్టి బి
గ్గరసవరించి మేలవిక ♦ కంగులుదీరదొడింగి పొంగుచున్. 160

చ. కురులటుదువ్వి చిక్కుడలఁ ♦ గూరిచి పాపటదిద్ది వేణికా
భరమున పుష్పమాలికలు ♦ బన్ని మెఱుంగిడి రత్నభూషణ
స్ఫురణ మొనర్చి కన్గొనల ♦ సూటిగకాటుకఁ దీర్చి గోవక
స్తురితిలకంబు నెన్నొసట ♦ సొంపుదలిర్పఁగ నేర్పరించియున్. 161

తే. గీ. గురువరునిఁ జేరి సరసముల్ ♦ గులుకరింప
సత్కళాకేళికలగోష్ఠి ♦ సలుపు మనుచు
పరిమళంబులు పైఁ జల్లి ♦ ప్రాణసఖులు
దోడికొనివచ్చి రబలను ♦ మేడకడకు. 162

వ. ఇట్లు జగన్మోహనాకారంబుగా శృంగారించి తోడ్కొనివచ్చి తజ్జననీజనకులకు వందనంబుఁ జేయించిన వారలానందసాగరాంతర్నిమగ్ను

పా. 37 గరుపనివల్వ కావి జిగి♦కంచుకము న్ధరియించి మించుచున్

లగుచు మనః ప్రియాభిప్రాయంబుగా దీవింపుచు మఱియు రాజేంద్రుఁడు కవీంద్రునితో ని ట్లనియె. 163

తే. గీ. జ్యోతిషప్రవరేంద్ర కవిరాజ ♦ సార్వభౌమ
సకలశుభకరసుముహూర్త ♦ సమయ మనిన
నిదియె శుభమ స్తటంచు వి♦ఘ్నేశ్వరునకు
పూజఁ గావించె నల రాజ♦పుత్త్రిచేత. 164

విషమ సీసం—

సింధురాణ్ణిషంగపుత్త్ర ♦ సిద్ధివిఘ్నరాణ్మహా
సింధురాధినాథవక్త్ర ♦ చిద్విలాసభక్తహృ
38ద్బంధబంధురప్రబంధ ♦ బంధుబంధురాత్మసం
బంధతత్త్వధీసముద్ర ♦ భద్రముద్రసార్ద్రహృ

తే. ద్బంధుజీవాధరోష్ఠబిం♦బప్రదేశ
భాసమానాసమానవి♦లాసమంద
హాసనూత్నాంకురైకదం♦తాగ్రతుంది
భోగవిగ్రహసంతతా♦నుగ్రహాత్మ. 165

కం. కాండాటాధిపకేతన
కాండాత్మజ కంధరాగ్ర♦కరదారక వే
దండానన కాండావన
కాండాహ్వయ శరణు భక్త♦కాండవిహారా. 166

వ. అని యనేకప్రకారంబుల విద్యాభ్యాససమయనిర్విఘ్నానుకూల భావంబుగా విఘ్నేశ్వరునిం బ్రణుతించి వాగ్దేవిం బ్రశంసించి. 167

తే. గీ. డంబుమీఱిన హొన్నప♦టంబువాని
పెద్దకోడల వలరాజు ♦ ముద్దువదినె
వేలుపులపెద్ద ముద్దుటి♦ల్లాల నోట
మెలఁగు పూఁబోఁడి నీదయఁ ♦ దెలుపఁ గదవె. 168

పా. 38 ద్బంధగంధసింధురప్ర♦బంధబంధురాత్మసం

కం. తల్లీ యశేషభువనము
తల్లీ బవరంపుతపసి తల్లీ దయచే
తల్లిబిడ్డల కలరెటి
తల్లీలాలోకనములఁ దనియింపఁ గదే. 169

కం. హరినీలవేణి సంప
త్కరవరదృగ్వాణి పరమకల్యాణి కలా
భరణశ్రేణి నిరంతర
కరుణామృతవాణి బ్రోవఁ గదె విధిరాణీ. 170

‡ చ. శరశరజాతజాతజతుపారతుపారశతారతార భూ
ధరధరరాజరాజగజదారకదారకచంద్రచంద్ర భృ
త్కరకరసాబ్జసాబ్జపదకల్పకకల్పమృణాళనాళ ని
ర్భరభరితాభిశోభితసభారతిభారతిసాక్షరాకృతీ. 171

వ. అని యిట్లు వాగ్వధూస్తోత్రంబు గావించి పుష్పాంజలి సమర్పించి తత్ప్రసాదంబుగైకొని నిర్మలాంతఃకరణంబున బ్రాహ్మణగురువరుపాదారవిందంబు లర్చించియున్న యతం డక్కన్యకారత్నంబునకు శుశ్రీతిప్రియంబై యాది కావ్యంబై రఘూద్వహమహిమోద్యద్దర్పణం బగు శ్రీమద్రామాయణం బుప దేశంబు గావించె నయ్యవసరంబున. 172

కం. ఇష్టులు భృత్యులు గురుజన
శిష్టులు బ్రియమందరాజశేఖరుఁ డతిసం
తుష్టిగ దయఁ జేసెను పర
మేష్టికులోద్భవుల కపుడు మేటిధనంబుల్. 173

చ. అవనిపుఁ డెల్లవారలఁ బ్రియంబుననంపి తనూజబ్రాహ్మణ
ప్రవరుల కచ్చటన్ విమలభాజనభోజనగంధమాల్యత
ల్పవసనభూషణాది సకలానుభవోచిత సత్పదార్థముల్
దవిలియొనర్ప నూడిగపుదాదుల నుంచి విభుండు వేడుకన్. 174

తే. గీ. అంతిపురమున కేగి నెయ్యంబుదనరి
మఱి యొకానొకవేళ నెమ్మనముమిగుల

సంతసము మీఱ చెలి కళా♦సదనమునకు
రాకపోకల ప్రియమందు ♦ రాజమౌళి. 175

తే. గీ. కావ్యనాటకసరసశృం♦గారమదన
శాస్త్ర లక్షణమర్మముల్ ♦ సాంగముగను
జెప్పి కన్నెను ప్రౌఢగాఁ ♦ జేసె నతఁడు
నృపశిరోమణి మిగులమ♦న్నింపు చుండ. 176

చ. వెలయఁగ నంత బిల్హణక♦విప్రభుఁ డర్వ్యకళల్ వచింపఁగా
నెలమిని రాజకన్యక గ్ర♦హించె ధృతాయతబుద్ధి గల్గి ని
ర్మలసలిలప్రపూరములు ♦ మాటిన త ప్తకలోహమట్ల వి
ద్యలు దగనేర్చె చిత్రతర ♦ మయ్యె జనావళి కెల్ల నెల్లెడన్. 177

స్రగ్ధర.

నానాలంకారసీమా ♦ నవరసభరితా ♦ నాటకానీకధామా
గానాంభోధిప్రపూర్ణో♦ద్గతహిమశుకళా ♦ కామశాస్త్రప్రవీణా
భూనాథానందరూపా♦ధ్భుత యువజనదృ♦క్పూర్ణకా మార్థసద్వి
ద్యానిక్షేపం బనంగన్♦త్యజితజడతయై ♦ ధాత్రి రాట్కన్యయొప్పెన్. 178

కం. ఇటు లని సకలజనంబులు
పటుగతి నుతియింప మిగుల ♦ పౌఢాంగనయై
కుటిలాలక సుమబాణుని
భటునిగఁ జేకొనఁగఁ జాలి ♦ ప్రబలుచునుండెన్. 179

శా. అంభోజా ప్తతనూజ పూజ్యతరరా♦జ్యస్థాపనాచార్య స
ప్తాంభోరాశివిభూషితావనివధూ♦హస్తాగ్రసంగ్ర స్తదో
స్తంభోద్ధూత విధాతృసూత ఘనకో♦దండప్రభామండలా
ద్గంభీరాదిగుణప్రధాన జనక♦ఝ్మాభ ర్తృజామాతృకా. 180

కం. దిఙ్నాగశ్రుతిభీభ
త్సజ్నిభృత ధనుర్గుణోద్గ♦తారావహ వి
ర్భుజ్నారిస్తోత్రిక్రుదస
దృజ్నామమహాత్మ లోక♦దృగ్వంశనిధీ. 181

—♦ వనమయూరవృత్తము ♦—

శ్రీఘనఘనాపఘన ♦ చిన్మయమహాత్మా
మోఘశరదావనత ♦ మోఘనమరుద్భ
క్త్యోఘసురభూజమిహ ♦ కోస్త్ర సుయశఃశ్రీ
రాఘవమహోన్నతత ♦ రాఘవనశుక్రా. 182

—♦ గద్యము ♦—

ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్షవీక్షణసంలబ్ధసకలసంపూర్ణసరసశృంగార
రసధారాధారమాధురీధురీణాలంకారితాంధ్రగీర్వాణ కవితావిలాస విచి
త్రవిలసితాపస్తంబసూత్రభారద్వాజ స గోత్రపవిత్ర చళ్ళపిళ్ళ
సుధార్ణవరాకానిశాకరయశోధురంధరధరామరప్రవర్య రామ
యనామార్యపౌత్రకామకవిసుపుత్ర సకలవిద్వజ్జనవిధేయ
నరసయనామధేయప్రణీతంబైన యామినీపూర్ణతిలకా
విలాసంబనుశృంగారమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.





# యామినీపూర్ణతిలకావిలాసము

## తృతీయాశ్వాసము



కం. శ్రీజగదానందసుధాం
భోజాలకపూర్ణచంద్ర ♦ పుణ్యావనధా
త్రీజాంతరంగగృహాసం
పూజిత రామాభిధాన ♦ భువననిధానా.

వ. దేవా యవధరింపు మనంతరంబ. 2

సీ. కాసారతరవీచి♦కాసారభరమల్లి
కాసారపరిఫుల్ల♦కేసరంబు
వాసంతికామధు♦గ్రాసాంతమధులిడ్వి
లాసాంతమధుముఖ్య♦వాసరంబు
హాసానులాపవి♦న్యాసాభిరూపప్రి
యాసౌఖ్యసంపద్వి♦భాసురంబు
స్వాసాదపరభృద్వి♦కాసాస్పదోజ్జ్వల
త్ప్రిసాదనవలతా♦గ్రేసరంబు

తే. గీ. వాసితప్రసవపరాగ♦ధూసరంబు
వాసవప్రియసవనకృ♦ద్భాసురంబు
భాసమానాసమానాబ్జ♦నీసరంబు
డాఁసె వాసిగ మధుమాస ♦ వాసరంబు, 3

కం. సకలద్విజఫలదం బై
మకరాంకసహాయభూత♦మహిమాన్వితమై
ప్రకటావనీజసమ్మో
హకమై భూమండలంబు ♦ నామని యొప్పెన్. 4

తే. గీ. జడతఁ దాల్చి ప్రభంజనుం ♦ డడరి భువన
జాతులమథింప దాక్షిణ్య♦సరణి విడిచి
వ్యయముగడచి కుజాతిక్ష♦యప్రధాన
మేషగతుఁ డయ్యె మిత్రుఁడ♦మిత్రుఁ డగుచు. 5

చ. ప్రమదమరుత్కిశోరపరి♦పర్యపహృచ్చిరవస్త్రపత్త్రియై
క్షమఁగొని వేఁడినం ద్రుపద♦కన్నియ కన్నియు మాధవుం డిడెన్
బ్రమదమరుత్కిశోరపరి♦పర్యపహృచ్చిరవస్త్రపత్త్రియై
క్షమఁగొని వేఁడినం ద్రుపద♦కన్నియ కన్నియు మాధవుం డిడెన్. 6

మ. నవభావంబులఁ జూపు బాలలతకూ♦నల్ మేలుపున్నాగముల్
ధవులై పుష్పకదంబ లీలలెలమిన్ ♦ దారొందు నవ్వేళలన్
నవభావంబులఁ జూపు బాలలతకూ♦నల్ మేలుపున్నాగముల్
ధవులై పుష్పకదంబ లీలలెలమిన్ ♦ దారొందుటల్ వింతలే. 7

కం. ఘనమరుదావళిఁ దరచిన
వనరాశినిబోడమె సరస♦వైఖరి నవమో
హనుఁడై మాధవుఁడాదర
మునఁ గనఁగాహారము హరి♦ముఖఖగతతికిన్. 8

తే. గీ. సకలఫలమూల కారణా♦స్పదముతోడ
ఘనతరులఁ బెంపు వదలని ♦ కలిమితోడ
లలితశృంగారయౌవన♦లక్ష్మితోడ
నలరె మాధవుఁ డఖిలాగ ♦ మాంతములను. 9

సీ. అభినవోదయవసం♦తార్భకస్ఫుటనాభి
దళనకారణలవి♦త్రంబు లనఁగ

పథికచిత్తక్షతో♦ద్భవశోణితార్ద్రి పు
ష్పాంబకబడిశజా♦లంబు లనఁగ
శిశిరర్తుమృగతను♦చ్ఛేదమధ్యాగమ
సమయ శార్దూల న♦ఖము లనంగ
మదనగంధర్వస♦ద్వదనకృద్వివిధా
యక తన్ముఖాద్యల♦క్ష్యంబు లనఁగ

తే. గీ. సమయవిటనాథరచిత భా♦స్వరతరోప
వనవధూ నూత్న నఖరేఖ ♦ లనఁగ నరుణ
కిరణ తరుణపలాశవి♦స్ఫురణ నవప
లాశపేశల కోశజా♦లకము లలరె. 10

కం. మారునకుఁ జైత్రసాధన
కారుఁడు దననేర్పు మెఱయఁ♦గా నల్లెడఁజె
న్నారఁగ నారాచంబుల
నారి డె నన వనులఁ గ్రొన్న♦నలు నిండారెన్. 11

తే. గీ. అఖిలభూజనులకు సుమ♦నోభిసంప
దలు ఘటింపుచు బహువర్ణ♦దాయి యైన
మాధవుని చైత్రకుం డన ♦ సాధు వయ్యె
వివిధజాతుల కిది యెంతొ ♦ వింతగాను. 12

సీ. పున్నాగములు సన్మ♦రున్నాగముల పోల్కెఁ
జెన్నార హారిసేర ♦ మిన్నకున్నె
మందారములు కీర♦వందారులకు నిష్ట
బృందారకావాప్తి ♦ జెందకున్నె
రూపాతిశయకోర♦కాపాద హేమశ
లాపంబు లవివన్నెఁ ♦ జూపకున్నె
కుందంబు లభినవా♦స్పందంబులుగఁ దేటి
బృందంబులకు తావిఁ ♦ జిందకున్నె

తే. గీ. పచ్చగన్నెరు లొకకొ్రొత్త ♦ మెచ్చకున్నె
పాటలావళి ననశిరుల్ ♦ చాటకున్నె
పొగడసంపద లొకవింత ♦ నిగుడకున్నె
వివిధవనుల వసంతర్తు ♦ వేళలందు. 13

కం. శీవిదలిర్పంగఁ జల్లని
తావులు వెదజల్లు విరుల ♦ తావులకు నళుల్
గావలిదిరుగఁగ మారుని
మావుల కిరవగుచు గుజ్జు♦మావులు దనరెన్. 14

తే. గీ. మహిమదళుకొత్త క్రొత్తశా♦ల్మలులనిట్ట
లెల్ల నెల్లెడలందు ని ♦ ల్వ్వఁ బూచె
విరహిజనుల గెల్వవచ్చు పూ♦వింటిజోదు
రంగుచెంగావి పటకుటీ♦రంబు లనఁగ. 15

తే. గీ. తళతళలమీఱు చిగురుటా♦కుల దళంబు
గలిగి దట్టపుఁబూఁతచే ♦ నలరు లేఁత
పసఁ బొసంగెడు మధురస♦ఫలరసాల
సాలములు మీఱె మదనాస్త్ర♦శాల లనఁగ. 16

కం. బంగారుతరువు లలరు మె
ఱుంగారఁగ నలరెఁ దెరువ♦రులపై కేగన్
సింగారించిన మారుని
బంగారపుఁదేరు లనఁగ ♦ బహుచిత్రములన్. 1[illegible]

ఉ. కాముకవైరి హేమమయ♦కాహళనాదవినోదలీల న
య్యామినిఁ గాననయ్యె మృదు♦లాయతబాలరసాలసాల శా
ఖామలపల్లవాగ్రలవ♦ఖాదనదర్ప వనప్రియాళికా
కోమలకంఠనాద మవి♦కుంఠిత పాంథహృదంతరాళమై. 1[illegible]

ఉ. కాననుఁ జేరి సత్ఫలవి♦ఘాత మొనర్చుచు పాంథభీతి ద
ధ్వానమొనర్చుచున్ మధుని♦ధానముఁగాంచి కుజాతిసంగతుల్
పూని మలీమసాకృతులఁ ♦ బొంగుట మాధవుఁ డెంచి కాలవి
జ్ఞానము కల్గినంతనె వి♦జాతికి పంచమరీతిఁ గూర్పఁడే. 19

చ. నెలవుగఁ బల్కుఁదేనియలు ♦ నింపుచుఁ జల్లనితావిపూలదం
డల బహుచిత్రపత్త్రిరచ♦నల్ పచరింపుచు మోహనైకలీ
లల నవకన్యకావనవి♦లాసినిఁగూడి వసంతనాయకుం
డలరె దదీయవైభవము ♦ లద్భుత మయ్యె జగత్త్రియంబునన్. 20

సీ. పాణీరభూభృద్వ♦నాటీమరుద్వధూ
        పేటీసుగంధంబు♦లాటి లాటి
    లాటీవరాటీమ♦రాటీకుచాలిస్త
        పాటీరవాసనల్ ♦మీటి మీటి
    మీటీకృతోద్వీరు♦ద్వాటీదళత్పుష్ప
        కోటీపరాగముల్ ♦జూటి జూటి
    జూటీభవత్కురు♦టోకటీసమాశ్లిష్ట
        ధాటీవిహారంబు♦చాటిచాటి
తే. గీ. చాటివలినీటికాసార♦వాటి తేలి
        తేలికలులీల మరుకేళిఁ ♦ దేలు బాల
        బాలికలు హాళిఁ దెలుప వా♦హ్యాళి కదలి
        కదలి చనుదెంచు దక్షిణ♦గంధవహుఁడు. 21

—♦ లయగ్రాహి ♦—

సారెకును మేలికర♦వీరములదూలి సహ
        కారములవ్రాలి మధు♦సారములు గల పు
వ్వారములుగ్రోలి తమి♦దేరుగడబాలివిడ
        బారి గమిదేలి గొన♦బారి వనితావుల్
జూరగొను గాలితెర ♦ వేరి గడుసోలి వల
        పూరు జవరాలికల ♦ బేరజపుపాటల్
గూరిచి విరాళిమది ♦ గూరిచిరిజాలివిర
        జారగను జాలిమురి♦మీఱు బరిదేటుల్. 22
తే. గీ. చిత్రచిత్రింబుగను చైత్రి♦చైత్రిలక్ష్మి
        లక్ష్మివెలయించె నిటు సర్వ♦లక్షణముల

మఱియు మఱియును మాధవ ♦ మాధవై క
వై ఖరిఁదలంపనొకవన్నె ♦ వరలకున్నె. 23

సీ. మధురతర చ్ఛాయాప్తి ♦ మీఱియుండుటె కాని
మృదుతరచ్ఛాయాప్తి ♦ మీఱ దయ్యె
భువనబంధుప్రీతిఁ ♦ బూనియుండుటె కాని
భువనబంధుప్రీతిఁ ♦ బూన దయ్యె
మిథునసంగతిఁ గల్గి ♦ మించియుండుటె కాని
మిథునసంగతిఁ గల్గి ♦ మించ దయ్యె
సుమనోవికాసంబుఁ ♦ జూపనోపుటె కాని
సుమనోవికాసంబుఁ ♦ జూప దయ్యె

తే. గీ. నెయ్యడలనంచు జనులెంచు ♦ టిరవుగాంచు
సొమ్మసిల మించుటుడుకులు ♦ గ్రుమ్మరించు
బడలికలునించు భోగుల ♦ పసలడంచు
నెండలలరించు వేసవి ♦ దండఁగాంచు. 24

తే. గీ. కోకములపండు బలితంపు ♦ గుబురుతండు
ఘూకముల కగ్గిగుండు భో♦గులకుదండు
తెరువరులగండు దగఁజేరు ♦ దీముదిండు
మహిని వేసవి రవపిండు ♦ మలయుచుండు. 25

మ. పవమానోత్థితభూపరాగపటల♦ప్రక్రాంతమార్గావరో
ధవిధిన్ రథ్యములాగిన స్గని తదం♦తప్రక్రియామాధుర్యుఁడై
రవిసీరంబులుసత్కళావళులఁ జే♦ర్పఁగాదె కాసారవా
ర్ధివహం బారయ నంత కంతదరిగె ♦ న్నిక్కంబుగా నయ్యెడన్. 27

కం. సరసులగతి మెఱయుచు సు
స్థిరసన్మార్గద్విజౌఘ♦తృష్ణాస్పదవై
ఖరుల నిరర్థకజనన మ
మరి దుష్ప్రభువులుగ నెండ♦మావులు ప్రబలెన్. 28

తే. గీ. శాల్మలీఫలగర్భసం♦జనితతూల
జాలమువిరళవాతూల♦పాళి నెగసి

కవిసె మిను రవిరథతుర♦గముల నెమర
చొంగ నురుగు లనంగఁ గా♦నంగ నగుచు. 29

కం. పొందుగ ముచ్వేల్పులు దన
యందునవసియించు టెటేఁగి ♦ యాగములరవి
న్విందులకుఁ బిలువ బయనపు
సందడిసాగమి ననంగ ♦ జాగిలెదివముల్. 30

మ. చటులావర్తమరుత్కృతోత్కటరజ♦శ్చక్రాంతజీర్ణచ్ఛద
చ్ఛట లాకాశపదంబునం బొలిచె ప♦ర్జన్యాధిదైవాప్తికిం
బటుఘోరాతపతప్తవిశ్వము జగ♦త్ప్రాణోచితప్రేషిత
స్ఫుటలేఖావళు లట్లు సర్వదిశలన్ ♦ జూపట్టె నప్పట్టునన్. 31

మ. అవనీచక్రమునందు మించె వరపు♦ణ్యాస్థాలికల్ పాంథహృ
ద్వ్యవహారోచితశాలికల్ ఘనయశో♦ద్యద్వల్లికామాలికల్
భువనాజ్ఞాగతకేళికల్ సదచిరాం♦భోదాగమశ్రీసము
ద్భవబీజావనమాలికల్ సుజనసం♦స్థాపప్రపాపాళికల్. 32

సీ. కడువేఁడిమికి సుధా♦కరుని వెన్నదుముచు
నోదుగు మబ్బు లనగ్రో♦వ్వెదలు బొదల
గుబ్బలసొబగు కంగు♦లమచ్చుఁ జూచుట
కగు నిట్ట నెడి కల♦శాళిఁ బూని
తగదీర నీరువో♦యఁగ ధార లోఁగొంచు
దనిసి మెచ్చులుగ మూ♦ర్ధంబులూఁచి
రేచినతమి మాధు♦రీరసానందంబు
నుడువుచుఁ బల్కించు ♦ పడుచుదనపు

తే. గీ. తెరువరులతోడఁ దగు బల్కు ♦ తేనెలొల్కు
సరసములుగుల్కు నెఱిపోడ్మి ♦ జవ్వనంపు
మగువలుందురు పలరాజు ♦ మలయసీమ
తెలుఁగులగు నీరువోయు పం♦దిరులనెందు. 33

తే. గీ. మఱియు ముగ్ధాధ్వగులు నీరు♦మజ్జిగడిగి
వారి నెమ్మోము పస కాస♦బారి చూడ

వారియొసఁగుచు నగు దేట♦మారొసంగి
త్రావ నగుదురు సైగల ♦ తరుణులందు. 34

కం. పగటి యుఁడుకార కుండెడి
జగతిని రేయెండలాని ♦ చమురుచునుండున్
దగరేజకోరములకా
రగఁ బోసిన వేఁడిపాల ♦ రంగు సెలంగన్. 35

సీ. చలువపన్నీటి చెం♦గలువకేళాకూళి
కల నోలలాడి లే♦వలపుఁ గొలుప
పదనుగొజ్జఁగినీట ♦ మెదిపి నున్గొ్రిత్త గ
ప్పురపుగంధము మెయి ♦ పూఁతఁ బూసి
బిఱుమల్లెమొగ్గల ♦ సరముఁలుదురిమి సై
పుగ భుక్తిసలిపి క♦ప్పురపువిడెము
లందుచు నారికే♦ళాంబువులను దప్పి
దీర్చుచు కదళీద♦ద్ధ్యమాతు

తే. గీ. లుంగఫలరసములఁ దెచ్చి ♦ సంగతముగ
సురటివిసరెడి కీల్బొమ్మ ♦ లొరయు జందు
రముల మేడల విరుల ద♦ల్పములఁ జేరి
కలియుదురు ధన్యు లెందు వె♦న్నెలలయందు. 36

తే. గీ. సరసజంబీరరసమి్శ్ర♦జలరసాల
పుష్పఫలగంధదాన సం♦పూజనములు
సుమహితాఖిల తాలవృం♦తముల పనులు
వఱలె నూరూర చలునపం♦దిరుల సిరులు. 37

ఉ. శ్రీవిలసత్ప్రవాళము ♦ ప్రచిహ్నితమౌక్తికచారుపుష్పమ
భ్రావిలగంధసారము నిశాం♦కము మంజులవంగచంద్రమ
త్స్యావృతసన్మథూజ్వలర♦సాధికదీప్యము సర్వలోక ధ
ర్మావహ మై వసంతకసు♦మాకర మింపు దలిర్చె భూస్థలిన్. 38

వ. అట్టి వసంతకాలంబున. 39

తే. గీ. రాక రాకయు వచ్చె ము♦ల్లోకలక్ష్మి
రాకరాకల తమము ని♦రాకరించు
రాకవిధునకు రాధతో ♦ రాకఁ గూర్చి
రాధ మాధవునకుఁ దక్కె ♦ రాకవలన. 40

తే. గీ. అట్టి వైశాఖ పూర్ణిమ ♦ యందు నుదయ
సమయమున వనపాలికల్ ♦ సరసపుష్ప
మధురసాలసితాభ్రసం♦పదలు మొదలు
గలుగు కాన్కలు చేసి పొం♦కముగననిరి. 41

కం. ఓ యమ్మ భర్తృదారిక
నీ యుద్యానంబు మధుప♦నికరపికశుకీ
గేయంబై రంజిలె నా
హా యే మనవచ్చు మోహ♦నైకప్రభలన్. 42

వ. దేవీ భవద్విహారభవనం బగు పుష్పోవనంబునం దరులతానికరంబు లంకురితంబై చిగిర్చి పసరుమొగ్గల నెసఁగి జాలకంబులఁ గీల్కొని ప్రసూనస్తబకంబులఁ బుటంబులెగసి తేనెసోనలం బూని పూపపిందియలఁ గొందుపడిన వశలాటువుల నూటిగొని లేబరువునోరసి మెఱసి బొడ్డుతంకంబుల నిండుకొని రసంబులఁ గురియుచుం దగినప్రవేగున నొమ్మగ్గిడి లేమొగ్గంబులగు గురువిందపందిరులు పొందు నెఱపె నేలాలతామంటపంబుల నొంటివడి దంటలై యంటిన పంటకప్రపుటనంటుల నుప్పతిలి మెప్పుచొప్పడు గొప్పకప్పురపుదిప్ప లొప్పుమీఱె సారణుల మేఱమీఱి యేఱులై ప్రవహించు గొజ్జగులమంచునీట నించిన చెంగలువకేళాకూళికలు ధారాళంబులయ్యె నొయ్యనొయ్యన మలయు మలయపవమానమాసితోన్మత్తమధుకరానీక కోకిల శారికా శుక కేకినీకుల కలకలారావభావంబులు భావభవప్రభావంబు లుపన్యసింపు చుండె నెల్ల దిక్కులం బరాగపటలంబు ఘుమంఘుమాతంబై హితంబుఁ జూపె నేపుగలిగి యామనిసామికల్మికి నంతరంగంబున తెఱంగులు దొరంగలించె మఱియు నప్వనంబు నందు. 43

సీ. లతకూనఁ దగు బాల♦లతకూన దలిరుప్రా
యంబు నిండార మే ♦ లందెనమ్మ
మందారికప్రౌఢి ♦ మందారికలబారి
సుమనోనురాగంబుఁ ♦ జూపెనమ్మ
సురసాలపాళి భా♦సురసాలపాళిపై
జిలిబిలివలపులఁ ♦ జిలికెనమ్మ
తిలకరేఖసదాళి ♦ తిలకరేఖ నెసంగి
చూపరులకు వింతఁ ♦ జూపెనమ్మ
తే. గీ. మాధవిక నిండుకూటంబు ♦ మలసెనమ్మ
చిన్నికొమ్మల తేట రం♦జిల్లెనమ్మ
ఘనతరులపాలి సిరులందుఁ ♦ గల్గునమ్మ
హేమలత వింతవన్నెల ♦ నెసఁగెనమ్మ. 44

సీ. చిన్నిపొన్నకుఁ దార♦సిలియున్న లతకూన
ననువుగా జతగూడఁ ♦ బెనిచి పెనిచి
వలపు లీడేరు రా♦చిలుకదంపతుల మ
చ్చికమీఱ నొక్కటి ♦ చేసి చేసి
పసిమిఁ గోయిల ముద్దు ♦ బాలింతరాండ్రుర
క్కొయ్య నొయ్యనఁ బురు ♦ డోమి యోమి
మొకరితేటులపిల్ల♦లకు గ్రొవ్విరులతేనె
మించుటుగ్గు లొసంగి ♦ పెంచి పెంచి
తే. గీ. కమ్మ తెమ్మెర వియ్యంపు♦గరిమ నెఱప
విందులొసఁగుచు వేడ్క గా♦వించి మించి
యొనర భవదీయశృంగార♦వనమునందుఁ
గ్రీడగావించు మాధవ♦శ్రీకుమారి. 45

ఉ. కమ్మకగాదు నీదు మదిఁ ♦ గ్రమ్మెడువేడుక సందడింప మో
దమ్మున నెచ్చెలుల్ ప్రతిప♦దమ్మున సమ్మద మెమ్మె దెల్ప రా
వమ్మ భవద్విహారవిభ♦వమ్మగు పుష్పవనమ్ముఁ జూడ వే
గమ్మునఘుమ్మనన్ విరుల ♦ గమ్మనితావులు గుప్పిమ్మరిల్లెడున్. 46

సీ. అలరుతావులఁ గూడు ♦ నలరుతావులఁ జూడు
కోరకమ్ముల యాస ♦ కోర కమ్మ
చాల మే లగు పొన్న♦చాలు మ్రోలగనున్న
మావికొమ్మల పండ్లు ♦ మావి కొమ్మ
బాలబిల్వము జూడ ♦ బాలబిల్వముప్రోడ
రేఁగుమ్రాకుల కెదు ♦ రేగ కమ్మ
పచ్చపూఁతల మించు ♦ పచ్చపూ తలనించు
తేలకొమ్మలఁ జూడ ♦ రేల కొమ్మ
తే. గీ. లార కదళులపైఁ గోర్కె ♦ లారఁ గదలి
నారికేళివనాళిఁ జె♦న్నారి కేళి
కింపు దులకింపు నని తమ ♦ కింపుమెఱయ
నాడి రతివలు మరుఁడు వె♦న్నాడి కొనఁగ. 59

సీ. రాకు రా కల తలి♦రాకులంటకె యవి
మరుని చేబాకు లో ♦ మందయాన
మొగ్గబారకె మల్లె ♦ మొగ్గబారు లవెల్ల
మార నారాచముల్ ♦ మంజువాణి
వారంపుటలరు పు♦వ్వారమేరకె యది
వలరాజుసొమ్ము పు♦వ్వారుబోఁడి
చేరకే శుకపిక♦శారికేకిబలంబు
లవి కాముపౌజు లో ♦ యతివమిన్న
తే. గీ. యనుచుఁ గడులేఁతప్రాయంబు ♦ వనితలందుఁ
గలుగుముగ్ధత యొరులకుఁ ♦ గలయు తెలియఁ
దలఁచి పలుకుచుఁ దమ రటు ♦ లలముకొనుచు
సఖులు పుష్పాపచయకేళి ♦ సలిపి రందు. 60

చ. అలికులవేణి యొర్తు చిగు♦రాకులజొంపపుఁ దీవగుంపు లో
పల నిగుడంగ బారి యొక ♦ పాళపుఁబూవులగుత్తిఁ గోయుచోఁ
జెలి యొక తేఁగి దాని వలి♦సిబ్బెపుగుబ్బల దోరపండ్లు దాఁ
గిలె నని కేలనంటఁగ స♦ఖీమణులందఱు నవ్వి రయ్యెడన్. 61

చ. మఱియొకలేమ లేమగువ ♦ మన్ననఁ గ్రొన్ననదండదండపై
దురిమిన మేలిమేలిమిగఁ ♦ దోఁచినవేచన వే ఱొకర్తునా
విరిసరముచ్చు మ చ్చునఁగ ♦ వేసలి నాననొకర్తు గప్పు పూ
సర మనిజేర జేరచనఁ ♦ జందురుకావులు గప్పె నేర్పునన్. 62

ఉ. కోమలు లిద్ద ఱొక్క నన♦గుత్తికి గుత్తపువాదు సల్పఁగా
భామ యొకర్తువచ్చి సరి♦పాళముగా కథఁ జెప్పుదాన నే
సీమను జందమామ నివ♦సించునొ జెప్పినవారి దీ సుమ
స్తోమ మటన్నఁ జెప్పె నొక ♦ తొయ్యలి తేఁగదె యంచు తత్కథన్. 63

సీ. వనకేతకిని జూడు ♦ మని వేఁడుకొనిన ప
న్నగవేణి తాండింపఁ ♦ దలఁచనగునె
ఘనపుష్పరసము గ్రై ♦ కొనుమన్న సైకత
కటి విరసంబుగాఁ ♦ గాంచఁ దగునె.
మాకంద మది వేడ్కఁ ♦ జేకొంద మనిన సా
రసయాన మా మాట ♦ గసరనగునె
పాలమొగ్గుట గానఁ ♦ బడెఁజూడు మనిన మీ
నాయతేక్షణ పగఁ ♦ జేయఁ దగునె

తే. గీ. యనుచుఁ దమమాటవినక యి♦చ్ఛానుగుణ్య
వర్తనలఁ జేరు ముగుదజ♦వ్వనుల వనుల
వెలఁపులోఁదోఁప నేర్పున ♦ విశదపఱచి
సరసములఁ దేలి వనకేళి ♦ సలిపి రందు. 64

సీ. సమదచంద్రకిలాస్య ♦ జతఁ గొన్న దీ పొన్న
కటు జేరకమ్మ నీ♦లాహివేణి
నీలాహివేణి మ♦న్నించె నీ కాంచనం
బటు జేరకమ్మ పూ♦ర్ణాబ్జవదన
పూర్ణాబ్జవదన నే♦ర్పుననంటె గోరంట
కటు జేరకమ్మ చ♦క్రాహ్వయకుచ
చక్రాహ్వయకుచ ము♦చ్చటబెట్టు కలిగొట్టు
కటు జేరకమ్మ మీ♦నాయతాక్షి

తే. గీ. యనుచు జాణయొకర్తు వ♦ల్దనుచుఁ బల్క-
ప్రౌఢయొక్కర్తె కార్ముక♦భ్రుకుటులార
చారుతరమీనకేతుని♦శారలార
వనజరుఘ్ఘాసలార రా♦వచ్చు ననియె. 65

వ. ఇట్లనేకప్రకారంబుల వనవిహారంబు గావింపుచు. 66

రగడ. రమణి గనుఁగొమ్ము తరు♦రాజముల రాజముల
రమణీయముల నీ ధ♦రాజముల రాజముల
రసముఁ జిక్కెడు సుమవ♦రాగముల రాగముల
నసమకిసలయమే దు♦రాగముల రాగముల
సరసగతి నలరు సుర♦సాలముల సాలముల
సరిమీఱి నలరు సుర♦సాలముల సాలముల
పరికింపు మటు కాము♦బాణముల బాణముల
పరిపక్వఫలరామ♦బాణముల బాణముల
బాలతర మైన శ్రీ♦పర్ణముల పర్ణముల
నవకమున నెసఁగు పు♦న్నాగముల నాగముల
పువుఁబోఁడి చూడు సం♦భోగముల భోగముల
వనిత గనుఁగొను సింధు♦వారముల వారముల
జననుతము లవియె ఘన♦సారముల సారముల
ఫలవిలసితముల రం♦భాగముల భాగముల
పొలుపు మిగిలెడి నిల్వ♦పూగముల పూగముల
చాలమే లగు పారి♦జాతముల జాతముల
మ్రోలఁ గనుపట్టెడి క♦పోతముల పోతముల
వలనుమీఱిన నాగ♦వల్లికల వల్లికల
మలయజామోద గిరి♦మల్లికల మల్లికల
మహిఁ దనరుఠీవి నవ♦మాలికల మాలికల
బహుళకలకంఠ పిక♦బాలికల బాలికల
పికవాణి చూడు మద♦భృంగముల భృంగముల
ప్రకటతర మైన నా♦రంగముల రంగముల

నలినాక్షి ఘనవంశ♦నాళముల నాళములఁ
దనరు వనిలోన శ్రీ♦తాళముల తాళముల
తరుణి గనుఁ గొను మెట్ట♦దమ్ములను దమ్ములను
నెరిపండు తియ్యదా♦నిమ్మలను నిమ్మలను
తలిరు సంపఁగిపూల♦తావులను తావులను
మొలకగ్రపపుటంటి♦మోవులను మోవులను
తెలియనగు చిన్నిపూఁ♦దేనెలను దేనెలను
మలయగిరి మందపవ♦మానులను మానులను. 67

వ. అని యామినీశ్వరవదన లయ్యామని వనివిశేషంబు లయ్యా
మినీపూర్ణతిలకాంగనాతిలకంబు దిలకింపుచొప్పానం జెప్పుచు. 68

సీ. మధుపాళి జతనుంట ♦ మాటగా దంచు నో
నెలఁత పూఁబొదరింట ♦ నిలువదయ్యె
తగ పుష్పవతుల నం♦టఁగరా దటంచు నో
విరిదీవ కేళిగా♦వింప దయ్యె
పల్లవభావ మే♦ర్పడఁ జూపె నంచు నో
యలరులేమావి ము♦ద్దాడ దయ్యె
పంచమోక్తికి మారు ♦ పల్కరా దంచు నో
మించుఁగోయిలఁ బల్క♦రింప దయ్యె
తే. గీ. ననుచు వనకేళిగొనని జ♦వ్వనుల తలఁపుఁ
దెలిసి వేడ్కొకజాడలఁ ♦ దేలఁ బల్కి
వలపు మొలపింపఁ జేయుచు ♦ కలికిమిన్న
లెంచఁ గ్రొన్ననరంతు గా♦వించి రంత. 69

కం. ఊహాలిరవొంద త్రిజగ
న్మోహనవైఖరుల మదన♦మోహిను లత్యు
త్సాహానుమోద సుమసం
దోహద మని సలిపి రపుడు ♦ దోహదకేళిన్.
తే. గీ. రామ యొక్కతె పుష్పితా♦రామమునను
కేళిపదహాతి జేయ కం♦కేళి మిగుల

సౌమనస్యంబు నెఱపిన ♦ సౌమనస్య
మొంచె దాని కశోకాఖ్య ♦ మిచ్చి యపుడు.

కం. కన్య యొకతె ముఖసీధున
వన్యమునగు పొగడ నలరు ♦ వడిగూరిచెనా
నన్యోన్యజన్యజనక
త్వన్యాయము దాని కయ్యెఁ ♦ దత్సమయమునన్.

కం. అత్తరి బిత్తరి కౌఁగిట
హత్తిన గుత్తంపుతత్కు♦చాకృతు లగు పూ
గుత్తు లలరించె కురువక
మత్తెరగటు వంటి విటసు♦లం దగుఁ గాదే.

కం. ఎలనాగ లుమిసితన్నిన
చులకన గద యనుచు ముద్దు♦సుందరి వగచే
తిలకించు నంత ననచెను
తిలకము ఘనతరులలోన ♦ తిలకముగాదే.

కం. చూపుల సుమకాండవిలా
సాపాదనచతుర యగు నొ♦యారికి హితనై
చేపడి సుమకాండవిలా
సాపాదనచతురకాదె ♦ సహకార మిలన్.

కం. ప్రకటముగ నొక్క బాలిక
మొకమెరికను చంపకమున ♦ మొగ్గలరించెన్
సకలప్రపంచధర్మం
బకలంకవితానవృత్తి ♦ నట్లగుఁ గాదే.

తే. గీ. రమణులందఱు కర్ణికా♦రద్రుమంబు
చెంత వసియించి సరసముల్ ♦ దొంతరిలఁగఁ
బలికి నంతట నది విరుల్ ♦ గులకరించె
భావిభవసూచకప్రియ ♦ భావ మెసఁగ.

తే. గీ. బాలకుసుమాళు గాత్రిచే ♦ బడలిగంధ
వహుని కెందునఁ గనుఁగొన్న ♦ వావిలేద

టంచు నిట్టూర్పునింప పు♦ష్పించె గంధ
వార మిది యన నవసింధు♦వార మంత. 78

కం. మానవతి యొకతె మంజుల
గానామృతరసముచిల్క ♦ కడుపేర్మింఖణపు
న్మార్మిను సలరించెను ఫలని
ధానము గరఁగించు సతికి ♦ తద్విధి ఘనమే. 79

ఉ. పువ్వులురాల నిద్దఱొక ♦ పొన్న గనుంగొని దీని గల్గు బ
ల్క్రొవ్విరులన్నియుం దరుగఁ♦గోయుము బా లన నాకుమేరు వో
జవ్వని నాన మేరు వను ♦ సంజ్ఞదనర్చె ద్రుమంబు బాల దా
నవ్వినఁ బువ్వు లీనె నది ♦ 'నవ్వులు పువ్వు'లటన్న సామెతన్. 80

సీ. తలిరు లేమావికొ♦మ్మల గండుఁగోయిల
చివురాకుఁ గొంత వా♦చవులఁ గొనుట
తమిదీరఁ గమ్మని♦తావు లంటుచు తేటి
కొదమ పూగుత్తుల ♦ నదిమికొనుట
పొదరింటఁ జేరి సొం♦పులుగుల్క బకదారి
సతిగూడి హితకల♦స్వనములిడుట
పొన్నగున్నకు నంటి ♦ చిన్నారిలతకూన
బెనఁగొని యొకవింత ♦ పెంపుగనుటఁ

తే. గీ. దలఁచి తననూత్నసంభోగ♦కలనఁ గల్గు
లాంఛనస్థితు లెంచఁగింప ♦ లలన యొకతె
సిగ్గుచే మొగ్గియున్న నె♦చ్చెలులు దాని
దెలిసి యవిజూపుచును కేళి ♦ సలిపి రందు. 81

తే. గీ. వరుస నీ రీతి శృంగార ♦ వనములోన
సఖులు పుష్పావచయకేళి ♦ సలుపునపుడు
సాక్షివలె నిల్చెఁ దా కర్మ♦సాక్షి యనెడి
యాఖ్య దగ రవి గగనమ♦ధ్యస్థుఁ డగుచు. 82

కం. ఆసమయంబున మిగు లా
యాస మయం బనుచు వనవి♦హారవిరామా

భ్యాసదరహాస లటు మిహి
కాసలిలవిహారకేళి♦కా సన్ముఖులై. 83

కం. కమ్మని పుష్పాడితావులు
గ్రమ్మెడి క్రొవ్విరులు తేనె ♦ కోమలఫలజా
లమ్ములు నవకదళీకిస
లమ్ములఁ బొట్లములు గట్టి ♦ లలనలు దమలోన్. 84

సీ. రా జగన్మోహిని ♦ రా మనోహారిణి
రా సుధారసవాణి ♦ రా శుభాంగి
రా మందగామిని ♦ రా సుందరీమణి
రా హేమమాలిక ♦ రా కురంగి
రా పూర్ణకౌముది ♦ రా కళామంజరి
రా పద్మకేసరి ♦ రా సుగంధి
రా కుందనపుబొమ్మ ♦ రా నీలకుంతల
రా గుణనిరతి రా ♦ రాజ్యలక్ష్మి

తే. గీ. రావె సరసాళి శశిరేఖ ♦ నీవురావె
యనుచుఁ దమలోన సరసోక్తు ♦ లాడుకొనుచు
రాజకన్యకతోఁగూడి ♦ రమణులెల్ల
నభిలషించిరి సలిలవి♦హారమునకు. 85

సీ. అలరుపూఁదేనె పు♦క్కిలిపూనె నొకచాన
జిగిమోవి చిగురాకు ♦ జిట్లకుండ
సొగసుఁబూసురటి చా♦టుగఁబూనె నొకబోటి
మోముజాబిలి కెండ ♦ మోవకుండ
ద్రాక్షపందిట నీడ ♦ దారె నొక్కమిటారి
కాఁకచే మైదీవ ♦ గందకుండ
పన్నీటిజాలు వెం♦బడి నేగె నొకచేడె
యడుగుదమ్ములపస ♦ సడలకుండ

తే. గీ. నిటుల చటులాళికచలల♦సటల నిటల
తటుల చిటిపొటిచెమట లె♦త్తుటలవలన

ఘర్మజలగంధపంక సం♦కలితదేహ
లగుచు జలకేళి కై యంద ♦ అరిగి రపుడు. 86

కం. దళదళిపల్లవ లవమం
జులవంజులకుంజపుంజ ♦ సుమనోల్లసదు
జ్జ్వలగంధమిళిత కోమల
మలయానిల మొలయ విగత♦మార్గశ్రమలై. 87

వ. ఇట్లు చనిచని యగ్రభాగంబున. 88

సీ. ఘనసార ఘనసార ♦ ఘనసారపూరంబు
సారసాధారసా ♦ ధారణంబు
నాళీక నాళీక ♦ నాళీకకోశంబు
రాజీవ రాజీవ ♦ రాజితంబు
మాధుర్య మాధుర్య ♦ మాధుర్యవిభవంబు
లోలకల్లోలక♦ల్లోలకంబు
20శుభ్రాంశు శుభ్రాంశు ♦ శుభ్రాంశులలితంబు
విభ్రమద్భ్రమరాభ్ర♦విభ్రమంబు

తే. గీ. జంబు జంబీర సాల ర♦సాల సాల
తాల హింతాల కుంద మం♦దారచంద
నాగ సంభోగవనతటా ♦ భోగభాగ
భాగధేయంబు కల్యాణ ♦ సాగరంబు. 89

వ. ఇట్టి కల్యాణసాగరం బను పద్మసరోవరంబు ననతిదూరంబునం గని. 90

—♦ లయగ్రాహి ♦—

వాటముగ బోటు లెడ♦బాటుగతి మీటిచని
రేటి వలిదెమ్మెరల♦నేటి చెలు లేగన్
గాటముగ బేడిసల ♦ గూటువులు చెంగునను
దాటి గను తేటలకు ♦ నూటి వగనింపన్

పా. 20 రసచక్ర రసచక్ర ♦ రసచక్రవాళంబు.

మాటికిని బేరజపు ♦ పాట లొంగిబాడుచును
దేటిగమి ముంగురుల ♦ తోటి జతగూడన్
బూటకపు మచ్చికల ♦ నాటి మదిమెచ్చులగు
మాటలను జక్కవల ♦ బోటు లటు పిల్వన్. 91

వ. మఱియు నప్పద్మాకరంబు పద్మాకరంబుకరణి గృహీతహరిపాద విలాసంబుల నలరి సరసశృంగారవనవిహారాభిలాష సమాగమవిలాసినీవతంసంబుల కంశుమత్కరనికరజనిత వితతాతపప్రపాతయాతనోద్ధూత సామర్థ్యార్ధచంద్రరేఖాలంకారకారితజాతరూపంపు మెఱుఁగు లగు కరిరతనంపుటరిగెల నలరుదీవ జవరాలికంపె నన తరుణసరోరుహాంతరమరందసాస్వాదనోన్మత్తచిత్తస్వభావసమ్యగ్గ్లుకీకరణముద్రితార్ద్రాబ్ద్రరజోవిరాజమానోపరిమిళింద బృందంబు లందంబు మెరయ నందంద గ్రందుకొని యమందానందంబు బొందు పరుప పరిపరివిధ వివిధగరుద్రథప్రధనవర్ధనప్రబోధిహృన్మదోల్లసద్భ్రమత్పుష్పలిట్చలన్మిళద్గరున్మరుద్వలద్ధళద్గళత్పరాగవితానంబు స్నానాగతనిఖిల సఖీప్రకర సుఖప్రదప్రశాంతస్వర్ణవర్ణాంబరకాయమాన వితానోపమాన సన్మానంబు నెరుప నెరపరపు నొరపు మెరుపునుం గల నెలరారుపలక లుగ్గడి బిగ్గరిల మొగ్గించి తీర్చికట్టిన దట్టంపు చుట్టుతిన్నియల పట్టునం గనుపట్టు గట్టు దట్టునం బెట్టలరుగగట్టి ప్రాయంపు జెట్టులం బుట్టిన దట్టంబుఁ గొమ్మగమి గొనల నెనయు ననలవన్నియ లన్నియెడల నెన్నదగుచెన్నునఁ గొలంకు కల్మికన్నియ నలంకరించిన సమంచితాభంగమంగళ రంగవల్లికాచిత్రవిచిత్రంబు లెఱిగింప కింపురుషదంపతీప్రకర ప్రకల్పితానల్పకల్పద్రుమోద్యాన వనదేవతావతారవిరాజమానమానితానేక చామీకరవాలుకాక్రాంతమణిమంటపాంతరాంతరప్రకటీకృత తటసముత్కటస్ఫుటవల్లికామల్లికామతల్లికామాలికాశోకవకుళముకుళాది సకలసుకుమారకుసుమమనోహరరసకిసలవిసరసరస ఫలభరితపూజాకలాపంబు కలాపంబుగా నెసంగ సంగతాభంగమాంగళ్యప్రదాయక కాయజారాధననీరాజననికాయోపమేయ చాంపేయకద్రుమ కుసుమసముదాయామోదమేదురదురాసదసదాగతి గతీంధనధనంజయ జయాదరదరోదరమదవదిందిందిరార్భక కలకలంబు కలికాలకలుషపటలంబు సకల

రత్నాకరమేఖలావలయ వలయితవసుంధరాచక్ర సమాక్రాంతంబుగా వచ్చి
పుణ్యంపు టచ్చగు నచ్చెరువు జొచ్చుటకు శక్యంబుగాక పికాపిక లై వికల
భావంబున నితరప్రదేశంబుల కరుగు పోలుపుఁ దెలుప దెలుపలమినిండు
విరిసి విరహిణీమృగపుండరీకంబును మనోజరాజపుండరీక చ్ఛాయామండ
లంబునకు లికుచకుచకుచాకృతి తిరస్కృతవయః పరిపాకసంపదలగు కోకదం
పతులందఁ జేరి చిరతరతపఃప్రభావానంద రసానుభావోదారపారవశ్యంబు
గాంచుకరణి సమందానందవివశంబు లగు నవసరంబున సరోవరవిహరమాణ
విహగకులకోలాహలంబుల కలికి మెలుకువలగిలకిల మను నెలుంగుల నలుగ
డఁల నలుకుడు లరయునెడల విమలజలబింబితము లైన దమనీడలం దిలకించి
నేడును వెన్నాడివచ్చు మచ్చికఁటులకు మెచ్చులిచ్చు దంటలగు జనుదంట
లని తలంచి చిడిముడిపాటునం దాటుచు దాటువడి తటాకాంతప్రాంతంబుల
విశ్రమించుట జలావగాహనాగతజనావలోకనార్థంబు తీర్థాంగనానియమిత
జనంబుల దీర్చున నేపుజూప జూపరుల జూపుల కేపారుసోపానమార్గంబు లన
నెసంగు రంగదుత్తుంగతరంగమాలికాడోలికలం దూఁగు రాయంచకొదమల
నదము విలోలకత్వంబు జాంబూనదాంభోజసమాజవిభ్రాజమాన మానస
సరోవరప్రయాణోన్ముఖవిముఖ వినిర్ణయాకీర్ణ సంకల్పంబు సంకల్పింప పరం
పరాగత మారుతోద్ధూత నూత్నతరోత్ఫుల్లహల్లకకుశేశయదళశ్రేణికావిరళ
చలనంబు లంబుజాకర రమావధూతిలకంబు కంబుకంధరల దరుల నరయక
రయంబున నయంబుమీఱ నరుగుదేర తరి యని బిలచు చేసన్న లని యెన్నఁ
దగిన చెన్నున వన్నె మిగుల మిగులసుందరం బగుచు దరంబునుంబోలె తీర్థ
పావనం బై, వనంబునుంబోలె నుద్దండపుండరీకాభిరామం బై, రామాయ
ణంబునుంబోలె నలనీలకుముదసుగ్రీవరామలక్ష్మణపరిభావ నిరూపితాఖిల
భువనభాగం బై భాగవతంబునుంబోలె బహులహరీకృతమార్గానుసరణ
గోపబృందం బై, బృందారకాధివాసంబునుంబోలె సంతతానుకూల సంతాన
రంభాపారిజాతకైరావతాదిసంభారం బై భారతంబునుంబోలె పాండుపరా
చ్యుతవిలాస ధార్తరాష్ట్రశకునితరణిజాతచరిత్ర సంగ్రహం బై, గ్రహమండ
లంబునుంబోలె కుళీరమీనమిథునమకరాళినికరం బై, కరంబునుంబోలె కంక

ణోర్మికాలంకృతం బై, కృతాభిషేకాధినాయక రాజ్యనై భవంబునుంబోలె పూజ్యమానకువలయం బై, వలయంబునుంబోలె సమానం బయ్యు నస మానంబై, భంగయుతంబయ్యు నభంగయుతం బై ప్రకాశించుటకుఁ గించి న్మధ్యలంకురితరోమాంచప్రకటితలై ప్రకటితోత్సుకలై తత్సలిలకేళీవినోద హృదయలై తీరంబుఁ జేరి యప్పుడు. 92

సీ. హరదృక్కృదాగ్ని సంహరమన్మథోజ్జీవ
నౌషధరసపూర్ణ ♦ మమరు గిన్నె
గిన్నె కా దిది పంట♦కన్నియ క్షోకవింత
చలువచె ల్వలరు దు♦వ్వలువ మడుపు
మడుపుగా దిది జగ♦న్మాంగళ్య కాదేవ
తామనోజ్ఞంపు బ♦ద్ధంపుబిళ్ళ
బిళ్ళగా దిది జగ♦త్ప్రీతాంతరాళావ
తారిత విష్ణుప♦దంబురూపు

తే. గీ. పాలు పనుచుఁ జేరి యందఱుఁ ♦ బాగడిరి రమల
కమలకల్హారకైరవ♦ప్రముదసముద
బంభరస్వనగంభీర♦జృంభమాణ
గుంభితం బైన తామర♦కొలనిఁ జూచి. 93

కం. దరిజేరి నిలచి నెఱకి
న్నెరకంధరలార యిందు ♦ నీరాఢి రతీ
శ్వరపూజసలుప సుమనో
హరవరలాభంబు గలుగు ♦ నగు నేఁ డనుచున్. 94

తే. గీ. తడుపు చెంగావిచేలముల్ ♦ దాల్చి విల్వ
వల్వ లొకకొన్ని భూషణా♦వళులు కొలని
తీరముననుంచి నెలరాల ♦ తీనెమెట్ల
దిగుచు జరు గని కొందఱూ♦తగ మొగించి. 95

చ. ఉవిదలు వారిఁ జేరి మెఱుఁ ♦ గొప్పఁగ నున్నసపాడి లోకబాం
ధవునకు మ్రొక్కి మన్మథమ♦దప్రమదావనరాజహంసికా

నివహావిలాసవై ఖరుల ♦ నేర్పుదలిర్ప లఘుప్రభావ వై
భవముల దుమ్కి రందఱు గు♦భాలు గుభాలు గుభాలునం గడున్. 96

ఉ. బాలికలెల్ల నీవరుసఁ ♦ బద్మసరోవరమందు నిల్చి భృం
గాళులరేచి క్రౌంచకల♦హంసచకోరకచక్రవాకకీ
లాలకకాకశాబకబ♦లాకబకప్లవటిట్టిభార్భక
వ్యాళులఁ బిల్వ బాతులఁ ♦ బారకఁదోలుచు నీఁదు లాడుచున్. 97

చ. కలికియొకర్తు నీట నొర♦గాలను నిల్చి తపంబుఁ జేసి న
ట్లులయకయున్నఁ జూచి సర♦సాళియొకర్తు పిఱుందనేగి పై
జలములుచల్లి తమ్మిగమి♦చాటునదాఁగిల దాని మోముగాఁ
దలఁచి జలంబుఁ జల్లె నొక ♦ తామరపై పయి నవ్వి రందఱున్. 98

తే. గీ. కొమ్మ యొక్కతె జిమ్మన♦గ్రోవిఁ బూని
నీరుజల్లుచు చెలులఁ దృ♦ణీకరించె
పొంచి యిరువురు మువ్వురుఁ ♦ బొడవి దాని
బులు పడంచిరి పలువురఁ ♦ జలము దగునె. 99

కం. బాలామణి యొక్కతె యొక
కేలను కల్హార మొక్క♦కేలను బద్మ
శ్రీలను జేపట్టుచు సం
ధ్యాలక్ష్మికి సాటియగుచుఁ ♦ దద్దయ మెఱసెన్. 100

ఉ. పూనికనోర్తు చెంగలువ ♦ పుష్పాడిగుప్పిన నోర్తు దమ్మిపూ
దేనెమెదించి జిల్కవగ ♦ దేరగ దేరుగ డైన లేత న
వ్వానససీమ వెల్వడి క♦టాక్షములన్ విరబారజూచుచున్
మానిను లాత్మనాయకుల ♦ మచ్చిక లచ్చుగఁ దెల్పు కైవడిన్. 101

మ. స్తనకుంభప్లవకేళికాచతురసుం♦దర్యాళిలీలారతిన్
మునుగంబారుచుఁ దేలియాడుచు మహా♦మోదంబునం బైకి హు
మ్మని లంఘింపుచు నిల్చుచుం బొలిచె నొ♦య్యారంబుదీపింప మో
హనరేఖాగతనాగకన్యకల చి♦త్రాకార చందంబునన్. 102

చ. వెలఁదియొకర్తు లేనగవు♦వెన్నెల నీరములూరఁ జేయ జా
బిలిరతనంపు గొమ్మనను ♦ బెల్లుగ నీ రటు జల్లనోర్తు ప్రో
జ్జ్వలరవికాంతశృంగమున ♦ జల్లెఁ దదంశునిబద్ధకాండమై
డులె నది రాజరత్నము ల♦టు ల్గన మిత్రమణి ప్రసక్తికిన్. 103

సీ. వలిజక్కవల మక్కు♦వలఁ గౌఁగిటనుజేర్చి
లాలించు గదె పద్మి♦నీలలామ
కొమరుప్రాయపుఁ జకో♦రములపై నీ కటా
క్షమునింపఁ గదె ముద్దు ♦ చంద్రరేఖ
చిన్నిపూ దేనె మ♦చ్చికఁజేసి నెఱదేటి
గమి బెంపఁ గదవె చెం♦గల్వకొమ్మ
కలికి రాయంచ పి♦ల్లలఁ బెంచి నడదీర్పు
గావింపఁగదవె శృం♦గారసరసి

తే. గీ. యనుచు సరసోక్తు లిటు లాడు♦కొనుచు సరసి
సరసి రసికావతంసలే ♦ మఱలమఱల
దా మఱలఁజేరి శశిరేఖ ♦ దారిగోరెఁ
గలువగమిగూడెఁ గొలను ద్రో♦క్కాడెనవియు. 104

రగడ. తరతరముగ సుందరముల దరముల
గరగర లిడు పుష్కరముల కరముల
సరిసరిబెనఁగుట ♦ చాలునె చాలునె
వెరవెఱుఁగవు నీ ♦ వెలనే వలనే
గొరగొరలాడుచు ♦ గురులకు గురులకు
మఱి మఱి విరిదా♦మరలకు మరలకు
మిళమిళ మను తు♦మ్మెదలకు మెదలకు
ఘుళు ఘుళు జను సా♦గదలకు గదలకు
వరవరవర్ణిని ♦ వాలకు వాలకు
గొరగొర లగు తమి♦గోలకు గోలకు
దరిదరిగెడు కుము♦దమ్ముల దమ్ముల

గురికురకకు విరి♦గుమ్మల గుమ్మల
కవకవ మని చెం♦గలువకు గలువకు
తవతవలుగ నిం♦తలువకు తలువకు
మనిమనివిగ వగ ♦ నాడుచు నాడుచు
గొనగొన నొండొరు ♦ గూడుచు గూడుచు
గొలగొలలకు మది ♦ గుల్కుచుఁ గుల్కుచు
భళిభళి యని యిటు ♦ బల్కుచు బల్కుచు. 105

తే. గీ. పొలఁతు లప్పుడు చెంగల్వ♦పూలు గోసి
వేట లాడిరి తమలోన ♦ వేయుగతుల
చెరకువిలుకాఁడు శరపరం♦పరల దవుల
నాట నేసిన భావంబు ♦ దేటపడఁగ. 106

సీ. కలకంఠికకు ముద్దు ♦ కల్పవల్లికజోక
లీలావతికిఁ జిత్ర♦రేఖసాటి
సరసాళికి మనో♦హరమంజరి ప్రియంబు
కల్యాణి కీరత్న♦కళిక హితవు
పూర్ణచంద్రిక జగ♦న్మోహినితో నుద్ది
వరకళావతి మంజు♦వాణిసవతు
శృంగారసరసి కీ♦చిత్రపద్మినిదగు
రంభ కీసమదసా♦రంగిసమత

తే. గీ. సమరు నని రెండు గములుగా ♦ సమతనొద్దు
వన్ని పన్నిటికొలనులో♦పల విలాస
వతులు బహువిధగతుల స♦మ్మతుల నతుల
కృతవసంతోత్సవమున సు♦ఖించి రంత. 107

చ. వెలఁదియొకర్తు నీట నొక ♦ వింతగఁ దేలుచు వెన్కయాతదా
నలయక నీఁదుచో మెఱుఁగు ♦ టందపుఁ జన్గవపై డిదమ్మి మొ
గ్గల సిరి జూప జక్కవలు ♦ గ్రమ్మి ముఖేందునిఁ జూచి వీఁగె దే
టులుగని గొప్పునంపెంగకు ♦ డొంకె మరాళి గదల్చె సిగ్గులన్. 108

సీ. కలహంసయాన గా♦సిలఁ జేయ బిసబాహు
లతికకంధరవేణి ♦ జతఁ జరించె
మదకీరవాణి హా ♦ మ్మని డాయ బింబోష్ఠి
సాంకవగంధి చే ♦ జాట గనియె
కలకంఠకంఠి మి♦క్కిలినొంప పల్లవ
పాణి రామాంగి దా♦పల వసించె
సమదకోక స్తని ♦ గమకింప మీనలో
చన చంద్రికాహాసు ♦ శరణుజెందె
తే. గీ. నంద ఱీచందమున నీఁదు♦లాడి కూడి
వ్రాలి పై దేలి ప్రీలి మృ♦ణాలనాళ
జాలముల జిమ్ములాడుచు ♦ గోల లిడుచు
నోలలాడిరి కేళీవి♦లోల లగుచు. 109

తే. గీ. సరసి నిటులాడ నది పూఁత♦చందనంబు
కప్పురంబును గస్తూరి ♦ కాటుకయును
సన్న చెంగల్వపుప్పొడి ♦ చాయపసపు
సంగతం బయి మున్నీటి ♦ చందమయ్యె. 110

ఉ. ఆ సమయంబునందు మది♦కచ్చెలువచ్చెరు వయ్యె మోహనా
వాసవిలాసతన్ గుముద♦వారిత వారితరంగకేళికన్
గాసిలు పత్త్రభంగమునఁ ♦ గన్పడఁ గన్పడుకంకణోర్మికన్
ద్రాసిలు జీవనంబున ని♦తాంతరతాంత రతాంతకాంతమై. 111

తే. గీ. జలవిహారంబుఁ జాలించి ♦ జలజముఖులు
విమలకమలాకరంబును ♦ వెడలి రపుడు
జగము లన్నిట నొకసారె ♦ జయము గొనఁగఁ
దొడరివచ్చిన మరుని పూఁ♦దూపు లనఁగ. 112

చ. పులకలెసంగ చెంగలువ♦పూవులపై నునుగాలివీవసల్
దొలకరిమించు లట్లు చను♦దోయి కవుంగిటఁ జేర్చి వణ్కుచున్

వలిపములంటి మైయవయ♦వంబులు గన్పడులీలతోఁ గటి
స్థలుల శిరోజధార లరు♦దారఁగ జేరిరి తీర మందఱుఁ. 113

సీ. తడియార్చె నొక్కఁపు♦ త్తడిబొమ్మ పెన్నెరుల్
గమిచి కొప్పమరించె ♦ రమణియొకతె
తిలకంబమర్చె జో♦ త్తిలకంబుకంధర
తలసజ్జుగూర్చె సుం♦దరియొకర్తు
రతనంపుసరు లుదా♦రతనింపె నొకబోటి
చెంగావి సవరించె ♦ చెలువయొకతె
మణికాంచి యొకవధూ♦మణిదార్చె రతనంపు
టందె లొక్కవెలంది ♦ పొందుపఱచె

తే. గీ. మఱియుఁ గల్గునలంకార ♦ తరము లెల్ల
పూర్ణతఘటింప యామినీ♦పూర్ణతిలక
పటికనార్చిన యపరంజి♦ప్రతిమ కలరు
మెఱుఁగిడిన రీతి నొకవన్నె ♦ మెఱసె నపుడు. 114

విషమసీసం :— అంద ఉప్పు డొప్పుమీఱ ♦ నందముల్ జెలంగ మే
లుక్కుందనంపు బొమ్మ లట్లు ♦ గుల్కరించి యొండొరుల్
పొందుఁ జెంది సొమ్ములన్ని ♦ పూని కావివల్వలిం
పొందఁ గట్టినట్టి ప్రాయ♦మున్నఁ కన్నెమిన్న లా

తే. గీ. నందమొందిరి కల్పపూ♦విందు ముద్దు
టల్లునకుఁ గూర్మిగె నేసి ♦ యలరుటదను
సాహిణియొయారములఁ దీర్చి ♦ సంతరించి
కానుకదెచ్చిన సాంబ్రాణి♦గము లనంగ. 115

తే. గీ. ఇటుల శృంగారవతులొచు ♦ నేగి మ్రోల
జాలువారిన పన్నీటి ♦ జాలువలన
బూచు మల్లికనెడలు క♦ప్పురపుటనఁటి
తావు లలమిన గుజ్జు లే♦మావి క్రింద. 116

ఉ. బాలికలాడ డెందమునఁ ♦ బాయనివేడుక నుండి చొక్కపూ
పూలసరంబునం బదనుఁ ♦ బూనినపుష్పోడితిన్నె పై పయిన్
మేలుహిమాంబువుల్ జిలికి ♦ మించిన గంధపుపూఁతఁ బూసి నల్
మూలలఁ గప్పురంపు నను♦గ్రుగ్గులు దీర్చి విచిత్రలీలలన్. 117

తే. గీ. పండురసదాడిచెరకు గం♦బములునిలిపి
కమ్మగేదఁగి ఱేకు పైఁ ♦ గప్పఁ బరచి
చిన్నికురువేరు దళ్ళిమ్మ ♦ పన్ని విమల
కమలకల్హారములు తోర♦ణములు గట్టి. 118

వ. మఱియు గంధసలిలాదికంబుల బహుళసుగంధబంధురంబుగాఁ గల్పించి సల్లలితమల్లికాముకుళజాలకాంతరాళ సంఘటిత సితశతచ్ఛదకోశ ఘంటికాకలాపజాలకంబు లలంకరణంబు గావించి ప్రాంచద్విరళధవళమృణాళ నాళాంతరాళ తంతుసంతానామలచామరస్తోమంబు లాపాదించి సమంచి తోరునాళకమలకల్హార కుముదకువలయేందీవరాబ్జనీ పలాశాహివల్లరీదళ కదళికోల్లసత్పల్లవవిరచితాతపత్రి ధ్వజస్యందనాందోళికాదికంబులన్ బ్రకటించి నవోత్పన్నపాటీరకర్దమవితర్దికానికరంబులం దీర్చి వినూత్నకేసరకిసల విసరప్రణామదామకంబు లొనర్చి కోమలమృణాలవేత్రావలంబిత కర ద్వార పాలికాపాంచాలికాపాళికల నెలకొల్పి శుభ్రాదభ్రసితాభ్రప్రకల్పితానల్ప సేతూజ్జ్వలితకేళికారచిత కాసారసమాగతోత్ఫుల్లమల్లికాపరాగ ధూళీవాలు కాపులినమాలికాదీర్ఘికానిర్ఘరోర్మికోద్ధృతా యాతకేతకీ గర్భదళద్రోణికా సంచారంబు లేర్పఱచి తత్సమీపకృత్రిమసరోవరాంతరాళ మృణాళనాళాగ్ర గ్రథితవిచిత్రకుసుమమల్లికాక్షిపక్షవిక్షేపణోత్క్షిప్త సలిలశీకర స్తబకప్రశస్తాంబు యంత్రంబులు నిల్పి వివిధశృంగారదేవతావిలాసభవనంబును మదనసుందరీ కళేబరావృతాతిదందహ్యమాన ధూర్జటీనిటలతటవిస్ఫుటచ్ఛటులతరతుహిన తకుటిలేక్షణాగ్ని నిర్వాపణక్షేత్రంబును హైమవతీశ్వరశ్వశురహృదయకమలం బును శిశిరబీజావనప్రదేశంబు ననంజాలు నట్లుగా నుజ్వలభావంబు లచ్చు పరచు చలువచప్పరంబు మెచ్చుపరచి తన్మధ్యభాగంబున. 119

చ. కలలుచిగుర్ప పూర్ణతిల♦కామణి కస్తురిచే సహస్రకో
మలదళపద్మ మేర్పఱచి ♦ మధ్యమునన్ రతిమన్మథాకృతుల్

దలఁచి లిఖించి నిల్పె తమ♦దారమనోహరరూపయౌవనో
జ్జ్వలగురువల్లభున్ గదిసి ♦ చక్కఁగఁ దా నటు లుండు టేర్పడన్. 120

చ. మఱియు మనోజపార్శ్వము ల♦మందసుగంధసమీరచంద్రికా
భరణవతంసనాయకుల ♦ భావము లేర్పడ వ్రాసి మ్రోల శం
బరశుకశారికాన్యభృత♦బంభర హంసచకోరకాది స
త్పరిజనకోటి నిల్పెఁ బద♦బాణధనుర్గుణతూణపూర్ణతన్. 121

వ. ఇట్లు మన్మథసౌధంబు గల్పించిన సఖీజనంబు లానందించి. 122

తే. గీ. ధ్యాన మావాహ నార్ఘ్యపా ♦ ద్యాభిషేక
మంశుకాచమనోపవీ♦తార్హ్య చంద
నాక్షత లతాంత ధూపదీ♦పామృత ప్ర
సాద తాంబూల నీరాజ ♦ నాదివిధుల. 123

కం. పూజలు గావింపుచు నం
భోజదళేక్షణలు సకల ♦ పుష్పాంజలులై
రాజకుమారికతో వల
రాజు సమీపముననిల్చి ♦ రసభరితముగన్. 124

మ. శతపత్రేక్షుశరాసనాయ మధులి♦జ్జ్యావల్లికామల్లికా
ద్యతులాస్త్రౌఘభరాయ శోకపికర♦ధ్యానీకలోకాయ హృ
ద్గతకల్పాయ రతిప్రియాయ కరుణా♦ధారాయ తుభ్యంనమ
స్తుతిదాస్యామి యటంచుఁ గానుకలిడి రిం♦తుల్ మంత్రపుష్పాంజలుల్.

వ. ఇట్లు ప్రదక్షిణనమస్కార పుష్పాంజలులొసంగి తత్ప్రసాదంబుఁ గైకొను నవసరంబున మదనమోహిని మదనసన్నిధానంబునం జేరి పునః పునఃప్రణామంబులం గావింపుచు మఱియు నిట్లనియె. 126

కం. మదనా రతికాముక కా
మదనాళీకాస్త్రదళిత♦మదనాయక హృ
త్సదనా మణిరదనా శశి
వదనా శృంగారభావ♦వాంఛితకదనా. 127

చ. మృదుకఠినప్రచారముల ♦ మీఱుగుణంబు బలంబు నం
పద నెసఁగుం గుణప్రకర♦భావముసద్బలమూలకారణం

బుదయమవశ్యకాభరణ ♦ ముజ్జ్వలధర్మము సర్వమోహనా
స్పదసరసంబు నీమహిమ ♦ సన్నుతిసేయఁ దరంబె మన్మథా. 128

సీ. త్రిజగద్విజయకళా♦శ్రితసముజ్జ్వలమహా
సాధనప్రకరయో♦ధాధినాథ
ఫాలలోచన సద్ధృ♦గ్జ్వాలమాలాభీల
శిఖిపాలుఁ గని నిల్చు ♦ చేవకాఁడ
ప్రాచీనతరపీన♦పాఠీనజఠరాంత
రమున వర్ధిలునట్టి ♦ రాయబిరుద
తోడరిముత్వెల్పుల ♦ గడగడలాడింప
ముక్కాకతీఁజేన ♦ యుక్కుతునియ

తే. గీ. పెక్కుచిక్కుల కూటంపు ♦ టక్కరలను
దక్కుట పాలుశక్కి యని మది ♦ నక్కరంపు
దిక్కుఁ జెక్కోడి జడదారి ♦ పిక్కుటెక్కు
తక్కరించెడి నెఱచక్కఁ ♦ దనపువాఁడ. 129

తే. గీ. రతిమనోహర శృంగార♦వతుల పతుల
మతులజతగూర్చు చాశీతి ♦ గతుల నతుల
తతుల ప్రతిలేనినుతుల సం♦స్తులఁజేయు
హితవు నీ సొమ్ము సకల స♦మ్మతము సుమ్ము. 130

కం. అని వినయసంభ్రమంబులు
మనమునఁ బెనఁగొనఁగ నుతుల ♦ మన్నించి సఖీ
జనహృదయానందం బగు
మనవిగ వలరాజుతోడ ♦ మానిని వలికెఁ. 131

చ. పరిచితభక్తి నిన్నెపుడు ♦ ప్రస్తుతిసేయుటకున్ ఫలంబుగా
సరసవతీవతంస విల♦సన్మదనాత్మజపూర్ణబింబ సు
స్థిరసకలార్థసార్థవతి ♦ దీనికి నీ సరిసాటిమేటి సుం
దరగురురాజ మన్మథు ను♦దారతఁగూర్పు సరోరుహాంబకా. 132

తే. గీ. అటుల దీని మనోహరుం ♦ డైన వాని
ఘటనచేసిన నీకు మి♦క్కుటముగాఁగ

నుత్సవముసేయు సుమి! యని ♦ యుచితరీతి
మదనమోహిని వల్కిన ♦ మాటకపుడు. 133

కం. నునుసిగ్గు మనమునను నొక
దినుసుగ నన వెనంగఁ బూర్ణ ♦ తిలకామణి మ
న్ననఁ జెల్మిబోటితో ని
ట్లనె సిరిమురిపెంపు వగపు ♦ టలుకలు దెలియన్. 134

చ. కలిమిదలిర్ప నెచ్చెలులు ♦ గా నిటు నమ్మితి నమ్మలార మీ
చెలి మిఁక చాలుఁజాలు నను ♦ సిగ్గుల నారడివెట్ట మేళపుం
బులుపుల నిట్టు ముమ్మరిక ♦ పుం బలురవ్వల పాలుసేయ మీ
రలమి గయాళు లౌ టెఱుఁగ ♦ నక్కట నామది మోసమయ్యె నా. 135

ఉ. అమ్మక చెల్ల! చల్లనగు ♦ నల్లికబెల్లికమాటలాడి చి
త్రమ్ములుపన్ని నన్నిటుల ♦ దారిచి మీరిపు డందఱొక్కటై
గమ్మనఁ గేలిసేయ నొడి ♦ గట్టితి రమ్మ పనేమి మాటలన్
నమ్మఁగరాదు మి మ్మనుచు ♦ నర్మిలి వేఱొక తీరుమీఱినన్. 136

వ. ఇట్లు పితృపరాధీన గావున తద్వాక్యార్థంబు హితంబైననుం దన మనోభిప్రాయంబు నిరుత్తరవ్యాపారంబునఁ దోటిబోటులకుఁ దేటపడు నని నెయ్యంపుటలుకగాఁ బలికిన సరసాళి యను సఖీమణి సఖీత్వంబు నెఱపుచు నరేంద్రకన్య కాభిప్రాయంబుఁ దెలిసి యూరార్పువిధంబుగా నిట్లనియె. 137

చ. చెలు లిటునవ్వినంత మురి ♦ సే వదిచాలు బళా యిదేమె నీ
బులుఁపుల ముద్దరాలివగ ♦ పుల్ దరిలీపులు సేయువీరు నీ
వలెఁ బలుసిగ్గులం గులికి ♦ వన్నెలమిన్నదనంపు జాణలౌ
టెలమిని జూచినార మిపు ♦ డిట్టిటులుండు నె తారసించనన్. 138

తే. గీ. బహువచోజృంభణంబుల ♦ ఫలమ దేమి
తరుణి సిరిరాకకంబు దా ♦ పరము నటవె
వలదనుచుఁ బల్కి నెయ్యంపు ♦ టలుకమాన్పి
ప్రేమదైవార నొండొరు ♦ బిలుచుకొనుచు. 139

కం. మేలములాడుచు నందఱు
మేలుగ నటు కొంతవిశ్ర ♦ మింపుద మనుచున్

బాలికలు సేరి రుపవన
పాలిక లమరించు చిత్ర♦భవనంబునకున్. 140

వ. అయ్యవసరంబున.

తే. గీ. ఒనరబాలిక లుద్యాన♦వనవిహార
కేళికల సోలి కూర్చున్న ♦ వేళ వారి
మేని శ్రమదీఱ మలయస♦మీరణుండు
దనిపె నతని జగత్ప్రాణుఁ ♦ డనుట యరుదె. 142

వ. అప్పు డప్పూబోఁడు ల ప్పూజప్పరంబున నొప్పుమిగుల సరస పదార్థసంపన్నం బైన యన్నంబు భుజియించి తాంబూలగంధమాల్యాది మనోహరద్రవ్యానుమోదిత లగుచు ప్రొద్దుపుచ్చుటకు నక్షవిద్యావిశారద లౌటకతన నందఱు చిత్రకంబళాస్తరణాంతరంబున మండలాకారంబునం గూర్చుండి తన్మధ్యంబున. 143

కం. నలుగడల వీధులేర్పడ
నిలిపి గృహావళులదిద్ది ♦ నిగమస్థితి నిం
పలమి చతుర్వర్ణాగ్రి మ
ణుల నెలకొల్పిరి విలాసి♦నులు బలుపాళిన్. 144

తే. గీ. సరవి నీరీతిఁ గూర్చుండి ♦ చతురగతుల
సారె లట చక్కనొడ్డి హా♦స్యములు వల్కి
కరము లుంకించి వేయుచుఁ ♦ గంకణములు
ఘల్లుఘ ల్లని మ్రోయ కే♦కలుదలిర్ప. 145

సీ. కంకణంబులు కేల ♦ ఘల్లు ఘల్లని మ్రోయ
వలసిన పందెముల్ ♦ వైచువారు
పన్నిదంబులపాలు ♦ పరచు ప్రోడను జూచి
గచ్చులాడివటంచు ♦ మెచ్చువారు
తమినాట సారెభే♦దంబెఱుంగక యాడి
జగడించు సతిఁ జూచి ♦ నగెడువారు
నొకతీరుమీఱు వే ♦ ఱొకపాచికల గెల్చి
చెలులతో వందన ♦ సేయువారు

తే. గీ. నొక రొకరికంటె వేఱొక ♦ నకలు మెఱయఁ
గ్రొత్తలగు జిల్గుటాటలు ♦ గూర్చువారు
నగుచు నగుచుదురోదరా♦యత్తచిత్త
చిత్తజన్మాతికాండులై ♦ చెలఁగిరపుడు. 146

సీ. ఆరుగన్వడబోటి ♦ కందమై తగునన్న
పూవింటిమే లని ♦ నవ్వెనొకతె
దంటసారెలు నెఱ♦దంట గైకొను మన్న
పంటఁజూచెద నని ♦ పల్కెనొకతె
మంచిమొంటిదిగదా ♦ మగువజూడుమ టన్న
కార్యమా నని తెల్పెఁ ♦ గలికియొకతె
గడిమీఱిచియున్న దీ ♦ కన్నె సారెక టన్న
మగనిజూపెద నంచు ♦ మొగిచెనొకతె

తే. గీ. వరుస నీరీతి కందువ ♦ లరసికొనుచు
15బారదుగ చ్రిత్తినతచక్కు♦పగడ దచ్చి
పదియు తీవంచ మైదు తొ♦మ్మిది యటంచు
నాడి రంత దురోదర♦క్రీడ నలరి. 147

తే. గీ. పన్ని దంబుల నొడ్డిన ♦ పన్నిదముల
గెల్చి గెల్చితి మని మించి ♦ గేలికొనుచు
బాలికలు హాళిసాగటాల ♦ పాళిగట్టి
16నిండువేడుక లలర మ♦న్నించుకొనుచు. 148

కం. శృంగారవనవిహారా
సంగమతంగజచయం బ♦నంగ శుభాంగీ
సాంగత్య మొప్ప నెప్పటి
భంగిని జనుదెంచి రాత్మ ♦ భవనంబులకున్. 149

తే. గీ. వారుణీగంధ సంసేవ ♦ వలన లోక
లోచనారుణరుక్ఛటల్ ♦ దోఁచినట్లు

పా. 15 భామ దుగ ఛేత్రి సతచక్కు♦పడగదచ్చి
పా. 16. నింద తమలోనఁ దమ్ము మన్నించుకొనుచు

వారుణీగంధ సంసేవ ♦ వలన లోక
లోచనారుణరుక్ఛటల్ ♦ దోఁచె నపుడు. 150

కం. ఆంధ్రీముఖ్యసమస్త పు
రంధ్రీలాలాటికాభ♦రణకల్పక సై
రంధ్రీవతంసకృతినీ
రంధ్రీభూతప్రతాప ♦ రమ్యసమాఖ్యా. 151

శా. కాశిన్యోగ్రసుబాహుబాహుబలభు♦క్కాండప్రకాండస్ఫుర
త్కాంతారాయుధమార్గమార్గణవిభ♦గ్నాభగ్నదోర్వీర్యదు
ష్ప్రాపీనోన్మకరక్షయక్షయదకో♦పాటోపధౌరేయ హృ
త్ప్రీతస్థాదరకార్యకారణవిభే♦దాభేదవాదాత్మకా. 152

మాలినీవృత్తము.

అజసుతసుతవర్యా ♦ హార్దితబ్రహ్మచర్యా
సజలజలదగాత్రా ♦ సర్వలోకైకమిత్రా
విజితభవకళంకా ♦ విశ్వవిశ్వంభరాంకా
సుజనహితశరణ్యా ♦ సూర్యవంశాగ్రగణ్యా. 153

—:. గద్య .:—

ఇది శ్రీరామచంద్ర గురు కరుణాకటాక్షవీక్షణ సంలబ్ధ సకల సంపూర్ణ సరస శృంగారరసధారాధార మాధురీ ధురీణాలంకారితాంధ్ర గీర్వాణ కవితా విలాస విచిత్ర విలసితాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర పవిత్ర చెళ్లపిళ్లకలశ సుధార్ణవరాకానిశాకర యశోధురంధరధరామర ప్రవర్య రామయనామార్యపౌత్రికామయకవిపుత్త్రి సకల విద్వజ్జనవిధేయ నరసయనామధేయప్రణీతంబైన యామినీ పూర్ణతిలకా విలాసంబను శృంగార మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము

సంపూర్ణము.

—o—



# యామినీపూర్ణతిలకావిలాసము

## చతుర్థాశ్వాసము.



కం. శ్రీరామచంద్ర చంద్రసు
ధారాజిత కీర్తిసాంద్ర ♦ దశరథగోత్ర
క్షీరాబ్ధిపూర్ణచంద్ర కృ
పారసనిస్తంద్ర పుణ్య♦భవనమహీంద్రా.

వ. దేవా అవధరింపు మనంతరంబ. **2**

కం. పంకజహితుఁడు జపాశో
ణాంకితుఁడై యలరె శశిని♦శాలి వివాహా
లంకరిత దిగ్వధూధృత
కుంకుమరసభరితపూర్ణ♦కుంభం బనఁగన్. **3**

తే గీ. ఉగ్రకరుఁడైన యినునితో ♦ నిగ్రహించి
జనుల కెల్లను గడుచల్లఁ♦దనముఁ జూపు
రాజునకు నెదురేగెడి ♦ ప్రాణులనఁగ
నిడుపులిడసాగె తొలుదెస ♦ నీడలపుడు. **4**

ఉ. బారులుగట్టి గూళ్లకయి ♦ పాఱె మొగుల్ తెరువంటిపుల్గుబం
డారముజక్కవల్ మదిద♦డారపుటార్పిడె నెండమావులే
మేరలనుండనోడె ముది♦మేరలఁ గాములతేనిజూచి వే
సారెను దమ్మిలేమ వడ♦సారముగా వడసారమారఁగన్. **5**

సీ. క్రతుభుగ్విధద్వీపో♦ష్ఠిత పరక్ష్మాభృదా
ధిక్యకారణ రజో♦తేజు లనఁగ
చక్రవాకవియోగ ♦ సంతాపకీలికీ
లాకలాప ప్రవా♦ళంబు లనఁగ
హరిదంబురుహ దృక్స♦మాకర త్కాశ్మీర
1రసవసంతవిలాస ♦ రచన లనఁగ
అబ్ధిగర్వనిదర్శ♦నార్థ దిశార్వ్యాద
ర్శిత సూర్యదర్పణ♦ద్యుతు లనంగ
తే. గీ. నగణితాఖిలభూచక్ర ♦ మాక్రమించె
కాంచనాంభోజమణికింశు♦క ప్రవాళ
కోకనదబింబికాశోక♦కోరకప్ర
భాతపములు జరద్భాస్క♦రాతపములు.

చ. అదనునులోహకారుఁ డస♦మాంబకధారికి పుష్కరాగ్రసం
పద లిడు చక్రఘోరశిఖ♦పాక మొనర్చి మయూఖదంశికా
స్పదకలనంబునం గమిచి♦పట్టి పయోధిమహాగ్రిధారలో
పదనిడగూర్చెనో యనఁగ ♦ భానుఁడుగ్రుంకె క్రమక్రమంబునన్.
తే. గీ. పద్మినీకాంత పతి నెడ♦బాసి నపుడె
ముఖకళలులేక వంతల ♦ మునిఁగెనంతఁ
బద్మినీకాంత పతి నెడ♦బాసి నపుడె
ముఖకళలులేక వంతల ♦ మునుఁగకున్నె.

చ. పుటపరిపాకభావపరి♦పూర్ణతరాంబుమహాంతరాళ ప
ర్యటనవినిర్గతోన్మదభ♦రాలస సంగతభృంగరేఖలు
త్కటకలితాంధకార లతి♦కాముఖవైఖరు లొప్ప సర్వది
క్తటములఁ గానుపించె నసి♦తద్యుతి భానుఁడుగ్రుంకు నంతటన్.
ఉ. కమ్మనిపువ్వుఁదేనె తమి♦గ్రమ్మఁగఁ గ్రోలి సుఖించునంత సాం
ద్రమ్ముగఁ దమ్మిపుప్పొడిమ♦రందపుఁ బెందడినొంది దేటిమొ

పా. 1 రసవతంసవిలాస

త్తమ్ములు దమ్మిమొగ్గలతు♦దల్ చిగురంటఁగ బిగ్గబాఱి పైఁ
గ్రమ్మటలొప్ప మారవిశి♦ఖమ్ములబొట్టన ముల్కులో యనన్. 10

చ. కుముదభిదాతపప్రళయ♦కోరకితాంబురుహాంతరాళ సం
క్రమణవిపత్స్వనద్భ్రమర♦కల్పన లొప్ప వియద్రమార్కర
త్నముషితదుష్ప్రదోషచరి♦తం బది దెల్పననేహభర్త త
జ్జములగు నూత్నసంతమస♦సంతతి నిట్లరిబెట్టెనో యనన్. 11

సీ. హరిదబ్జరాజ్యసీ♦మాంతపంక్తి నెసంగు
పవడంపు నునుదీఁగె ♦ బారనంగ
తరుతంతువాయసం♦ధానితారుణతంతు
వర్ధనీముఖనిష్ప్ర♦వాణి యనఁగ
ధరణీసురార్ఘ్యప్ర♦దానబాణవిభిన్న
కుటిలార్కరిపురక్త♦కుల్య యనఁగ
తరణిసాధనలబ్ధ ♦ చరమాద్రివిద్వరో
న్నత దివ్యరత్నాప♦ణం బనంగ

తే. గీ. ప్రియావియోగసహాబ్జినీ♦ప్రేషితాను
రాగ మిది యన ఘనసాంధ్య♦రాగ మెసఁగె
నపరదిగ్భాసమానరే♦ఖాభియోగ్య
భాగ్య సంపద్విలాస వి♦భ్రమము మెఱయ. 12

ఉ. గాఢవియోగతాపధృతి ♦ గ్రాగి రథాంగవిహంగదంపతుల్
గూఢమనోనురాగరస♦గుంభన నబ్జసరస్తటాంతికా
రూఢవిభక్తి నొంది తఱి ♦ రోయుచు నుల్కఁజెలుంగు లిచ్చటల్
ప్రౌఢిమగాన నయ్యె నల ♦ పద్మినికిం బ్రియబాంధవంబుగన్. 13

శా. ఆవేళన్ నవదీపికానికరమ♦త్యంతంబు గన్పట్టె శో
భావేశంబున భావజన్మనిగమా♦భ్యాసప్రసంగాది స
ద్భావప్రక్రియ లందు సర్వగుణసం♦పద్దోషసంశోధనా
ర్థావిర్భావితకర్మసాక్షి సుమహ♦ప్రాంశంబు లట్లంతటన్. 14

సీ. అరుణప్రభాపాళి♦కామ్లానకైరవ
శ్రీమహాభోగ సం♦జీవకరణి

సమయావలోకనా♦సక్తమానసనాయి
కానాయకాప్తి సం♦ధానకరణి
ప్రత్యూహస్ఫూర్త్యసం♦భవహేతుయుక్తి ని
ర్వర్ణ ఖద్యోత సౌ♦వర్ణ కరణి
విపాత్రిర్ధ్యబాణ వి♦భిన్నసందేహ శై
థిల్యకల్యాణ వి♦శల్యకరణ
తే. గీ. సకలభూతప్రపంచ వి♦శ్రమవితరణి
జార చోర చకోర సం♦చారసరణి
తరణిజాకార రేఖావి♦ధానధరణి
ధరణి జరణించె తమితిర♦స్కరణి కరణి. 15

సీ. తనరాక చిరపుణ్య♦జన సుమనఃప్రమో
దావహదక్షదో♦హదము గాఁగ
తనరూపరేఖాది ♦ దర్శనం బఖిలభూ
జనులకు సారూప్య♦సరణి గాఁగ
తనవర్తనము సము♦ద్ధరణకౌశికరాజ్య
సౌఖ్య సంపద్విలా♦సంబు గాఁగ
తనమహోదయవృద్ధి ♦ వినుతసంధ్యావళీ
బలివిధానార్చన ♦ పదము గాఁగ
తే. గీ. వితరిణిఁగఁజూచి ప్రహ్లాద♦మతిభుజంగ
లోకబహువిధసౌఖ్యముఁ ♦ బ్రోఘినిడియ
తనుప్రమోదించు నట్లనఁ ♦ దనరె హరికి
నమరువటురూప మన గాఢ♦తమము తమము. 16

సీ. అంధకారకళింద♦జాంతహ్రదంబున
వికసించు తెలిగల్వ ♦ విరు లనంగ
జనులుసూచుట కబ్జ♦జన్ముఁ డంబరపాళి
ప్రతినిల్పు దైవతా♦కృతు లనంగ
సమయపయోబ్ధి భా♦స్కరమందరంబునఁ
దరచిన నెగయు తుం♦పర లనంగ

చండీశతాండవో♦త్సవవేళ దిక్సతుల్
జడిజల్లు ము త్తెంపు ♦ శౌస లనఁగ
తే. గీ. గోపగోవార్ధిపారద♦కుండమునను
సమయహయమున నెక్కి నిశావధూటి
రహినిశాఖండ మిడిన పై ♦గ్రిమ్మ మటుల
వెలయు తద్బిలములనఁగఁ దా♦రలు దనర్చె. 17

సీ. పరిపరివిధముల ♦ భ్రమనొందఁ జేయుచు
నన్యస్థలంబుల ♦ కరుగనీక
చను విచ్చి పేరంపు ♦ దినుసు లేర్పఱచుచు
మదిబాయకుండఁగ ♦ మచ్చు లొసఁగి
వలసి నిండారురతులఁ దూఁగఁ జేయుచు
చొక్కైన వేళల ♦ సరకు గొనుచు
(మిగుల నం తంత న♦మ్మిక జాయ లిచ్చుచు
బహువిధసౌఖ్యలా♦భములు గొనుచు)
తే. గీ. తగుచు నాణెంబు లెఱుఁగు వ♦ ర్తకుల పగిది
విటులతో గూడి విపణికా ♦ వీధు లందు
తమిని విహరింతు రాత్మవ♦ ర్తనలకుటిల
భాజనము లగు జారాంగ♦నా జనములు. 18

చ. పనిగొని మారుపోలికలు ♦ బన్ని జతల్ విడనాడి నెమ్మనం
బున భయసంభ్రమంబులు గు♦బుల్ కొన జాటిల మెల్లనేగి నే
ర్పునఁ జొరబాటి బల్ పసిమి♦బుల్పెటి మానసిసొమ్ము లుమ్మడిన్
గొనఁబడు నాసచే గడన♦గుబ్బెత సోఁకుడుముచ్చు లయ్యెడన్. 19

తే. గీ. కలఁకకలుముల జవరాలి ♦ కళలు గులుకు
విధువిధుల పెండ్లివేళను ♦ వెలయ నడుమ
సమయయాజ్ఞికుఁ డిడు నట్టి ♦ జవని కైన
తూర్పుదెస కొంత వెల్లనై ♦ తోఁచె నంత. 20

తే. గీ. సమయవనపాలకుఁడు పూర్వ♦సాల మనెడి
కుదటనిల్పిన కల్పకాం♦కురము లనఁగ

తళతళలమీఱఁటి కనఁబడెఁ ♦ జలివెలుంగు
నూత్నకిరణంబు లొక్కక్కొన్ని ♦ నూట నాట. 21

సీ. తిమిరాబ్ధిమగ్నని♦ర్భమధారుణీ సము
ద్ధరణలీలాఘృష్టి♦దంష్ట్రి మనఁగ
గగనభార్గవహ స్త♦కలితకఠోర కు
ఠారధారాగ్ర శృం♦గార మనఁగ
విరహిణీమృగవధా♦చరణాగతస్మరా
దృతపురోద్గత పుండ♦రీక మనఁగ
తిమిరదానవవధో♦త్సవహృత్సమయంపు
శౌరి చేకొని వచ్చు ♦ చక్రమనఁగ

తే. గీ. ప్రాక్శిఖరియష్టిపై ని స♦ర్వప్రపంచ
రాడ్రచిత సితదీప్తియం♦త్రం బనంగ
బింబరేఖార్ధసంపూర్ణ♦బింబ విశద
కాంతుఁ డుదయించె రోహిణీ♦కాంతుఁ డపుడు. 22

ఉ. చల్లదనంపు టల్లికల ♦ ఝల్లి జగజ్జనకల్పవల్లి గో
వల్లభమౌళిమల్లి సుర♦వల్లభదిగ్ధరణీశుతల్లి రే
మొల్లపు టల్లిబిల్లి వగ♦మొల్లపుజారుల నాగవెల్లి జా
బిల్లి చకోరపుఁ వలపుఁ♦బెండ్లిగ వెన్నెలవెల్లి వెల్వడెన్. 23

కం. బిలబిలపతి మృదుకరముల
జిలిబిలి గిలిగింత లిడిన ♦ జెలిమిదలిర్పన్
కిలకిల నవ్వె ననంగను
గొలకుల తెలిగలువ వలపు♦గులుకఁగఁ బూచెన్. 24

కం. చలువలరాయుని లోపల
వెలసిన లాంఛనము మెఱసె ♦ వెన్నెల నీట
న్మొలచిన తెలిదామరపైఁ
దొలఁగక మధుపానుచుండు ♦ తుమ్మెదయనఁగన్. 25

సీ. అరులపొం దరయుట ♦ నెరవుకా దని కాక
కొదమజక్కవకవల్ ♦ గూర్పలేవె

పంకజాతఖ్యాతిఁ ♦ బడియున్న వని కాక
తమ్ముల సిరివన్నెఁ ♦ దాల్పలేవె
తెలియ రాజానుమ♦తేధర్మ మని కాక
కలకాల మొకరీతి ♦ నిలుపలేవె
వితతరంధ్రాన్వేష♦ణత గూడ దని కాక
వివరముల్ బయలు గా♦వింపలేవె
తే. గీ. భువి నివి యటంచు లోకులు ♦ పొగడ నెగడి
మిగులజిగిబిగి దగు నిగ ♦ న్నిగల తొగల
తెగల వగ లెగయఁగా దిగి ♦ దగిలి జగము
లగణితంబుగ వెన్నెల ♦ లలముకొనియె. 26

చ. బలువిడినీరుగాఁ గరఁగి ♦ పాఱెడి జాబిలిరాలనీటికా
ల్వల నడుచక్కిఁ దిన్నెయల ♦ వ్రాలి ముదంబున పేరటాండ్రురన్
గొలిచి క్రొలంబుసామికిని ♦ గోర్కెనుపారముఁబెట్టి పండువె
న్నెల దమ పండుగామెతల ♦ నిల్చి సుఖించెఁ జకోరదంపతుల్. 27
తే. గీ. అపుడు మదనాభిరామరా ♦ జాత్మపుత్రి
నగరిచెంగటి పూఁదోఁట ♦ నడుమ నలరు
తలిరుపూజప్పరపు మేలు ♦ దవిలిపాల
వెల్లి వెలసెడి నవరత్న♦వేదిమీఁద. 28

చ. ఒనర మెఱుంగువెండితగ♦టున్పిన లీలల నిగ్గుదేఱు సం
తనపు టరుంగు నెల్లెడ సు♦ధాధవళద్యుతులొప్పఁ జంద్రికల్
చనవునఁ జల్లనై వలపు ♦ జల్లఁగఁ గమ్మదనంపుఁ దెమ్మెరల్
పనిగొని మెల్లిమెల్లి విర ♦ బారఁగఁ గూరిమి మేఱమీఱఁగన్. 29
సీ. గారాబుచెలుల వే ♦ ర్వేఱమచ్చికఁ బిల్చి
తగునట్లు మంచిగం♦ధములు పూసి
ఘుమఘుమలాడు గం♦ధములపుప్పొడి చల్లి
పన్నీటి రవసోన ♦ పైని జిల్కి
దట్టంపుతావి పూ♦దండలు సికజుట్టి
సౌభాగ్య భాగ్యలాం♦ఛనము లొసఁగి

కపురంపువీడెముల్ ♦ గల్మిమీఱఁగ నిడి
మణిచిత్రభూషణాం♦బరము లిచ్చి
తే. గీ. పనసతొనలను గజనిమ్మ♦పం డ్లనంటి
పండ్లు ద్రాక్షాఫలంబులు ♦ పాలపండ్లు
చూతఫలములు సీమఖ♦ర్జూరఫలము
లొసఁగి వాసంతికాపూజ ♦ లెసఁగఁజేసి. 30

చ. మధురఫలంబులున్ మధువు ♦ మామిడిపండ్లు రసావళుల్ సుమ
న్మథఫలముల్ సితేక్షురస♦మాధ్వికముల్ పటలాచ్ఛదుగ్ధముల్
దధి ఘృత పాయసాన్నములు ♦ దైవమనోహరభక్ష్యముల్ మనో
రథపరితృప్తి నందఱు క♦రంబలరార భుజించి రచ్చటన్. 31

వ. ఇట్లు సంపూర్ణచంద్రికోత్సవ కుతూహలాయమాన మానసు లగుచుఁ దాంబూలికాఖాదన వినోదంబులం దవిలి క్రీడింపుచుండ నందు నందంపుఁదిన్నియలగు కోమరుప్రాయంపుఁ గన్నియ లా రాజకుమారినిం జేరి ప్రియంపడి తమమనోభిప్రాయంబునకు సహాయంబుగా నిట్లనిరి. 32

తే. గీ. తోఁట నాడిన యలసట ♦ నీటఁదేలు
బడలికలు పండువెన్నెలల్ ♦ పఱచుమంచు
చలువలొగిజార ముఱిపెంపుఁ ♦ గలిమిమీఱ
మధువుఁ గొనుటకు నెనరిచ్చి ♦ మనుపుమమ్మ. 33

తే. గీ. అనుచుఁ బ్రియపడి వేఁడిన ♦ కనికరంపు
గొనలుసాగఁగ మధుకేళీ ♦ కనుమతించె
నందుఁ గొందఱు మానిను ♦ లాత్మభర్తృ
దారికనుగూడి వారిచి♦త్రములు గనుచు. 34

కం. ఉన్నంతట బల్వెన్నెల
మున్నరికపుకన్నె లొక్క♦మొగిఁ జక్రాకా
రోన్నతిఁ గూర్చుండిరి త
త్సన్నిధి శశిరేఖ కలరు ♦ తారాళిక్రియన్. 35

వ. అయ్యవసరంబున 36

చ. అలరులతోఁటనాడు నవు ♦ డారసి యారసికావతంస లి
చ్చుల నెడగూర్చి తెచ్చిన ర♦సాలరసాలమధూకమన్మథా
మలకలవంగకల్పక ఘు♦మంఘుమితామలకోమలాసవో
త్పలదళపూర్ణకుంభ మొక♦భామ సభాంతరసీమ నుంచినన్. 37

తే. గీ. తళుక్కువజ్రంపు గిన్నెలఁ ♦ దార్చిమధువు
గ్రోలి రపు డించుకించుక ♦ కొసరి కొసరి
తనిసి రొకకొంత కొంతసే ♦ పనువుమీఱ
వారు దమ నేర్పరాలిని ♦ పేరుకొనుచు. 38

తే. గీ. ఘటమునిండార మద్యంపుఁ ♦ గసటుదేర్చి
పొసఁగఁ జెంగల్వపూవులు ♦ పువ్వుగట్టి
తెచ్చి మముతృప్తులుగఁజేయ ♦ వచ్చినట్టి
మోహినీదేవి వీవమ్మ ♦ ముద్దుగుమ్మ. 39

చ. అని కొనియాడుచుం గులుకు♦టాముని మైవరపూని పూనికల్
గొన గొనసాగ సోగకనుఁ♦గోనలఁ గోపుదలిర్ప మోవిఠీ
విని జెలిజాలు పొల్పెగయఁ ♦ బేరడిమీఱ మొగంబు మేలుగా
ననివలపుల్ నిటూర్పు లెడ♦నవ్వులు వింతలుసేయ నయ్యెడన్. 40

సీ. గడితంపుఁ దళుక్కుచు♦క్కలలోన కలలోన
నెనసితి వివరింపు ♦ మనియె నొకతె
బలితంపు పంపువె♦న్నెలఁ జూచి నెలజూచి
వికవిక నగవు గా♦వించె నొకతె
కలునంటు వలపు ర♦వ్వలగొంచు వలగొంచు
నెడలె సోఁక దటంచు ♦ నుడివె నొకతె
మరునితూపులు నడిం♦పగనాటి పగనాటి
యున్నవాఁ డని చూసె ♦ సన్న నొకతె

తే. గీ. చంచలతఁ జెంది తొడలు వా♦యించుకొనుచు
గుఁబ్బిడ్డదిబ్బిప్పుచు నాడుచు ♦ గోలలిడుచు
త్రుళ్ళిపడుచును బలుమారు ♦ తూలిపడుచు
మించి వెడవెడపాటు గా♦వించె నొకతె. 41

సీ. చందమామకు దీని ♦ సారంపుగందంపు
మందుఁ జేసిన గందు ♦ మానకున్నె
సకలంబుగల్గు వ♦సంతున కిది దాఁ్రివ
గల్గి నంతనె సంతు ♦ గల్గకున్నె
మదనుఁడీ మధువాని ♦ మదనారి నెదిరిన
నిటలాంబకాగ్నికి ♦ నిలువకున్నె
మలియానిలుండు వే♦మఱుదీని చవిగొన్న
కొమరుప్రాయంపురూపు ♦ నమరకున్నె
తే. గీ. మాటలేటికి యీలాటి ♦ మధువు వారి
కేమిటికిఁ గల్గు మననోచు ♦ నోముకల్మి
నిట్టి మదిరారసంబు బెం♦పెసఁగ దొరికె
నహహా మనభాగ్య మని సోలి ♦ హాళిఁ దేలి. 42

తే. గీ. దీనిమహిమంబు బలభద్రి ♦ దేవుఁ డెఱుఁగుఁ
గాని యితరు లెఱుంగుట ♦ కల్ల సుమ్ము
తెల్ల మిది నమ్మకుండిన ♦ ద్రిదశులైన
వార లాసింతురే సుధా♦ధారలకును. 43

చ. అరమరలేక యింద్రుఁడు సు♦రాధిపుఁడై క్రతుభోక్తగాని తాఁ
నెఱుఁగఁడు దీనఁగల్గు రుచు ♦ లెప్పుడు చప్పిడి గొప్ప జెప్పుచున్
దిరిపెపుసాములై బలుప్ర♦తిష్ఠల బొల్పుదు వేసదారులై
తిరిగెడి బాప లీమహిమ ♦ దెల్పెద రన్న నెఱుంగవచ్చునే. 44

వ. అని మఱియుం దమలోన.

సీ. తనగిన్నె లిది దాఁచి♦కొనె జూడు మని దాని
బటువుగుబ్బలు కేలఁ ♦ బట్టె నొకతె
మదము పెంపున మేను ♦ మఱచియుండిన దాని
మగపోడుములు సేయ ♦ మొగిచె నొకతె
తడబాటునడలప్పెఁ ♦ బడనూగుచో దాని
బిగువుగుబ్బల వల్వ ♦ దిగిచె నొకతె

బలిమి నబ్బ బ్బని ♦ పలవరించెడి దాని
చెవిఁజేరి సమ్మతిఁ ♦ జెప్పె నొకతె
తే. గీ. వెఱఁగుపడుదాని నొకరీతి ♦ వెక్కఁజేరి
రిమ్మదిరుగఁగఁ గడుబొబ్బ♦రించె నొకతె
దాని కులికిన చడిఁగాంచి ♦ తత్క్షణమున
జరిచె చేకొద్ది నొకతె మ♦జ్జారెయంచు. 45

తే. గీ. సొక్కి సోలుచు వలపుటా♦మెక్కి నెక్కి
దిక్కులీక్షించి మరుఁడు దే♦రెక్కివచ్చె
నిక్క మిది యక్కలార య♦మ్మక్క వాని
నెక్కసము బల్కుఁ డని దాను ♦ వెక్కిరించె. 46

చ. వలువఁ దొలంగఁజేయఁ దగ♦వా తగవా తగవాలకింపు గ
న్వలిదొరబావ సైఁగ గన♦రా గనరా గనరాని ప్రోడఁ జూ
రల గిలిగింత వేడుకల♦రాక లరాకల రాయరాకు మే
రలువిడనాడి యెంచ సగ ♦ రాసగరా నగరాని నవ్వెడిన్. 47

కం. అదరింపుచు జైవ్రులమదిఁ
జెదరింపుచు మదముగవిసి ♦ చెలు లలముకొనన్
బెదరింపుచు నెదిరింపుచు
నిదురింపుచుఁ జిత్రలీల ♦ నెలకొనియున్నన్. 48

వ. ఇట్లనేకప్రకారంబులం గుసుమాసవరసాస్వాదనోన్మాద మనోవికారంబులం బొరలు సఖీనికరంబులం గనుంగొని కుమారికారత్నం బతిహితభిషగ్వరులం బిలిపించి తద్వికారవిదూరంబులగు నౌషధోపచారంబుల సేదదేరునట్లుగాఁ గావించి సముచితాలాపంబుల నందఱ నిజమందిరంబుల కనిపి తనవిద్యానికేతనాంతరంబుఁ జేరంజని. 49

సీ. పచ్చసీడల జి గె♦ర్పడు నిగారపు తరి
విడి జీవదంతంపు ♦ వింతకోళ్ల
పట్టెల జలతారు♦పట్టెడ బిగువార
బవడంపు బోదెగం♦బముల తుదల
పై దోమతెర వన్నె♦పందిరి చందువా

ముత్యాలజాలరు ♦ ముద్దుగుల్క-
ముఖమాలుపఱపు సొం♦పులుగుల్కు- విరులత
లాడ తగటులోడు ♦ చూడఁదగిన

తే. గీ. వన్నెలెక్కాలు దిగువ తి♦వాసి మడుపు
లిడిన చిటితబుకు సురటి ♦ పడిగమంబు
లిడిన కూజాపుచెంబు లె ♦ ల్లెడలదివ్వె
లలరు నారాచకాన్పు మే ♦ లలరుపాన్పు. 50

వ. మఱియు చిత్రాంబరవితానంబుల మనోహరసౌరభోన్మేదుర విలాసంబుల విలక్ష్యమాణాతి చిత్రబంధురబంధాంచిత పాంచాలికానిచయం బుల విశాలపార్శ్వావలంబమానహరిద్రత్ననిర్మిత కీరశారికాపంజరంబుల సముచితోపచారయంత్రపుత్రికాసముదయంబుల ననేక మంగళశృంగార లాంఛనంబుల నతిసుందరం బగు కేళికామందిరంబు కరణి ప్రబోధం బగు విద్యాసౌధంబునందు నమరించిన యవనికాసమీపంబున ననల్పంబుగాఁ గల్పిం చిన కుసుమతల్పంబుపై శయనించి సుఖాయత్తచిత్తయై చిత్తజగ్రంథార్థంబు మనోత్సాహంబుగా నూహింపుచుండె నయ్యవసరంబున 51

చ. తమమతిరీతి బ్రాహ్మణబు♦ధప్రవరుండు సమస్తనిత్యకృ
త్యముల సమగ్రతల్ నడిపి ♦ దైవతపూజ లొనర్చి కామినీ
సముదితమన్మథుం డనఁగ ♦ సారతరోజ్జ్వలమూర్తియై యథా
క్రమమున మేడఁ జేరి సుము♦ఖస్థితి తల్పముపై వసించియున్. 52

ఉ. లీలదలిర్ప నట్లు బవ♦ళించి కవీంద్రుఁడు సౌధభిత్తికా
జాలకవీథులందుఁ గని ♦ సంతసమంది రయంబుసం జగ
జ్జాలముమెచ్చు వర్ణనలు ♦ చక్కఁగఁజేయఁ దొడంగె మన్మథా
భీలకరాళతాప ఘన♦బీజసరోజ్జ్వలపూర్ణచంద్రునిన్. 53

మ. అదె చంద్రుఁడుదయించె చూడు రమణీ♦యాకాశవాపీసిత
చ్ఛదపద్మంబు రమాకుమారవిజ♦యాస్త్రశ్రేణికాకర్షణా
స్పదవజ్రోపలశాణచక్రమసదృ♦క్సంధ్యావధూహస్తకం
దదళాడంబరకందుకంబు శరదు♦ద్యద్బింబశోభాకృతిన్. 54

సీ. హరిహయదిగ్భాగ ♦ మతిచిత్రతరరాగ
మరతాళికాహార్ధ♦మురుసముద్ర
మచిరనిద్రావేశ ♦ మంభోజినీకోశ
మపహృత్ప్రశంస మ♦త్యంధతమస
మరివిహంగమలోక ♦ మభినవోదయశోక
మాకాశ మనవర♦తావకాశ
మవిరళకుముదాఘ ♦ మాహ్లాదకామోఘ
మమితజీవంజీవ ♦ మమృతభావ
తే. గీ. మతనుదర్ప మనల్పమై ♦ యతిశయిల్ల
చల్లదన మెల్లకరములఁ ♦ జల్లుకొనుచు
వచ్చె నదిచూడు శర్వరీ ♦ వల్లభుండు
చారుతరగాత్ర సమదచ♦కోరనేత్ర. 55
ఆ. వె. ఉదయమయ్యెఁ జూడు ♦ ముత్పలదళనేత్రి
శంబరారి బాణ♦శాణచక్ర
నికరమెన్న యామి♦నీకామినీకర్ణ
కుండలంబు చంద్ర♦మండలంబు. 56
తే. గీ. శంబరఘ్నాగమప్రణ♦వంబు తిమిర
సమదవారణ మృగరాజ ♦ శాబకంబు
శంకరాంబరఘోణి దం♦ష్ట్రాంకురంబు
బింబ మింపొందె నైందవం ♦ బంబరమున.
మ. ఇదె రమ్యోదయకందరాగ్రమునఁ ♦ బైనింపొందె నిందీవర
చ్ఛదనిర్భేదనమిక్షుకార్ముకజడాం♦శచ్ఛేదనం బభ్రసం
విదితధ్వాంతనివారణంబు విరహా♦విర్భూతికామారణం
బుదయాశాసతి కర్ణకుండలమనిం♦ద్యోత్స్నమండలంబాబ్జమై. 58
చ. కలువలెసంగఁ దామరలు ♦ గందిముడుంగ దెసల్ వెలుంగ వె
న్నెలలు మెలంగ జక్కవలు♦ నెక్కొనిసేగిమునుంగఁ జీఁకటుల్
బలిమినడంగ వేఁగొమరుఁ ♦ బ్రాయపువారల డెందమందమై
పొలుపలరంగ వారినిధి ♦ పొంగఁగఁజేయుచు రాజు రాజిలెన్. 59

తే. గీ. మృగరథాంగైకకలనచే ♦ నడుమనంటు
కజ్జలం బని యొకభంగిఁ ♦ గానుపించు
నెలకు నెలకొన్న నీలీలఁ ♦ దలఁచిచూడ
రోహిణీకుచమృగమదా♦రోపణంబు. 60

కం. ఆకాశశాణమున రా
శీకృతమగు చందనంబు ♦ సితకరబింబం
బాకీర్ణాధారము తన్మ
ధ్యాకలితమృగీమదౌఘ ♦ మగు చిహ్నంబుల్. 61

తే. గీ. గగనమండల మిదిగాదు ♦ కలశవార్ధి
తార లివిగావు నూత్నడిం♦డీరకణము
లితఁడు చంద్రుఁడుగాఁడు పుం♦జితఫణీంద్రుఁ
డంక మిదిగాదు శయనించి ♦ నట్టి శౌరి. 62

చ. అని నృపకన్యకామణికి ♦ నవ్విబుధేంద్రుఁడు పూర్ణచంద్రవ
ర్ణన లుపదేశభావము ల♦నన్ బహుభంగులనేర్పరించి యం
తను దని వింతదీఱని మ♦నంబున సంతసమొప్ప నెండి వ
ర్ణన గొనె చంద్రతేజమును ♦ నాభికమన్మథతాపబీజముల్. 63

చ. హరిణమయూఖ నీయుదర ♦ మందలికందు జగంబు నెవ్వారె
వ్వరు శశకృష్ణసారవట ♦ నైఖరులచ్చుపడంగ వర్ణనల్
దరమిర చింతు రేను మది ♦ దల్చెద దివ్యవిలాస భావికా
ధరమధుకల్పనార్థమయి ♦ ధాతసుధాస్తికొనర్చు గర్తగన్. 64

. అంకముగాఁగ కొంద అమృ♦తాంబుధిపంకముగాఁగఁ గొందఱే
ణాంకముగాఁగఁ గొంద అచ♦లాసితకాంతిగఁ గొంద ఱెన్నుచున్
శంకలు వల్కుచుందురు శ♦శాంకభవజ్జఠరాంతరాళనీ
లాంకముఁ జూచి రాత్రికబ♦ళాంధతమం బని నేఁ దలంచెదన్. 65

మ. అని యిబ్భంగిని బ్రాహ్మణప్రవరుఁ ♦ డుద్యత్పూర్ణరాకాకళ
త్రుని వర్ణించుట లాలకించి యితఁడం♦ధుం డంచు మాతండ్రి చె
ప్పిన నే నట్లుగ నమ్మికొంటి నిదిరూ♦పింపన్ మహాశ్చర్య మి
ప్పనిఁ జిత్తంబున నూహసేయఁ దగు సం♦భాషింపఁగా నెంతయున్. 66

వ. అని యామినీపూర్ణతిలకారత్నంబు కళావతీరత్నంబు గావున భావజ్ఞయై తనమనంబున నిది మదీయరూపలావణ్య శృంగారరచనాకల్పనావలోకనోత్సవ యువజననిరీక్షణోద్ఘాటం బగు పటకవాటంబు వాటంబుగాఁ జాఁపఁబఱచి పఱిచితప్రధానమేధావిశేషబోధాసామర్థ్యంబునం గాణత్వకృత్రిమంబుఁ గల్పించినిల్చిన గురునిజాననంబునకుం దార్కాణంబుగాఁ గళంకాంకితేందుమండలాభివర్ణన ప్రమాణంబు గన్పడె నితం డంధుండైన నస్మదీయ వ్రతభంగం బగు ననంధుండైన గురుచరణారవింద దర్శనంబునం గొఱంత గల్గనేర దితనిం దర్శింతు నని నిశ్చయించి యతిప్రయత్నంబున. 67

ఉ. తల్పమునందు లేచి ప్రము♦దంబుననిల్చి తదంతరాళికా
కల్పితసాంద్రచంద్రపట♦కాండముపై కరయుగ్మముంచి సం
కల్పభవస్వరూపుఁడగు ♦ కంజభవాన్వయవార్ధిచంద్రుపై
నిల్పిన దృష్టిఁ జూచె రజ♦నీపతిఁ జూచిన రోహిణిప్రభన్. 68

తే. గీ. యామినీపూర్ణతిలక బి♦ల్హణుఁడు వేడ్కఁ
దనరఁ దమలోన నన్యోన్య♦తరముగాఁగఁ
జూచి సప్పాటి వలరాజు ♦ కాచి కాచి
వేచితలయూఁచి తమి రేచఁ ♦ జూచె నపుడు. 69

వ. వెండియు మహోద్దండపుండ్రేక్షుధనుర్ధరుం డగు మదనుం డిదియు సమయం బని నింతాంతామోదితస్వాంతుం డగుచు గాటంపు తేటపన్నీట నీటుగా మజ్జనంబుగావించి గొజ్జగలనజ్జుసీట గుజ్జుపదనిడి మంచిగంధపు మైపూఁతలందంబుగాఁ బూసి పచ్చకప్పురపుఁ బుప్పొడి గుప్పునుప్పతిలు వలపులొప్పఁగాఁ గప్పుకొను చొప్పునం గుప్పి గోవకస్తూరిరేఖ నెన్నొసల మిసమిస లాడుపసిమిని మిసిమిదేఱ దీరుమీఱిన మగరాలజగానిగారంపు కెంపు కెంపు రవరవలొదవిన సుతారంపుపనిమెఱుంగులం బొంగారు బంగారు సింగారపుబాగుల పగులు నిగన్నిగలమెండుకొను గండభాగంబులం దాండవింపు నింపు సొంపునుం బెంపు జిగిపెంపునంగనుపట్టు హారంబట్టుబొందునం బొందుపడంగట్టిన దిట్టంపుసోగపెన్నెరులసిగ వగలుగులుక తళుకులొలుకు కడానిబన్నసరంబు లురువైన నవమాలిమాలికలు కంధరంబునం ధరియించి యించుకేనియుం గొఱంతలేక రంజిలు మంజులచ్ఛటాపుంజంబులైన యప

రంజిగొలుసులజత కరంబులంబూని పూనిమెఱుంగిడిన వజ్రపుటుంగరంబు లం గుళులందాల్చి మేల్జిలికెడి వెడఁదరతనంపు జికిలిబొమిడికంబు శిరంబునం దొరంగలింపఁ గెంపుసంపదలఁ బింపిళ్లుగూయు జంద్రకావిచేలంబులు విలా సంబులేర్పడం గట్టి సన్నంపుహొంందగటుచెల్వగు నిల్వుటంగీ బెడంగుగాఁ దొడఁగి జరిపూవులశాల్ నడికట్టు గట్టి మిటారంపుచికిలిగేదంగి క్రొన్నన కొటాకుకటారీ డాపక్కమొలను జెక్కి చొక్కంపు దమ్మికెంపుల గూర్పిడిన పిడి నేర్పడు బెడిదంపుతళుకుఁ జెంగల్వరేకుబాకు కుడినిడి గ్రొందలిరువాలు వ్రాలుకై కక్షికమాలికావలంబనంబు దీపింప గొప్పజొప్పికలు కెందమ్మి పలక డాకేలఁబూని లేమావిజివుర్చల్లెంబుల నుల్లసితమల్లికాకోశశతఘ్నికాశి యంత్రంబుల నిరంతరరణత్ప్రమదషట్చరణగుణాభరణ వల్లికాప్రసవరసాల దండ కోదండంబు నమందారవిందమాకందకుందేందీవరాది నిశితమార్గణగణ పరిపూర్ణతూణప్రముఖ నిఖిలప్రధనసాధనంబుల సుయోధనుం డన మీనకేత నుం డిట్టి వేషధారణంబున దిగ్విజయంబు గైకొన సమకట్టి యనంతశుభలక్షు ణాక్షీణజవనైకరూప సమున్నతానుకూలగుణంబు లరసి తెచ్చిన సమదశుక ప్రామాణికంబులం బూన్చిన సుగంధబంధురగంధవాహస్యందనంబునం బొందు పఱచిన విశాలమాలతీకుసుమపీఠంబుపయిం గూర్చుండి హాళిఁబైకొన వాహ్యాళి వెడలివచ్చునెడ సరోజకర్ణకోదారభేరీధణంధణనినాదంబుల చిరవిర హిణీమనోచ్ఛేదంబుగా మ్రోయ శారికాపటహనిస్వనంబులు జెలంగ నవ రసాలకిసలయోత్ఖాదనావలేపనాన్యభృత్కాహళీప్రఘోషంబు యువజన మనశ్శోషంబుగా మొరయ విదళదరవిందస్యందమకరంద బిందుసందోహ విహారామందతుందిలేందిందిర వందిజనకైవారంబు లెసంగ శిరుమలై గుంపు లొ ంభేల్లనం గొండకూక లేకంబుగా వ్రేయుచు చకోర కీరశారికా పిక చంచరీక మయూర మానసౌక పారావతాది విహంగంబు లంబరంబునకు గ్రొవ్వమీరి రివ్వునవెగసి సంకేతంబుగా నన్యోన్యముఖప్రముఖ బంధురభుజబంధ నింబంధ నోల్లుంఠితప్రదీనక్రమంబుల భూభాగంబునకున్ వ్రాలి పొగిపొంను కోడె ప్రాయంపు జట్టీలపోల్కె సామునెఱపుచు మహోన్మాదస్వైరగమనంబుల సేనాసముదయంబున కెచ్చరికంబురికొల్పుచు సేనాముఖంబున నడువ సకల శకుంతసంతాన సమేతుండై వసంతుండు సేనానాయకత్వంబు సేయ మెఱుంగు

నెండి యీాటెల తెలుంగునఁ దళ్తత్తళాయమాన మానితాస్తోకతరుణకిరణం బుల ధరణిం బురుణింపుచు జంద్రుండు నెల్లదిక్కులం దెల్లదనంబు నివ్వటిల్లఁ బండువెన్నెల రేవెల్లు వెల్లుచందంబునం గాయ గండుమీరి దండుదరలివచ్చు నెడనెడవిదాహం బైన నలరు పూఁదోఁట లేమావిమోక జప్పరంబుల నిల్చి సేదదీర లేఁతపూఁదేనె పానంబుసేయు కలన కన్గవకెంపుమిన్కు లగ్నికణంబు లుగా గురియ గుసుమాసవపాన ఘూర్ణాయమాన లోచనుండు గావున నితాంతరోష సమ్మిళితాంతరంగుండై విరహులపయిం దన బలంబులం బురి కొల్పుచు రదనంబులు గీఁటుచు విశ్వరూపంబు దాల్చిన పగిది జగంబెల్లఁ దన్మయంబుఁ గావింపుచు సరదంబుడిగ్గి యప్పుడు. 70

సీ. జలజలవిచ్చు సన్నవిర♦జాజుల కుచ్చులదమ్మి పల్లము
త్పలములసక్కరల్ చికిలి♦దండలు సంపంగి గిల్కుటందియల్
తలిరులమొత్తె లేఁతగిసి♦దంటవిరుల్ దగువాగెపచ్చరే
కుల విరిబంతి మోము సిరి♦గుల్కెడిచిల్క హుమావిహారుఁడై. 71

కం. సుటుపాలుఁగొలిపి విరహుల
సుటువాలంగఁ జేయ బోదు♦నడుపుచు నల్లం
తట మలిసించుచు మించుచుఁ
దటుకున నొకచోటఁ బొంచి ♦ తమి నిగుడంగన్. 72

చ. అలరుతుపాకిలోన మరు♦సారెడి పుప్పొడిమందు నించి ర
వ్వలబరి దేఁటిగుం పొప్పఁగ ♦ నన్నెసళాకున సంఘటించి రం
జిలు మృగనాభిరంజకముఁ ♦ జేసి యశోకలతాంతవహ్ని దా
కొలిపి కుచాంతరంబు గురి♦గూర్చి గుభీమన నేసి యేసియున్. 73

చ. తగఁ జిగురాకువింట సరు♦దారగ తామరతూటినూలు నా
రిగ బిగియించి చాంకృతులు ♦ రిమ్మలువారఁగఁ జిమ్మరేగి తీ
రుగ మగటేటిరెక్కల గ♦రుల్గల సన్నపువన్నె వాడిదే
రిగ మొగియించు ముద్గరశ♦రాది యమోఘశిలీముఖంబులన్. 74

కం. తటుకున సమరిచి యలయిం
పుటకై పుంఖానుపుంఖ♦ముగ వారలఁ దా

నటు కాకటు నిటు కాకటు
కటగటమనఁ బింజపింజ ♦ గాడఁగ నేసెన్. 75

చ. వడివడి మారుఁడేయు గడు♦వాడిమి క్రొన్ననగోలబంతు లొ
త్తుడురొదఁ జేయుతుమ్మెదల ♦ దొమ్మిచలంతులు నెమ్మిగంతులె
ప్పుడు నుడివోని రాచిలుక♦మూఁకల రంతులు గాడ్పుతంతు లా
రడి మటుమాయవింతలు వి♦రాళముగొల్ప బిరాన నిద్దఱున్. 76

ఆ. వె. మూర్ఛఁజెంది తెలిసి ♦ యోర్చిలోనదిటంబుఁ
జేర్చి తమకు మేర♦దీర్చి వలపు
గూర్చి మరుని మనసు♦మార్చు జాబిలి నెగ్గు
బేర్చు మధుపవనుల♦గూర్చి యనిరి. 77

సీ. ఘనసుమనోధర్మ♦కలనచేఁ బ్రకటించి
కలితవిసారల♦క్షణత మించి
మధుసూదనగుణా స్తి ♦ మానక వర్తించి
యసమాంబకఖ్యాతి ♦ నతిశయించి
శంబరాహితవృత్తి ♦ సహజంబుగనటించి
యతను సమాఖ్యచే ♦ సందగించి
పరమరహస్యమం♦దిరసంస్థితి వహించి
గంధవాహవిమాన ♦ గతులుగాంచి

తే. గీ. నట్టి పౌరుషశాలిపై ♦ నట్టి నీకుఁ
దగవియోగుల గుదిగూర్చుఁ ♦ దలఁచు టెంత
వింత నీవంటి జగదేక♦వీరుఁ డేడి
బహులతాంతపరిత్రాణ ♦ పంచబాణ. 78

ఉ. అంటిన గందుతూపు బయ♦లంటిన గొంకుహయంబు బిగ్గరన్
వెంటనఁ దుంటవిల్లు బెదు♦రంటినవిచ్చు బలంబుగల్గి పే
రంటినబంట వంచు సద♦రంటినదంటలు దచ్చికంటి ము
క్కంటియు దమ్మిగంటి తెర♦గంటి దొరల్ తెరగంటిరంగజా. 79

చ. విరహులనేఁచ నీకు బరు♦వే బరువేబరువేలవేలముల్
దరుమగ మేలుగూడవల♦దా వలదావల దారిపాంథులన్

దరిమిన పాపవకార మద♦నా మదనామదనాథనాథ దు
ర్భరభరణంబు గాంచు దన♦పై దనపై దనపైక పైనికా. 80

మ. పొలుపొందం దృఢశక్తి యుక్తి విలస♦ద్భ్రాజిచాపముల్ నేత్రప
ద్మలసమార్గణముల్ సుదృష్టిసితశ♦స్త్రశ్రేణికల్ పుష్పకో
మలగంధానిలచిత్రయానవితతుల్ ♦ మందాక్షవర్మాద్యముల్
దొల్లుటం గానుకలంది నన్మనుప ప్ర♦ద్యుమ్నాఖ్య విఖ్యాత్మకా. 81

ఉ. చక్కెర లుక్కెరల్మెదిచి ♦ చక్కఁగఁ జిక్కనిపాలమీఁగడల్
మెక్కఁగఁజేసి చిక్కడఁచి ♦ మిక్కిలిమక్కువదక్కి పచ్చడాల్
గ్రక్కడి రెక్క లుక్కడరఁ ♦ గ్రక్కన దిక్కులకెక్కియాడ బు
ల్పెక్కడి పక్కిచిక్కగవ♦పట్టెడ ♦ కానుక మెచ్చుమన్మథా. 82

ఉ. కాముకసైరి నీవు నిశి♦కాముకుఁ డాతఁడు సోమహృద్భల
గ్రాముఁడ నీవు పూర్ణతర♦సోమసమాఖ్యుఁ డతండు పద్మకుం
జ్రేమసుతుండ నీవు విను♦రీకృతపద్ముఁ డతండు నయ్యయో
హామికిబల్లునా దృఢత♦రాంగునితోడ ననంగ సఖ్యముల్. 83

ఆ. వె. మేనమామ యనుచు ♦ మేళంబు శశితోడ
గూడి నంత మీఁదఁ ♦ గీడువచ్చు
దేశములను "సర్వ♦నాశాయ మాతుల"
యనెడి నుడువు వినవె ♦ మనసిజాత. 84

చ. తళతళవాలు వాలువిరి♦దండల దండలపొంచిపొంచి ర
వ్వల వలగట్టి గట్టిమది♦వై మదివై సుకుమారమారకో
మల మలయాలయప్రియత♦మారుత మారుతయానయాన నీ
గొలగొల లింక నింకనన♦గోలల గోలలనేయ నాయమా. 85

కం. మదనా సమసుమశరముల
నెదనా టననేయ మాన ♦ వేమిర యిది గా
డదనా శశివదనా నీ
కదనా నవహీరరదన ♦ హారకృతకదనా. 86

మ. కమనీయాదృతశాలిశౌర్యఖిలలో♦కానందసంధాత్రి శ్రీ
రమకుం బుత్త్రుఁడవై సముజ్జ్వలమహో♦రాజ్యాభిషిక్తుండవై

ప్రియముదోద్వంశగుణంబుఁ బోవిడిచి దు♦ర్వారాసవోన్మత్తదు
ర్గమచండాలగుణంబు గైకొనుట వే♦డ్కా నీకు సాంధ్యాంతకా. 87

సీ. జగమెల్లఁ దానయై ♦ జగడంబుఁ జూపుచుఁ
బాగఁకోందు వేచేతు♦లుఁగలజోదు
ఒకచోట నిల్వక ♦ సకలంబుఁ జెరలాడి
పరులదృష్టికి పట్టు♦పడని రథము
వేలు నూరులు మొనల్ ♦ వెలయుచుండెడు చిల్క
గములు నిండారు చో♦క్కంపుదోనలు
ఎపుడుసూచినఁ గను ♦ లెట్టఁ జేయుచుఁ బండ్లు
గొఱుకుచుండెడి నల్ల ♦ కఱుకుమూఁక
తే. గీ. లేకమయి పుట్టుకొని మారు♦లేక తనిసి
రాయుఁడై యున్న బలుచేవ ♦ సేయుసామి
తోటి పోరాటసలిపిన ♦ నాటిసిగ్గు
పాటుచాలదె నీకు నీ♦రాటలింగ. 88

చ. పగఁగొనిశంబరుండుదధి♦పాలుగఁజేసిననాఁడు రుద్రుఁ డే
పుగఁ గనుమంటలం గరుగఁ ♦ బూనిననాఁ డిటువాడిదూలి నేఁ
డగపడి తౌర మార పథి♦కావళి పాపఫలంబొ లేక ని
న్నొగిఁ గనుతల్లి కడ్పుచల♦నో రతికున్నక తాళిబల్మియో. 89

కం. బలువిరహులపాలిటికే
విలుకాఁడవొ నీవు నిశిత♦విశిఖవితతుల
న్యుల గాడవొ "చెడిబ్రతికిన
కలిమి"గదా గెలుపుటాస ♦ కామవిలాసా. 90

సీ. వెడవెడ నీవిల్లు ♦ విరిగి మంటనడంగ
హెచ్చు నీశరములు ♦ విచ్చిపోను
వడి నీవు దళవాయి ♦ యడపుట్టి చరియింప
బడిబడి నీపౌజు ♦ బయలువెర్ల
వడిదప్పి నీచేతి ♦ వాలు వాడిఁదొలంగ
మొనసి నీ యరదంబు ♦ మూలఁబట్టఁ

గొంకుచు నీ తేజి ♦ సంకిలిఁ బడియుండ
నీ టెక్కెమెపుడు న♦ట్టేటఁ గలియ
తే. గీ. మొగ్గబారకు నీపూన్కి ♦ బుగ్గిగాను
ముగ్ధలను నేచు పాతక♦మున వియోగి
మానవామిత్రి నీరూపు ♦ మండిపోను
దుండగంబేల మారశి♦ఖండిఁబోల. 91

తే. గీ. గాలములఁదీసి నీడాలుఁ ♦ గాలజేసి
మేలుతూపుల మాలల ♦ పాలొనర్తు
పంతమునఁ బీల్చి పిప్పిగా♦వింతు విల్లు
ధూళిగట్టింతు నరదంబు ♦ దోలఁగుమార. 92

కం. అని చతురుపాయములఁ గ్రొ
న్ననవిలుతుని దూలనాడి ♦ నాళీకకళా
వన కేళీ ఘృణిపాళీ
జనితాళీ మధునివిధుని ♦ చతురతఁబలుకన్. 93

కం. అలరులవిలుకానికి నీ
వలర సహాయంబవగుచు ♦ నయ్యెయొ నీ వి
ట్లలమి తెరువరులనేచుట
వలరాయనికన్న మంచి♦వాఁడవె చంద్రా. 94

ఉ. నాటినవేడ్కతోఁ బొడము♦నాటి నినుంగని నీకుఁగాన్కగా
నూటికి నూలుపోఁగనుట ♦ నూల్కొనభక్తి సమర్పణంబుగా
మాటికి మ్రొక్కి వేఁడుకొను♦మాట దలంప వటుండనిమ్మొ మో
మాటపుత్రోవ మర్వఁదర♦మా నెఱమానిసి కెందు నబ్ధిజా. 9!

కం. సజ్జనితుఁడనుచు నల్లుని
బుజ్జగముల కబ్బఁబోకు ♦ పూర్వమునందున్
ముజ్జగములెల్లఁ జెలిసిన
తజ్జనకుని కథలు వినవె ♦ తరుణశశాంకా. 9

సీ. సరసకళాపూప♦సంపన్నుఁ డనుటకు
పద్మినీప్రియలీలఁ ♦ బరఁగియున్న

చల్లనివెల్గు రం♦జిల్లువాఁడనుటకు
రాజరత్నముల గ♦రంపకున్న
కువలయానందంబుఁ ♦ గూర్చువాఁ డనుటకు
చక్రానురోధంబు ♦ సలుపకున్న
సన్మార్గవర్తనో♦త్సవశాలి యనుటకు
తారానుషంగంబుఁ ♦ దలఁపకున్న

తే. గీ. నిక్కముగ నీకు వట్టి♦హుళక్కిమాట
దక్కఁ గాకేమిఫలము వే♦రెక్కరాజ
శబ్ద మెన్నఁగ ఘృతకోశ♦సామ్య మయ్యె
కుటిలవర్తన నుతిపాత్ర ♦ కుముదమిత్ర. 97

ఉ. ఎల్లజగంబులందు భ్రమి♦యించి కళానిధివంచు రాత్రిమేల్
చల్లనివాఁడవంచు సహ♦జాబ్జుఁడవంచు తమఃప్రశాంతరు
గ్వల్లరివంచుఁ గల్లరులు ♦ పన్నినమాటల మిన్నుముట్టితో
హల్లకరాజ క్రుంగెదు త♦దర్థము నీమది నెంచిచూడుమా. 98

తే. గీ. దుండగమువీఱ భువనజా♦తులసువర్ణ
మూది ధరచక్రివిద్వేష♦మూని లింగ
ధారివై కృష్ణపక్షవి♦దారివగు క
ళాదనీస్పర్శదోషాప్తి ♦ ఖేదమిడదె. 99

కం. జీవప్రియుఁడ వటందురు
జీవద్వేషంబు నీకు ♦ జీవంబగు రా
జీవారిపథికజన రా
జీవాభి నవప్రభీత ♦ జీవమృగేంద్రా. 100

సీ. కువలయప్రియుఁడంచుఁ ♦ గొనియాడుదురు లో
కువగాక యుండిన ♦ ట్లవుదువీవు
హిమమానలసదాఖ్య ♦ నెసఁగు నీమహిమ మా
నకయున్నఁదగు నీకుఁ ♦ బ్రకటముగను
సౌమ్యాధికారి వా♦సనగల్గు నీకు స
సౌమ్యత్వమూదుట ♦ సహజమరయ

గురువిగ్రహస్ఫూర్తి ♦ గొను నీకు గురువియో
గంబుఁ జెక్కట యుచి♦తంబుదలఁప
తే. గీ. వలపుమొలపించు నొలపున ♦ బులుపుఁగొలిపి
నిలుపు చెలుపునగలిపి వె♦గ్గలపుటార్తి
దెలుపుగొన మల్పుమెలపని ♦ గెలుపుఁ బొలుపు
వెలుపరించని ఱేఁడ రే♦వెల్గువాఁడ. 101

ఉ. గోసికిమూలమై యిపుడు ♦ గన్పడితౌర భవ్యుఁడు బండిగాఁ
జేసిననాఁడు గాము గడిఁ♦జేసిననాఁడల పేళిమాయగాఁ
జేసిననాఁడు దేశికుఁడు ♦ చేసిననాఁ డెడఁబాసి తిట్టు మై
డాసిననాఁడు నీవెచట ♦ దాఁగితివో శశి మచ్చమాయకే. 102

చ. కటకట చంద్ర నీకు విధి♦కట్టడిఁ జేసెఁగదా దినంబు గ్రుం
కుట యుదయంబునొందుట ద♦గుల్కొని నిల్చినచోటఁ గూల్చినం
తటు నెఱధర్మమౌర యది ♦ దప్పునె బ్రహ్మకులఘ్నదోష మె
చ్చుటఁగలవాఁడ నిత్యమును ♦ జావును పుట్టువు గల్గియుండుటల్. 103

సీ. హారియై సత్కళా♦హారియై తేజోవి
హారియై కుముదప్ర♦హారి యుండ
ఛాయుఁడై బహుకృతా♦పాయుఁడై క్రూరప్ర
మేయుఁడై ఖలసైంహి♦కేయుఁ డుండ
మానియై మంత్రని♦ధానియై శాపసం
ధానియై విబుధప్ర♦ధాని యుండ
క్రోధియై మదనవి♦రోధియై భవదుర్ని
రోధియై కృష్ణశి♦రోధి యుండ
తే. గీ. ప్రబలబలదర్ప మేపడ ♦ రగడునేర
కకట వికటార్తి విరతి కా♦ముకులసకల
వికల మొనరించు తపాటి ♦ నెరవుసాటి
వారు నన్వారె? నీదారి ♦ వారిజారి. 104

సీ. కన్నతండ్రికిఁ బోటు♦గల్పించు గురునియి
ల్లాలి సంసారంబు ♦ గాళ్ళుఁజేసి

తనయునిదెస విరో◆ధంబు లెంతయుఁ బన్ని
తోటియల్లుని తలఁ ◆ ద్రొక్కి నిలిచి
చెల్లెలి యింటిమే ◆ ల్చేతులారఁగఁ ద్రోచి
వలనొప్ప మఱఁది పై ◆ వాదుగట్టి
వదినెకుజ్జనిబాగు ◆వంటకదృష్టించి
మిత్రునిగడిగాము ◆ మ్రింగఁజేసి

తే. గీ. తౌర తనవారలనుట నీ◆యందు లేదు
గదర మావంటి పథికుల ◆ మది చికాకుఁ
జేయు టిదియెంత వింత నీ ◆ సేఁతలందు
గురుకళంకాభినుతిపాత్ర ◆ కుముదమిత్ర. 105

చ. నిలుకడమాలె దౌర వినుఁ ◆ నీబ్రతుకెల్లను బైలుగాను నీ
నిలు వటు నీరుగాను నిను ◆ నెక్కొని మిక్కిలి గాము మ్రింగ నీ
బలి మిఁకఁ గ్రుంగిపోను నిను ◆ బట్టి యొడల్ పదియాఱులెక్క ప్ర
క్కలు విడఁజేయ నీపని ప◆గల్ గడుసన్నగిలన్ నిశాధిపా. 106

కం. అని చందమామ గుందగ
నని జందనశైలపవనఘ◆నామోదంబుల్
గొన జిందు మందపవనుని
గొనజిందగ నిందఁజేయఁ ◆ గొనిరి కండకన్. 107

కం. పంచశర విధులగలసి ప్ర
పంచంబున కెల్ల బ్రాణ◆పద మగుచు మమున్
వంచించి కొంచెపఱచుట
మంచిది యోమదవిహార ◆ మలయసమీరా. 108

తే. గీ. కమ్మకస్తురి గేదంగి ◆ కలువచలువ
పుష్పాదులు నొప్పటనఁటుల ◆ నుప్పతిల్లు
కప్పురపుమెప్పు వలపులఁ ◆ గాన్కఁగూర్చుఁ
గురుణజేకొర మలయమం◆దిరవిహార. 109

కం. జీవస్వరూపుఁడవు రా
జీవారిని గలిపిమెలఁగఁ ◆ జెల్లునె సమయా

భావుఁడవు సమయకారణ
భావుని భావజునిఁగూడఁ • బడుదురె పవనా. 110

సీ. సారమింకెడి గంధ•సారంబె యెఱుఁగు నీ
స్పర్శతాపం బౌట • శైత్యమౌట
సపరాగసుమగుచ్ఛ•సంతతు లెఱుఁగు నీ
మసలుట రయమౌట • మందమౌట
తగుమహాభూతార్థ•తత్త్వజ్ఞుఁ డెఱుఁగు నీ
వపగంధివౌట గం•ధాప్తి వౌట
సన్మార్గచరఘన•సముదయ మెఱుఁగు నీ
జాడసౌఖ్యదమౌట • శ్రమదమౌట

తే. గీ. పాటుఁ దెలియక నిను జగ•త్ప్రాణుఁ డండ్రు
గాక లోకులు నీతత్త్వ • కథన మెఱిఁగి
సదివారు ప్రభంజనుం • డనరె జగతి
కుటిలసంచార చంచల•గుణసమీర. 111

ఉ. ఆహితమైన వహ్నికి స•హాయమవై సకలంబు నొక్కమా
టాహుతిఁ గొందువయ్య సలుఁ•డల్పతనొందిన ద్రింగెదౌర నీ
సాహస మేమిచెప్పఁదగు • చందనశైలవిహార గంధవా
హాహిత మిత్రవంచనుఁ డ•హా పిరహార్తుల నాదరించునే. 112

మ. ఖలమీనధ్వజసంగతిం భువనభం•గప్రక్రియాధుర్యచ
ర్యల శుక్రప్రియమిత్రభావముల వ•క్రక్రూరగంధానిల
ప్రళయోద్వాసని పొదు పోరు పథిక•ప్రాణవ్యథపాల్పికిన్
మలయప్రక్రమమందకృత్యములు ధ•ర్మంబౌనె దాక్షిణ్యమే? 113

మ. కడిమిన్ లోకములెల్ల నొక్కపరిమ్రిం•గన్ నీవె కాణాచివై
గడిసేరంగలవాఁడ నంచు మదిలో•గర్వింప కోరోరి ని
స్తడిగావింప సహస్రవక్త్రమహిమం • గన్పట్టియున్నాఁడు పై
యదరన్ రాను మనంతమూర్తి నిను నా•హారించు గంధానిలా. 114

కం. తొడరి ప్రపంచం బెల్లను
గడగడలాడింతు ననుచు • గర్వింపకు మె

క్కుడుగల్గిన వడిగల్గిన
సుడిగల్గినవాఁడ వగుటఁ ◆ జూడమె పవనా. 115

తే. గీ. అడచిపడె దేల జగమెల్లఁ ◆ దుడిచిపెట్ట
కోరిపుట్టించె నినుఁ దల◆గొట్లమారి
బ్రహ్మ ననవలెఁ గాక నీ ◆ బ్రతుకు ధూళి
పాలుగా నింత చలపడె ◆ దేర పవన. 116

తే. గీ. చాలుచాలుర నీసౌరు ◆ సన్నపూను
నాలి భూతంబవై తుది ◆ గాళుజేయు
గాలిపీడవనంగ ని◆న్గాదె గంధ
వాహ నిను నెంతదూఱిన ◆ వంతుగలదె. 117

వ. అని సేనానాయకసహితంబుగా మదనబలంబుల నుద్దేశించి. 118

తే. గీ. మాట మంచితనంబెల్లఁ ◆ దూటుపఱచి
మేటి తలవంపుపాటునఁ ◆ గోటులేక
చాటెదేమేమొ మారుని ◆ ఘోటి నీదు
నోటిగోటాప నెన్నఁడు ◆ గూటఁబడునొ. 119

కం. కోకిలమా యిఁక మాఱో
నేకగ్రీవముగఁగూడి ◆ యిప్పు డింపటిలో
నేకగళగాత్రిహితసం
బేకొన పలుగాకు లింట ◆ బెంచిరొ నిన్నుఁగా. 120

—◆ సుగంధి వృత్తము ◆—

కోకమామమేచఁ దల్చు ◆ కోకమానవేమి ప్రే
రాకు శారికా సరే చి◆రాకుఁజూపరాకు మా
టీకమానవేమి శాప◆టీకమా చకోరికా
నీకమా విరాళిసెంద ◆ నీక మాన నేకమా. 121

తే. గీ. కమ్మపూఁదేనె దుటగాము◆గవిసి డిల్ల
పడఁగ సైపనిపాట రం◆తిడియె దింత
వెగటుగావింప నీకెంత ◆ యెగసిపాటె
తేటి నీ దిమ్మరితనంబు ◆ దేటపడియె. 122

చ. అధికనిషేధయుఙ్మధుస♦మాహ్వయ పక్షిబలంబు గూర్చి యి
మ్మధుబలజీవనాంతకకు♦మారశిరోమణి యైన కూర్మిరమ
న్మథునకు బంధుకృత్యముల ♦ మన్నన జుట్టమునై తివా బళా
యధికవిరోధులైన హితు♦లౌదురు కార్యపరానుకూలతన్. 123

ఉ. సంతతిమాలి పాంథజన♦సంతతిపై నలుసంత పేర్మితో
సంతసమందఁ జేయ నదె ♦ సంతతజాతివిరోధమొంది నై
సంతకుజాతికేళి కిడె ♦ సంతపనంబొనరింప నీవు మా
సంతజరింపరాకుమి వ♦సంత వెసంతమసాంతకారితో. 124

వ. అని యనేకప్రకారంబులం దమ మనోవికారంబులకొలంది కందర్పసుందరేందుమందానిల మధుమధుకరాధిబలంబులం జలంబునందిట్టి గుట్టుపడ రెట్టింపుచు. 125

సీ. ఘనకల్పనారంభ ♦ ఘనతసేవించెద
పరమహంసలనెల్లఁ ♦ బ్రస్తుతించి
గమగమవలచు సాం♦కవగంధసారాది
కమునఁ బూజింతు శు♦కద్విజేంద్రు
లకు విమలార్జునాం♦శుకతృప్తిఁ జేసెద
సరసభక్తిని గురు♦చక్రములకు
కనకాభిషేకంబుఁ ♦ గావింతునెప్పుడు
సరసాళులకు మది ♦ సంభ్రమమున

తే. గీ. లసదసంతవిలాసక♦ల్పనమరుత్కు-
మారసుకుమారులకును వే♦మాఱుగూర్తు
మద్వియోగార్తిసంవర్త ♦ మహదుపద్ర
వము తరించుటకెందు భా♦వంబునందు. 126

వ. అని పెక్కుభంగుల నుపాలంభగర్భంబుగాఁ బలికి విధివశంబున మెలుకువపడి యొకకొలఁదినిలుకడల నెలకొనియుండి రంత బులుకలులుక కలికించితంబు మొలకజిలుకలకలికిమిన్నఁ దిలకించిన వన్నెకాని చిన్నె లెన్నుచు నిట్లనియె. 127

సీ. అలరుటామనిచెల్మి ♦ గలవాని గలవాని
గలవానిసుతువన్నె ♦ గలుగువాఁడు
తగులీల మదనసుం♦దరమైన దరమైన
ధరమై నగించు కం♦ధరమువాఁడు
పటుతరద్యుతి లగిం♦పఁగ డంబుపగడంబు
పగడంబుగలమోవి ♦ నెగడువాఁడు
మదిబుట్టు వెదిరిమొ♦గ్గదలింపు గదలింపు
గదలింపుగై దంష ♦ లొదవువాఁడు
తే. గీ. తళుకుఁజెక్కులవాఁడు మే♦ల్గులుకువాఁడు
మొలకనవ్వుల సిరివన్నెఁ ♦ జిలుకువాఁడు
దనివిదీరెడి నిండుజ♦వ్వనమువాఁడు
మహిమగలవాఁడె యీవిప్ర♦మన్మథుండు. 128

‡ ఆ. వె. వీని చక్కఁదనము ♦ వివరించుపూమొగ్గ
జోడుకాని వాని ♦ జోడుకాని
వీనిముద్దుపలుకు ♦ వినిపోల్క[illegible]వల్కి
తేనెజాలు పూల♦తేనెజాలు. 129

ఉ. ముమ్మరమైనయీడు తమి♦ముట్టఁగ వీనిమో[illegible]ప్రోవిప్పిఁ
గ్రమ్మెడిపానకంబు చవిఁ♦గైకొనలేని మిటారి ముద్దరా
ల్గొమ్మలు మానుబొమ్మలనఁ ♦ గూడదె నేనిఁక వీనితోడ నా
సమ్మతిఁ గూడియున్న తొలి♦జన్మఫలం బిదిగాదె చూడఁగన్. 130

‡ తే. గీ. వీని యుమ్మడిముద్దులఁ ♦ బూని గబ్బి
గుబ్బపోటులఁ గసిదీఱ ♦ గ్రుచ్చి కౌఁగ
లించి దొంతరరతులచే ♦ మించుదాని
కిహపరంబులసుఖ మెల్ల ♦ నిపుడె కలుగు. 131

‡ వ. అదియునుంగాక—

‡ మ. దయరంజిల్ల మెలంగి ధర్మహృదయా♦ర్థప్రాణదేహాదుల 132
న్నియు భక్తిం గురునాథహృత్ప్రియముగా ♦ నేమించి తానెంతయున్

దయితాయత్తముగాఁగ నుండవలె వి♦ద్యల్నేర్చువా రంచు ని
ర్ణయశాస్త్రాదులు వల్కువింటి మిఁక నె♦న్నం డేనుగావింతునో. 133

కం. గురువరఁ వరదక్షిణ హ్రా
త్పరిరంభణలీలలకుచ♦ఫలసుమ హోసం
భరణమొసఁగి సేవించెద
గురుతరమగు నాదు భాగ్య♦గుణ మెట్లుండెన్. 134

చ. అలరసమస్తలక్షణము ♦ లాత్మ నెఱింగి తదర్థలక్ష్యముల్
దెలియనివిద్య నిష్ఫలము ♦ తెల్లముగాదె రహస్యభావముల్
గలమదనాగమాంతపరి♦కల్పమహామహిమాంతిసౌఖ్యముల్
దెలిసెద నీనిఁ గొల్చి తగ♦దే జగదేక గురుత్వసత్త్వమున్. 135

వ. అనియూహింపుచు మోహాశయంబున— 136

సీ. విరిపాన్పుపై వ్రాలి ♦ పొరలు లేచు వడంకు
నలుగడ లత్తఱిల్లి ♦ కలియఁజూచు
పిలువకేపల్కు మే♦నులికి పానుపుడిగ్గు
తలయూచుఁ గనుమూయుఁ ♦ గళవళించు
తనలోనఁ దానవ్వు ♦ కినుక దైవముదిట్టు
నలయికఁగొని యుస్సు ♦ రనుచు మూల్గుఁ
బలువరించు వివేక ♦ మొలమిడించు కరంబు
లప్పళింపుచు బయ♦లలముకొనుచు

తే. గీ. మోహమునమించు పులకించు ♦ మోమువంచుఁ
జెలివిమదినెంచు వగమించు ♦ తెగువఁగాంచు
నెమరగమకించు నూరకే ♦ బెదరుఁగొంచు
మదనవేదన కోర్వ న♦మ్మామ యటంచు. 137

వ. అని వెండియు. 138

ఉ. ముచ్చటదీర్చు నెచ్చెలులు ♦ ముచ్చట కిచ్చుట లేరు పచ్చవి
ల్తెచ్చులకాఁడు మచ్చులిడి ♦ మిన్నక నన్నిపుడొంటిఁ జేసె మే
లచ్చుపుఁగుంటి జంటిమొన♦లంటఁగ నొంటగు తుంటవింట బ
ల్గుచ్చుల పూవుటమ్ము లెద♦గ్రుచ్చె సహో విధి నేమిసేయుదున్. 139

చ. గమగమలాడు కప్పురము ♦ గ్రమ్మినపుష్పపు దొమ్మిగుమ్మిలో
దుమికెద లేక నొక్కపరి ♦ తోరపువెన్నెల చిచ్చుచొచ్చెదన్
దమి నటుగాక కుత్తుకను ♦ దట్టపుకొవ్విరిదండఁ జుట్టి పై
గమిచెద మావికెంజిగురు ♦ కైదువ యొమ్ముసగ్రుమ్మి చిమ్మెదన్. 140

చ. వల పదినిల్పలేను తమి♦వాసియు దైవమెఱుంగు నిల్లు నేఁ
దలఁచిన తాళలేను మదిఁ ♦ దల్పకయుండిన నిల్వఁజాల నీ
చెలువుని వేఁడుకొన్న దయ♦సేయునొ సేయక పాయఁద్రోచునో
చులకదనంబుగాఁ దలఁపుఁ♦జూచునొ నామది తల్లడిల్లెడున్. 141

మ. అని చింతింపుచు నద్ధరారమణ క♦న్యారత్న మాత్మాభిలా
షనిరూఢత్వము దేటగాఁ దెలియ ని♦చ్చన్ బల్కి భావంబు నా
తనిసంధానముఁ గోరుచుండె నటనం♦తం బిల్వ నుంచెంతయున్
వనితానందరసైకభావ మను నా♦వం దాఁటె దుఃఖాబ్ధియున్. 142

కం. తనమదికోరికఁ దీర్పఁగ
ననువగు నీ యబలహృదయ ♦ మని సంతోషం
బున భావికార్యఫలసూ
చనమై ఖరిఁ దెల్పినట్లు ♦ సమ్మతినుండెన్. 143

కం. కాశ్మీరసితాభ్రమిళ
ద్రశ్మిభకాజఃప్రసాద♦తరకీర్తిలస
ద్రశ్మిపరిబంధదోలాం
తాశ్మిధరాగ్రిక జయర♦మాభరణ గుణా. 144

శా. తామ్రశ్మశ్రుశకరాళవక్త్ర కుహర♦ధ్వాంతోర్మికక్రోధ దృ
గ్ధూమ్రాక్షప్రముఖక్షపాచరదళ♦ద్దోర్దండపాండిత్య స
త్సామాగ్రిట్సంభృత శుక్తిమా క్తికసిత♦చ్ఛత్రాయ మానోద్యశః
కృత్రిమాత్మీయ గుణాలవాలవలయా ♦ కల్యాణదీపాలయా. 145

—: వసంతతిలకం :—

సౌజన్యలోకశర♦ణా శరణాగతేంద్రా
భూజామనోహర శు♦భోదయభోగసాంద్రా

తేజః కళావసుమతీ సుమతీవితంద్రా
రాజాధిరాణ్మఘవ ♦ రాఘవరామచంద్రా. 146

—: గద్య :—

శ్రీరామచంద్రగురుకరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సకలసంపూర్ణ సరస
శృంగారరసధారాధరమాధురీధురీణతాలంకారితాంధ్రగీర్వాణకవితా
విలాసవిచిత్రవిలసి తాపస్తంబసూత్ర భారద్వాజపవిత్ర చెళ్ళపిళ్ళ
కులసుధార్ణవ రాకానిశాకరయశోధురంధర ధరామరప్రవర్య
రామయనామార్యపౌత్ర కామకవిసుపుత్ర సకలవిద్వజ్జన
విధేయ సరసయనామధేయప్రణీతం బైన యామినీ
పూర్ణతిలకావిలాసం బను శృంగారమహా
ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము
సంపూర్ణము.





# యామినీపూర్ణతిలకావిలాసము

## పంచమాశ్వాసము.



కం. శ్రీమద్భక్తజనప్రియ
కామితమందార పరమ కారుణ్యరసో
ద్దామ గుణధామ పావన
ధామానిధికులాబ్ధిసోమ దశరథరామా.

వ. దేవా యవధరింపు మనంతరంబ. 2

తే. గీ. అతుల దిటమూని పటుకాంత పటముమీఁద
మొనసిచూచిన భామ నెమ్మోముఁ దలఁచి
పూర్వశైలాంతరాళసంపూర్ణచంద్ర
గణనగా నెంచె బిల్హణకవివరుండు. 3

సీ. వరచంద్రబింబమో వరఫుల్లపద్మమో
నిద్దంపుటద్దమో ముద్దుమొగమొ
సరసీరుహంబులో చారుమీనంబులో
వెడవిల్తుతూపులో వీక్షణములొ
సమదచక్రంబులో సుమగుళుచ్ఛంబులో
కనకకుంభంబులో స్తనభరములొ
ఘనతటిద్రేఖయో గాటంపుచుక్కయో
బంగారుతీఁగయో భ్రమరకచయొ

తే. గీ. యారగుఱినిల్పితర మానె ♦ యరసిచూడ
వరుస సుర సిద్ధ సాధ్య కిం♦పురుష యక్ష
గరుడ విద్యాధరోరగ ♦ నర పురంద
రారి గంధర్వ కిన్నర ♦ చారణులకు. 4

చ. ఇది వదనంబుగాదు మృగ♦హీనకళానిధిమండలంబు చ
క్కఁదనపు గుబ్బచన్నులివి ♦ గా వమృతోజ్జ్వలహేమకుంభముల్
మృదుకచపాళిగా దిది హ♦రిప్రియపుత్త్రిఘనాస్త్రశాలయా
యిది కనుదోయికాదు మది ♦ నెంచగ శృంఖళ లెంతవారికిన్. 5

చ. ఘనతిమిరంపుగుంపు శశి♦ఖండముకార్ముకమేచకాబ్జ కో
కనదపలాశశంఖలతి♦కా తపనీయ ఘటాభ్ర సైకతా
వని కదళీసుశాఖాహాళిక ♦ వారిజయుగ్మముగూర్చ సర్వమీ
ఘనకచయె విలాసముల ♦ గన్పఱిచెన్ భవదగ్ధ మన్మథున్. 6

తే. గీ. దండితనమున మదనాహి♦తుండికుండు
సంతతము మధ్యవేది మ♦ధ్యాంతరాత్మ
పీఠిపై నిల్చి నాభికా♦బిలము నసుగ
మించు రోమాళి ఫణినియా♦డించు నౌర. 7

చ. ఉరుముఖసంపదల్ గలిగి♦యుండినఁ జంద్రుఁ డటుండుఁ గాక దృ
గ్భరముల గోష్ఠిగల్గినను ♦ గల్వలోకానొక మూలనుండ నీ
సరసవచోవిజృంభణ లె♦సంగిన కిన్నెరపాటు దూరమై
వఱలిననేమి నెన్నడుము ♦ వార్తవినన్ గయిమోడ్చు మింటికిన్. 8

సీ. కలకంఠనాదంబు ♦ కలకంఠనాదంబు
పల్లవంబుల భేద♦పల్లవములు
వరపయోధరములు ♦ వరపయోధరములు
తారకంబులు దివ్య♦తారకములు
సుమనోవికాసంబు ♦ సుమనోవికాసంబు
భ్రమరకంబులు మద♦భ్రమరకములు
నవసువర్ణస్ఫూర్తి ♦ నవసువర్ణస్ఫూర్తి
మధ్యసీమ వివాద ♦ మధ్యసీమ

తే. గీ. సమ్ముఖం బబ్జమండల ♦ సమ్ముఖంబు
మృదుకరంబులు బిసలతా ♦ మృదుకరములు
దంతరుచు లబ్జరాగ హృ♦దంతరుచులు
హారమణి ముద్దువలరాజు ♦ హారమణిర. 9

సీ. అలరువా తెరఁబోలు ♦ టరిదియె నెమ్మోము
పరిపూర్ణ రాజబిం♦బమును బోలు
నలనెమ్మొగముఁ బోలు ♦ టరిదియె వేనలి
తమివన్నెఁ జిల్కుటం♦ద్దమును బోలు
నలవేనలియుఁ బోలు ♦ టరిదియె మైతావి
రహిమించు నునుగప్పు♦రాలఁ బోలు
నలతావియును బోలు ♦ టరిదియె చనుదోయి
రమణాసువర్ణచ♦క్రిములఁ బోలు

తే. గీ. అలరుచనుదోయిఁ బోలుటె ♦ యరిదివీను
లెలమిఁ దులకింప శ్రీఫలం♦బులను బోలు
నబలవీనులఁబోలుటె ♦ యరిదిపిఱుఁదు
లమర నిమ్మహి నవవిలా♦సముల బోలు. 10

సీ. భామినీమణి మధ్య♦సీమ సుఖం బౌను
ధామంబు కళ్యాణ♦తను జెలంగు
ననబోఁడి నునుగొప్పు ♦ ఘనతయై కనుపట్టు
హిమధామముఖి కంఠ ♦ మెన్నఁ దరమె
తరళాక్షి జఘన వి♦స్తారంబు సహ్యంబు
సుందరి పెందొడల్ ♦ శుభకరములు
తరుణియానంబు శ♦తానంతవినయంబు
సరసాళి నఖములు ♦ సత్ప్రియములు

తే. గీ. పడఁతి పాలిండ్లు జీవనో♦పాధి సంప
దలు గణింపంగ భాగ్యని♦ధాన మైన
దీని కనుసన్న మెలఁగిన ♦ వానిభోగ
భాగ్యములకన్నఁ గలదె సౌ♦భాగ్య మెన్న. 11

సీ. శరదంబు వేణికి ♦ శాంతభావమునొందె
దరహాసమడరి వెం♦టనెమఱల్చె
మణికంఠమెదిరింప ♦ నెఱిఁగిసముం బయ్యె
పిఱుఁదాదినుంటపైఁ ♦ దరలఁ ద్రిప్పె
నునుబల్కు కలఁగించి ♦ మొనమాన్చె నంతట
జంఘలు ముఖభంగ ♦ సరణినొంచె
పెందొడసిరి తక్కు♦వందక సవరించెఁ
గరములు వెనుక ముం ♦ దెఱుఁగఁజేసె
తే. గీ. తను రుచిస్ఫూర్తి సానుబం♦ధత యొనర్చె
గతివిసరిమించె నంతరం♦గములుగల్గ
నవరసప్రాప్తి యొనగూర్చి♦నాఁడు నాఁటి
కలరు చన్గత్తు లీకొమ్మ ♦ కలరుసుమ్మ. 12

చ. తెలిసఁగుడాలు వెన్నెలల♦దిద్దు గడల్ నడతెంచ నంచకొ
క్కలు వెలవెట్టి పల్కుబడి ♦ కిన్నెర కిన్నెరమేళగింపు మై
వలపులు కప్పురంపునెఱి♦వాదులు తళ్కులు పైడిసంప్రితుల్
గలుకుమిటారి నున్నెఱుఁగు ♦ కూఁకటి చీఁకటి వంగడం బగున్. 13

చ. కలికి మెఱుంగుతావి సిరి♦గంధము గందుము ముద్దుమోవి తే
టలజిగి కెంపుపెంపు పగ♦డంబుల డంబు లడంచు పల్మొనల్
మొలకమెఱుంగు మల్లెవిరి♦మొగ్గల మొగ్గలరించు గబ్బిగు
బ్బలపసమించు పూవిలుతు♦బంతులనం దులకింపనౌ భళీ. 14

మ. తరుణీయానముగాంచి భీతినిడు వే♦దండంబు దండంబువి
స్ఫురదంఘ్రిప్రభఁజూచి చెందెఁ గదళీ♦సూనంబు సూనంబు బం
భరవేణీమణికంఠమాధురికిదుర్ ♦ బైకంబు పైకంబు సు
స్థిరతన్ బ్రేమయొసంగు మోమునకు రా♦జీవంబు జీవంబుగన్. 15

చ. మదభసలాళివంటి కచ♦మా మృదురంభలవంటి యూరులా
మదనదరంబువంటి గళ♦మా ముకురంబులవంటి చెక్కులా
కదలని మించువంటి తళు♦కా విరిబంతులవంటి చన్నులా
మదవతిజవ్వనం బమృత♦మాధురిఁ జేయదె యెంతవారికిన్. 16

చ. పలుకులతేటలా వలపు♦భావములా రసగుంభనంబులా
మెలకువఁజూపులా రతుల♦మేళములా యెలముద్దునవ్వులా
మొలకమెఱుంగులా చెలుల♦ముచ్చటలా మఱిగల్గునేదియే
నెలసినజాణ యీచెలువ ♦ నేలిన ముజ్జగమేల యేలఁగన్. 17

కం. కనకనగంబులు కుచములు
గనకనగంబగుచు మోము ♦ గనకంబగు నీ
ఘనకంబుకంఠి చూపుల
మొన కందినవాఁడు మరుని ♦ మొనకందఁడుగా. 18

చ. ఘనకరినాయత స్తనవి♦ఘట్టనకోర్వక నల్గెనో హృదిం
దనవిరహాగ్నిలోఁ బడెనొ ♦ తారతరద్యుతివార్ధిమున్గెనో
చనిచనియావనోపవన♦సాహసదృశ్చరమారచోరనా
ధుని వశమాయనో మనసు ♦ తొయ్యలిపై జని రాకయుండెడిన్. 19

వ అని యనేకభంగులనయ్యంగనాభువనమోహనాంగశృంగారరేఖా విలాసంబు లభివర్ణించుచున్న బిల్హణానల్పమోహాభిప్రాయసూచిత ప్రచురతరచతురవచనరచనాసుధారసధారాప్రబోధితాంతరంగియై వెండియు పండితపరిముఖముఖచంద్రమండలావలోకనంబు గావించి యయ్యుజ్జనుజ్జాత లజ్జాభరంబుగుజ్జుకాన నొజ్జపజ్జంజేరి లఘుచిత్తంబునం బొత్తుగోరినం జిత్తగించునో లేక యొత్తిగించునో పరిస్తుతంబీయుత్తముని చిత్తంబు తెఱం గెత్తెఱంగున నెఱుంగనగు నని మనంబునందలంచి యచ్చంచలాక్షీవతంసంబు మఱియును. 20

చ. తెర యొకయోరఁదీసి తరి♦తీపుల చూపుల వానిమోము ని
బ్బరముగఁ జూచి సిగ్గిలుచుఁ ♦ బొన్నునవ్రాలి మరుండుపూదొనల్
తెఱపిగముల్కు లేర్చి వడి♦దింపక నింపుచునుండె జీవనం
బరసిభరింపు మీవు చతు♦రానన నన్గృపఁజూచి నేఁడనన్. 21

వ. ఇట్లు నర్మగర్భంబుగాఁ బలికిన మెళుఁకువకుం దిలకంబుగా పూర్ణతిలకంబుతోడం గవీంద్రుం డిట్లనియె. 22

మ. కనదిందీవరనేత్ర నీనిశితదృ♦గ్బాణపరిపాతాంకిత
వరిణది వ్యాపథమంచు నెంచెద భవ♦ద్వక్షోజకాశ్మీరచం

ం బధరజ♦స్యశ్రీసుధాసార పా
బీఁకన్ ద్వితయశూ♦న్యంబైన లే దన్యముగ. 23
సురాధర మధురసుధా
సురాలాపములఁ బ్రేమ ♦ మన్నింపఁగదే
సురాజిత నవకుందను
సురాజిత దంతకాంతి ♦ మహిమఁజెలంగగ. 24
రిణీకృతాదరస్మిత
ణీ వరణీయచిత్త ♦ భవవనధరణీ
రణీ సుఖకరణీ వర
ణీ యధరామృతంబు ♦ దయసేయఁ గదే. 25
మాటల మరుఁ డొగిజిగి
మాటలరించి పొంచె ♦ బిగికౌఁగిట దే
గఁజేరిచి వగఁగూరిచి
ఁదీరిచి మనుపవేల ♦ తగునటె బాలా. 26
నవే నెసరునవేగను
నవే ననవిలుతుబారి ♦ గొన బెనగొనవే
వే నినువేడెద నెద
సువేడ్కను మనుపవేల ♦ నవ్యేందుముఖీ. 27
ంతయు దయఁజూడక నను
ంతలవంతలను జివుకఁ ♦ జేయుట దగునే
బంతీ పిరిబంతీ మరు
ంతీ మురిపెములదొంతి ♦ తరుణి సుదంతీ. 28
లికీర కేకి కోకిల
ఌ లవె లలమె మోసములకు ♦ నులికితి నహహా
లికీ మురిగులికీ మరు
లికీ వలపేటి పుట్టి♦ములకామెఁ గదే. 29
మ్మా నెమ్మది కోరిక
మ్మా యిమ్మాటలందు ♦ లిమ్మాటలు గై

కొమ్మా యిం దెరమ్మా మది
ముమ్మాటికి నమ్మకొమ్మ ♦ ముద్దులగుమ్మా. 30

కం. లేమా మననెన రిఁకవది
వేమా లేమావిదూపు♦లే మారునివా
లే మాటలేల నీసరి
లేమా నీమాటలిందు ♦ లేమావికదే. 31

ఆ. వె. కొమ్మ నన్ను నేలు♦కొమ్మ చెక్కిలిముద్దు
గుమ్మనీవె ముద్దు♦గుమ్మ నీవె
జాలమేల తాళ♦జాల మేలగు మారు
వాలుగంటి కోర్వ ♦ వాలుగంటి. 32

తే. గీ. ఒద్దికలుజార తమిదీర ♦ బుద్ధిదేర
ముద్దులింపార మారుని ♦ సుద్దులూర
ముద్దియలుబన్ను నీయద ♦ నద్దునన్ను
పొద్దుజరుపకు మిఁక జాల ♦ ముద్దరాల. 33

చ. కలకలనవ్వుచుం దళుకు♦గన్పడ చక్కెరకావిమోవిపై
పలుమొననొక్కుచున్ జికిలి♦బంగరునెమ్మెయి గౌఁగలింపుచున్
కులుకుబిసాళి గబ్బిచను♦గుబ్బలపై నునుగోటిపోటు ల
గ్గలముగనిల్పి సారెరతి♦కాంతుని కేళి సుఖించు టెన్నఁడో. 34

ఉ. సారెకు ముద్దుమోవి మన♦సారగ వేఁరగఁ బంటనూదితే
సారములూరు చక్కెరల ♦ సాటికిమాటికిఁ గౌఁగిలించితే
చేరికమీఱు కేళికల ♦ చిన్నెలవన్నెలఁ దారసించితే
కోరికదీఱ నిన్ రతులఁ ♦ గూడక నేఁడిఁక మాననేర్తునే. 35

సీ. వలకాకదీఱ కౌఁ♦గిలినింపకున్న ర
వ్వలకాక దీఱదో ♦ కలువకంటి
తెరగుబాటునదీసి ♦ చొరకున్న మారుఁ డే
తెరవుపాటించునో ♦ తెరవమిన్న
కలుకుగుబ్బలఁ గొమ్మ ♦ గుదియింపకున్న నో
కులుకుగుబ్బలరునో ♦ తలిరుఁబోఁడి

తళుకుఁజెక్కులముద్దు ♦ తమిదీఱకున్నఁ గ్రొ
త్తళుకుఁ జెక్కులమునో ♦ జలజగంధి
తే గీ. మేల నన్నెలవేల యీ♦వేళజాల
జాలిపాలైతి నికఁ జల♦మేల తాళ
జాల లీలావిశాల క♦పోలఫాల
ఫాలలితమృగమదపు జం♦బాలబాల. 36

చ. అనఁ విని సంతసించి వన♦జాయతలోచన బిల్హణుండు దా
నను వరియించు టెంత సుది♦నంబిది నాజననంబు జవ్వనం
బనుపమమైన చక్కఁదన♦మారయ సార్థకమయ్యె నంచుఁ జ
య్యనఁ దనశెయ్యడిగ్గి దర♦హాసముమోమున నివ్వటిల్లఁగన్. 37

చ. తెరమఱలించి సిగ్గునను♦దేరెడి మోహపుటోరచూపులన్
మురిపెముమీఱ గుబ్బపుట♦ముబ్బినచన్గవమీఁటి పైఁటపై
పోర సవరింపుచున్ బ్రియుని ♦ పూవులపానుపుచెంత నంత బి
త్తరి పగడంపుసొంపలరు ♦ స్తంభపుఁ జాటున నిల్చి యుండినన్. 38
తే. గీ. తలఁచి మదిలోన వెలలేని ♦ వలపుకలిమి
వలన నెపు డెప్పుడనుచు బల్ ♦ బులుపుగలుగు
కతనఁ గవిరాజు ప్రాణముల్ ♦ గలియఁజేరె
నను కనికరము మెఱయ ని♦ట్లనియె దమిని. 39

ఉ. స్తంభపుఁజాటు మన్మథుని ♦ ఘాటికినాటునె మద్విలాసదో
స్తంభసమాశ్రితస్థితి ను♦దారత నిల్పినఁగాక దుస్తరీ
స్తంభసమాఖ్య నెన్నఁదగు ♦ సాత్త్వికభావము మోహనైక సం
రంభనిగుంభనంబునఁ గ♦రంబొనరించె మరుండు మానినీ. 40

కం. పగడంపు నీదుమోవికిఁ
బగడం బొనరింప దాని ♦ పజ్జనొదిగె దా
జగడంబుగల దటంచును
జగడం బొనరించువారి ♦ జతనుందు రటే. 41

ఉ. వాగురులయ్యెనే మరుని ♦ వార్తలు మోహ మిదేమొ చూడఁగా
సాగరమయ్యెనే వలపు♦జాడ లివేమొతలంప రేఁబగల్

జాగరమయ్యెనే మధుర♦సంబులు వాచవిచూడఁ జేదుబా
టోగిరమయ్యెనే యిఁక నె♦టోకదె నీవిటు జాగుచేసినన్. 42

చ. మఱుఁడరుదార నిర్వ్యర స♦మంబుగ నేయఁగఁ జూచెదేల సుం
దరి మనపాలిదైవ మిదె ♦ తారసిలించె నిఁకెంతకన్న లే
దరయఁగ మేలిదే సమయ♦మా నని కేలఁబుచాచి మెల్లనే
మురిపెపు మాటలాడుచును ♦ ముద్దులగుమ్మ కరాబ్జమంటుచున్. 43

చ. చిటివిరిబంతి గుబ్బసిరి♦చేరిక కానుకలంది దాని కే
ల్చిటికెనఁబట్టి పాన్పుపయిఁ ♦ జేర్చిన సిగ్గిలి నెమ్మొగంబు వం
చుట లోకవింతఁజేసె బలు♦సోయగ మేమనవచ్చు తొల్త నొ
క్కటఁ గవిచి త్రవృత్తి కవి♦కాంతునిమాయయొ కాంతమాయయో. 44

తే. గీ. అదనిది యటంచు మదవతి ♦ నెదనుబొదలి
కదియఁ గుదియించి కౌఁగిట ♦ నదముటొదవె
మదనుఁ డిరువురమది గుఱె ♦ వదలకుండ
నాటనేసిన భావంబు ♦ తేటపడఁగ. 45

మ. సుఖనాళంబుల మున్గెనోతనువు తా♦శోధించు దంభంబునన్
సఖికర్ణాంతరగాహమొందెనో వచ♦స్సంసిద్ధికై బంధురో
న్ముఖ సంశ్లేషవిషణ్ణనోయుతగతిన్ ♦ మోదించెనో చిత్రమీ
యఖిలానందరసాబ్ధి నైక్యముఁగనెన్ ♦ హా మాటలిం కేటికిన్. 46

చ. కరమరసోఁకఁ బోఁకముడి ♦ గ్రక్కునవీడఁ దనంతచేకొనన్
గుఱిమదినిల్పినంత బిగి♦గుబ్బలకంచెల దంటమీఱు డ
గ్గఱిలుచు ముద్దుమోముసిరి ♦ గాంచిన తొల్తటి సిగ్గుదొంతరల్
పరఁగె మిటారికన్గొనల ♦ భావహితక్రియ లేర్పరింపుచున్. 47

చ. కలరవభూషణప్రకర♦కల్పనలన్ ముదితాంగకంబులన్
బులకవిలాససంపదల ♦ బోధకృతాగజతత్త్వలీలలన్
గలితభుజాంతరాళపరి♦గాఢనిమగ్నకుచోపగూహనా
ద్యలఘువినోదకేళికల ♦ నన్నిటఁ దృప్తినిజేసె వన్నెగన్. 48

వ. అని సంతసిలుచున్న భూదేవకాంతునితోడఁ గాంతారత్నంబు తనవైదగ్ధ్యప్రభావంబు కొంతచాటువడన్ ముగ్ధభావంబుగా నిట్లనియె. 49

సీ. కలయ ముద్దులమోవి ♦ గదుమకు మోసామి
గదిమినఁ బలుకెంపు ♦ లొదవనీకు
కులుకుగుబ్బల కేల♦నులుమకు మోసామి
నులిమిన కొనగోరు ♦ లలమనీకు
బిగియకౌఁగిటిలోనఁ ♦ బెనపకు మోసామి
పెనచిన మైపూఁత ♦ చినుకనీకు
గాటంపుఁ దమికేళిఁ ♦ గలియకు మోసామి
కలియ మైయలయిక ♦ గలుగనీకు
తే. గీ. తొలుతప్రాయంబుఁ గడులేఁత♦చెలులచేత
వలపు రారాపురవ్వల ♦ వలపుదాపు
సాహసముఁ బూన తలిదండ్రి ♦ చాటుదానఁ
గాన నాసామి నీవెఱుం♦గని దిఁకేమి. 50

కం. గోలతనమలరు కన్నెను
గాభుతనంబెఱుఁగ నింతే♦కాని మఱియు నీ
పాలైనదాన మిక్కిలి
మేలిమిగను దిద్దుకొమ్మ ♦ మేలిదిసుమ్మా. 51

వ. అని మురిపెంబుదొలుకఁ బలికినకలికి పలుకులకలరి కులుకుచు విప్రకులతిలకుం డిట్లనియె. 52

తే. గీ. వన్నెలాఁడిరొ నీమది ♦ వచ్చునట్లు
వెలయరతులందు నినుగార♦వింతుఁ గళలఁ
దీర్పుగాని నన్నుఁ గెలిచిన ♦ నేర్పులెంచి
తాల్మి విడఁజూతునే నవ్వ♦తాలకైన. 53

తే. గీ. కన్నియవుగాన యబలవై ♦ఖరులవెలసి
నట్లు పలికెద విది మన ♦ యాత్మలందుఁ
గలుగుతమకంబు లెన్నఁగాఁ ♦ దెలిపినట్లు
మెలఁగుదుమె యంచు నగుచు న♦ర్మిలిదలిర్ప. 54

సీ. తమిహెచ్చి కళలకూ♦టములంటి తళుకు చె
క్కులు ముద్దుఁగొని మోవి♦క్రోలిక్రోలి

యుపటుగుబ్బ లురమ్ము ♦ నదిమి పైఁగమకించి
బిగియారఁగౌఁగిటఁ ♦ బెనచి పెనచి
కయిదండగొని పూఁత ♦ కలమెయి మఱపించి
యులుకఁ జక్కిలిగింత ♦ కొలిపి కొలిపి
కిలకిలనగుచుఁ ద ♦ క్కులుదార్చి వగల వ
న్నెలుచిల్కఁ జందొవల్ ♦ పలికి పలికి
తే. గీ. మొలకనునుసిగ్గు కన్గొన ♦ లలిమిబలిమి
కలిమినెలమిగఁ బులకల ♦ మొలకనింప
గలిమిగులికింపఁ జెమటలఁ ♦ దొలకరింపఁ
దొలుతకూటమి కవిరాజుఁ ♦ గలిసిమించె. 55

ఉ. సారపుఁజూపుమచ్చు లొగిఁ ♦ జల్లి భ్రమించురతీంద్రరాజ్యసం
భారరమావిలాస మగు ♦ భద్రపయోధరపాళిపాణిపం
కేరుహసీమఁ బాల్పఱచెఁ ♦ గేరుచు మారుఁడు చూచుచుండఁ దాఁ
జోరుఁడుగాన నీ జగతి ♦ చోరుల సాహసవృత్తియొప్పఁగన్. 56

చ. బలురతికేళిఁ దేలి జన ♦ పాలకబాలిక చూడనొప్పె స
ల్లలితవికీర్ణగోగణవి ♦ లాసినియై కవిరాజుపోలికన్
జలదముపోలికన్ కుసుమ ♦ సాయకుపోలిక నింపుగ్రిపోలికన్
జలజహితారి మేరుగిరి ♦ శంకరమూర్తుల పోల్కి నెంతయున్. 57

ఉ. సాలకసంశ్లథశ్రమర ♦ సార్ద్రవిచేష్టసముద్యదంగజో
ద్వేలకళాకులోరువస ♦ తిప్రభనిర్గతవస్త్రకంచిక
న్మీలితనేత్ర నిస్త్రపవి ♦ నిర్గళనిస్వన యామచంద్రోఁచ రా
ఙ్మాల రతాంతవేళ శత ♦ వైఖరిఁ గామవశేచ్ఛ భస్త్రికన్. 58

కం. ఇటు లోకనిమునము గడుపుచుఁ
గుటిలాలకతోడఁ గుసుమ ♦ కోదండశర
స్ఫుటిత ప్రభావమెన్నుచుఁ
బటిపోటముచ్చటల వలపు ♦ చిగిరుపలెగెన్. 59

ఉ. మానిని సివిలాస మహో ♦ మంబులు సూచెడివేళ పరిస్ఫుర
త్పూనరసాభరంబుఁ బవిఁ ♦ జూచెడివేళ దృఢాంగిభాసుబుసం

ధాన మొనర్చువేళ సుర♦సాధఫణీంద్రబలీంద్రపూర్వసం
తాన విలాసభావము లు♦దారతఁ గోరెద నామనంబునన్. 60

చ. రమణి రథాంశుకంబు మధు♦రంబగు కెంపు సుజాతరూపకుం
భములు కుచంబు లుజ్జ్వలిత♦బాహువు లగ్రలతల్ నిజంబు లో
ల్లమిగలదేనిఁ బల్క్మనస♦శాకుననాటియురఃకషోపల
భ్రమతలిఖించి గాత్రిసమ♦పగ్నవిలగ్న మొనర్చిచూడుమా. 61

వ. అనిపల్కి— వెండియు. 62

తే. గీ. బాలికామణి నీదు పుం♦భావకేళి
సౌఖ్యలాభంబుగోరెద ♦ సరసగతుల
గుంభితానందసంభోగ♦జృంభమాణ
లాంఛనము లేర్పరింతు మ♦ద్వాంఛదీఱ. 63

కం. అని తరిగొర్పాటునఁ గ్రొ
న్ననవిల్తుని శాస్త్రలక్ష♦ణములెఱిఁగి హితం
బున గురువరువలననె తెలి
సినలక్ష్యము తా నటన్న ♦ చెలి యిట్లనియెన్. 64

తే. గీ. ధరణిజనులకు ఘ్రాణరం♦ధ్రములరెంట
సురలు మారుత మలనిశా♦కర దినేశ
నాడికలపేరుగలిగి చె♦న్నారు నందు
విభజనాంశలక్రియలు గా♦వింపవలయు. 65

కం. నాసాదక్షిణజాతో
చ్ఛ్వాసము సూర్యాఖ్యనాడి ♦ సమరస్నాన
గ్రాసభయార్తి పరాఙ్ముఖ
హాసవ్యవహార రతుల ♦ కర్హం బెపుడున్. 66

తే. గీ. అన్యనాసాపుటంబున ♦ జన్యమైన
మారుతము చంద్రనాడి సౌ♦ఖ్యంబు గమన
పరిణయముల నలంకార♦భావములను
గీత సుక్షేత్ర దాన వి♦క్రియములను. 67

తే. గీ. అది నిజముగాన నిపుడు చం♦ద్రాఖ్యనాడి
వఱలుచున్నది రతికి భ♦వ్యంబుగాదు
మీరుదెల్పిన ధర్మంబు ♦ మీఱెఱుంగ
రనుచుఁ బల్కెనఁ గవిరాజు ♦ వనితకనిమొ. 68

సీ. అతివ నీకెమ్మోవి ♦ యరుణబింబబలంబు
సఖియ నీనెమ్మోము ♦ చంద్రబలము
చామ నీమెయిగోము ♦ సర్వమంగళబలం
బబల నీచూపు సౌ♦మాఖ్యబలము
కొమ్మ నీచనుదోయి ♦ గురుబలంబలరు బం
గరుబొమ్మ నీపల్కు ♦ కార్యబలము
కలికి నీమురిపెంపు ♦ గతులు మందబలంబు
ముదిత నీవేణి త♦మోబలంబు
తే. గీ. అతనుకేతుబలంబు చే♦లాంచలంబు
రమణి నీనఖపాళి తా♦రాబలంబు
లలన నీవబ్బుటే మంచి ♦ లగ్నబలము
గాకయున్నదె శుభము లో♦కములయందు. 69

తే. గీ. పాలు నీరును గలిసిన ♦ భంగి మనము
తమకములుమీఱ జతగూడి ♦ తరుణి యిపుడు
వలపు పంచనలేల నీ ♦ వాఁడఁగాన
వలపుతనమున గెల్వ నె♦వ్వరితరంబు. 70

వ. అని మఱియును. 71

సీ. మగపోడుములుగల్గు ♦ మానినీరత్నంబు
కెళవునుండిన మద♦కీరవాణి
వ్రతమధ్యమందున్న ♦ వనితాశిరోమణి
పగలుతాఁజూడని ♦ పద్మగంధి
తనకన్న నీడుమీ♦ఱిన ముద్దువగలాఁడి
జవ్వనంబెడలిన ♦ రవ్వలాఁడి

పూపప్రాయఁపుఁ జిన్ని ♦ మూపంబుఁ గన్నియ
కులధర్మ మెడలిన ♦ కోమలాంగి.

తే. గీ. వేడిచే మాఱుపడియున్న ♦ విద్రుమోష్ఠి
దుఃఖసంతాపమొదవిన ♦ తోయజాస్య
మదిని బగగల్లు వగలాఁడి ♦ మదనకేళిఁ
గొని వినేపథ్యయగు దానిఁ ♦ గూడరాదు. 72

మ. అని మోహాతిశయంబునం బ్రియుఁడు యు♦క్తాయు క్తకాలప్రశో
ధన లింకేలని నూత్న వేషధరులై ♦ తాంబూలికాఖాదనా
భినవప్రస్తుతమాల్యలేపన హితా♦భిప్రాయభావానుభా
వనలీలాదుల బాహ్యకేళికల వాం♦ఛల్ మీఱఁగా నెంతయున్. 73

కం. బాలకపోలకుచాంతర
పాళికలను బొటనవ్రేలి ♦ వా నఖరేఖల్
మేలొదవ నిలిపిచూపెను
లాలితముగ ఛురితమునకు ♦ లక్ష్యము లనుచున్. 74

కం. చనుఁగవపైఁ బదిగోరులు
దినుసేర్పడ నిల్పి తరుణి ♦ తెలిసితివే యీ
ఘనశశకప్లుతములకున్
దనరెడి లక్ష్యములు వలపు ♦ తమినిగుడంగన్. 75

తే. గీ. బటువుగుబ్బలక్రిందట ♦ బొటనవ్రేలి
నఖములను నిల్పి మిగిలిన ♦ నఖములన్ని
చంటిమొనదాక పై రేఖ ♦ లంటదిగిచి
గమిచెను మయూరపతక ల♦క్ష్యంబు లనుచు. 76

కం. గళమదనాలయ మృదులూ
రుల గోరుల వరుసనిలిపి ♦ రుచిరాంగి సము
జ్జ్వలి తార్ధచంద్రరేఖల
నెళవులు భావింపుమనియె ♦ నేర్పుదలిర్పన్. 77

కం. చంద్రార్ధరేఖ లిరుగడ
సాంద్రముగొని కొనలువరుస ♦ సంగడిదేఱన్

చంద్రాస్య కలరనిడెఁ గవి
చంద్రుం డివి మండలపరి♦చారము లనుచున్. 78

ఆ. వె. నాల్గు మూఁడు రెండు ♦ నఖరేఖ లంగన
ఘననితంబ జఘన ♦ కక్షమూల
ముల లిఖించి లక్ష్య♦ములు చూడుమనెఁ బద్మ
పత్త్రినేత్రి కుముద♦పత్త్రములకు. 79

వ. అని దంతక్షతంబు లెఱింగింపం దలంచి. 80

చ. పలుమొనలంటనీక నును♦పారఁగ వాతెఱ వాతెరఁ గ్రోలి మూఢకం
బలవడె నంచు కెంపెదవి♦నంటఁగఁ బల్మొనలేర్పరించి సొం
పలరఁగ సత్ప్రవాళమణి ♦ యంచు రదాంశుకమూలమందు గుం
పిల నొకగంటి పంటనిడి ♦ బిందుక మంచు వచించెనెంతయున్. 81

కం. మానుగనధరము బల్మొన
లానుచుఁ దగఁబీల్చి చూడు ♦ మజ్ఞాసన యు
చ్చూనక మిదియని పలికెను
మానక బిల్హణుఁడు నృపకు♦మారికతోడన్. 82

ఆ. వె. అలికకక్షగళము ♦ లందుఁ బల్మొనలన్ని
నిలిపి బిందుమాలి ♦ కలరకనుచుఁ
జనుల దంతఘాత ♦ మొనరించె ఖండాభ్ర
కంబులంచుఁ దెలిపె ♦ గవివరుండు. 83

కం. చనుదోయిమీఁదఁ బల్మొన
లెనయఁగ గాటంపుతేట ♦ నిడి బోధించెన్
ఘనమైనకాలచర్విత
మునకున్ లక్ష్యంబు మదన♦మోహిని యనుచున్. 84

వ. తదనంతరంబ చుంబనప్రకారంబు లెఱింగింపం దలంచి. 85

సీ. తనమోవి ముదిత సి♦గ్గునఁ జుంబనముసేయ
దానిపై పెదవి దా ♦ నానుకొనుచు
సుదతినెమ్మోమున ♦ కెదిరించితొలుత కె
మ్మోవిపానకమాని ♦ ముద్దుగొనుచు

కరములఁ గనుదోయిఁ◆గప్పఁగ దనమోవి
దాని నాలుకకొన ◆ నాననిడుచు
వెనుకనిల్చి కరంబు◆లను బుగ్గలంటి నె
మ్మొగమెత్తి తమిదీఱ ◆ ముద్దుగొనుచు
తే. గీ. ముదిత నడ్డమునిల్పి కె◆మ్మోవిగొనుచు
భ్రాంతి తిర్యగముల రెంట ◆ బహురసాప్తి
చుంబనమునంటి స్ఫురితాభి◆తంబులు ఘటి
తంబు భ్రాంతిఁ దిర్యక్పీడి◆తంబు లనియె. 86

తే. గీ. ముదిత కెమ్మోవి యంగుష్ఠ◆ములనుదిగిచి
పట్టి నాలుకఁబఱపి చుం◆బనము జేసి
విఘటితాఖ్యకు లక్ష్యంబు ◆ విద్రుమోష్ఠి
తెలియుమని పల్కెఁ గవిరాజు ◆ తేటపడఁగ. 87

కం. పలుమొనలంటక నాలుక
నలముచుఁ గెమ్మోవి యధర◆నామక మనియెన్
లలినిటుల నుత్తరోష్ఠము
నలముచుఁ బెలి యుత్తరాఖ్య ◆ మగు ననిపలికెన్. 88

కం. తన రదనచ్ఛదన యుగం
బును వనితాధరయుగంబు ◆ పుటముగనిడి చుం
బనమొనరింపుచు సంపుట
మని లక్ష్యముఁజూపె బిల్హ◆ణాహ్వయుఁ డెలమిన్. 89

తే. గీ. అధరములఁ జుంబించువేళ జి◆హ్వాదలంబు
మెలఁప ననువదనంబని ◆ తెలియఁబల్కి
కపటనిద్రఁ గొనర్చి తా ◆ నపుడువచ్చి
పతులఁజుంబించె నిది ప్రమో◆దాఖ్య యనుచు. 90

తే. గీ. దర్పణంబులఁ దమనీడ ◆ దేర్పరించి
కనసి చుంబించె ఛాయికం ◆ బిది యటంచు
దాని పోలికనున్న చి◆త్రరుపుఁగాంచి
నొనరఁ జుంబించి భ్రాంతికం ◆ బనుచుఁ బలికె. 91

కం. కనుగవ వాతెఱ కుత్తుక
చనుగవ చెక్కులును ముక్కు ♦ చక్కనిఫాలం
బనువుగఁ జుంబించుచు నివి
వనితా మోహాన్వితముల ♦ వైఖరులనియెన్. 92

వ. మఱియు నాలింగనభేదంబు లెఱింగింపఁ దలంచి. 93

తే. గీ. ఎదురుగనునిల్చి నునుతొడల్ ♦ గదియ నీదు
జానువులఁ జుట్టిపట్టి వృ♦క్షమునఁబ్రాఁకు
తీఁగపోలికఁ గెమ్మోవి ♦ తేనెఁద్రాగి
వెలఁది భావింపు మిది లతా♦వేష్టితంబు. 94

చ. ఉవిదరో నాదుపాదమున ♦ నొక్కపదంబిడి యూరులందు రెం
డవపదముంచి మూపునఁ ద♦డంబడనీక భుజంబులాని చ
న్నవగదియించి కౌఁగిలిడి ♦ కమ్మనివాతెఱఁ గ్రోలిచూడు మిం
పవుఁగద బాలనీమదికి ♦ నారయ వృక్షనిరూఢభావముల్. 95

కం. విరిపాన్పునఁ దరుణిని దాఁ
గరచరణాద్యవయవములు ♦ కౌఁగిటనిడి బి
గ్గఱ ముడుచుచు విడుచుచుఁ గవి
వరుఁ డనెఁ దిలతండులాఖ్య ♦ వైఖరి దెలియన్. 96

కం. పానుపుమీఁదను దరుణియు
దానును నొకమేననంగఁ ♦ దగి కౌఁగిళులన్
బూనుకొని క్షీరనీరం
బౌ నిది మదినూహసేయు ♦ మబలా యనియెన్. 97

కం. తనతొడలనడుమ జవ్వని
నునుతొడ లటుబిగియఁ బట్టి ♦ నొక్కుచు నాలిం
గనమొనరించెను వేడుక
ననచఁగ నూరూపగూహ♦నం బని తెలియన్. 98

కం. తురమొరలీడఁగఁ జన్నొన
నురమునగదియించి మోహ ♦ మొప్పఁగ గుహ్యాం

తరమున జఘనంబిడ సుం
దరి యిది జఘనోపగూహ♦నం బని పలికెన్. 99

తే. గీ. మొగముమొగమును గెమ్మోవి ♦ మోవినుదురు
నుదురు తొడలనుదొడలును ♦ బదముపదము
లక్షులక్షులు వక్షంబు♦వక్షమదిమి
లక్ష్యమునఁ జూపెఁ బ్రియుఁడు లా♦లాటికంబు. 100

వ. మఱియు బంధవిశేషసంబంధంబు లెఱింగింప నుద్దేశించి. 101

కం. ఆనతము నాభినతమున
నానత తిర్యక్స్థితాహ్వా♦యోత్తానితముల్
గా నైదువిధములని స
న్మానముతోఁ దెల్పె సురత♦మర్మములెల్లన్. 102

‡ తే. గీ. పదమొకటి మూఁపుపైఁగొని ♦ పదము చరణ
ములనడుమఁజాచి మోహంబుఁ ♦ జిలుకుచున్న
వనిత నిది వేణుదారకం ♦ బనుచుఁ గూడె
బిల్హణుండు వినిర్జిత♦మల్హణుండు. 103

కం. తరుణీమణిజానువు తన
శిరమునసిడి యొకటికిందఁ ♦ జేర్చినయంతన్
మరుకేళిసల్పె దానిం
బిలుసగవలరార శూల♦చితబంధ మగున్. 104

కం. ఇరువురి పాదతలంబులు
నొరయుచుఁ దోరణముల్పట్టు ♦ లొగిఁగనుపింపన్
మరుకేళిఁదేలెఁ గవివరుఁ
డరయఁ బ్రభావతియనంగ ♦ నగు నిదియనుచున్. 105

చ. కరములు జానుమధ్యములు♦గాఁ గొని పైఁ దనకంఠమూనినన్
దరుణికరాబ్జమధ్యమునఁ ♦ దానుశయంబులుసూచి తత్పయో
ధరకలశాగ్రసంగ్రహణ ♦ తత్పరుఁడై కనగూడె రాట్కులా
భరణతనూజ దీని ఫణి♦పాశముగాఁ గనుమంచు నెంతయున్. 106

తే. గీ. తనదు సుశ్రోణికోపరిఁ ♦ దన్మృదూరు
యుగళ సంస్పర్శమొనరఁ దా ♦ వగలుగులుక
సురతమొనరింప నాగర♦కరణ మనుచుఁ
దెలిపె నయ్యామినీపూర్ణ♦తిలకతోడ. 107.

కం. ఏకపదానతయును లస
దేకపదాయతయునైన ♦ నింతికి నెదురై
యాకొలఁది తానొనర్చుచుఁ
జైకొని యిది యుగ్మపదము ♦ పద్ధతియనియెన్. 108

కం. పద వదన బాహువులు త
త్పద వదన భుజంబులంటఁ ♦ బరిరంభణముల్
గదియించి కూర్మకరణం
బిడియని రతిసల్పె భూసు♦రేంద్రుఁడు ప్రీతిన్. 109

కం. ఒకపద మూర్ధ్వముఁజేయుచు
నొకపదము ధరిత్రినిలిపి ♦ యుత్సాహమునుం
బ్రకటింపుచు సతిగదియుచు
వికచాంబుజనేత్రి సింహ♦విక్రమ మనియెన్. 110

కం. అపసవ్యజంఘనతము త
దుపరిని సవ్యంబుగూర్చి ♦ యున్న సతిని బా
నుపమునఁ గ్రీడింపుచు మో
హపు విందిది యర్ధపంక♦జాసన మనియెన్. 111

వ. కుడియెడమైన జానువులు ♦ గూర్చుచునిర్వురఁ దీర్చి కోరికల్
దోడఁబడ హెచ్చరించి తమి♦దొట్టిల భావజకేళిసౌఖ్యమే
ర్పడఁ గొనిపల్కె బాలవిను ♦ పద్మినివోట హితోక్తి నీవు గో
రెడి పటుపంకజాసన మె ♦ ఱింగితివే రతిలక్ష్యమెంతయున్. 112

వ. అని మఱియు ఘల్లరీముఖ సంఘట్టనా బాహుబ కోద్భుఘ్న కర్కటిక సంయమన పరివర్తన సముద్ధుర విదష్టక ద్విపాల ధేనుక వృగ ఖగాదిక విదితంబులగు సనత్కుమారమతానుసరణ కరణాంతరంబు వినోదపఱచి చేసి కాల వేగపరిమాణంబు లెఱింగించి తాడనా స్ఫాలనా కర్షణాది నిర్ఘ

యంబులేర్పఱించి సుత్కృ తోత్కృత సీత్కృత హుంకృత ఫూత్కృ తాది నిస్వనభేదంబు లెఱుకపఱచి కళామోక్షహేతుక్రియావిశేషంబులం జెల్పి యలంకారభావభావానుభావలక్షణంబులకు లక్ష్యంబులుసూపి శిశిరచంద నానులేపనలొనర్చి సుగంధపటవాసనాచూర్ణంబు లుల్లంబులుపల్లవింపఁ జల్లుచు నులివలపునీటిరవసోనఁ జిలుకఁ బన్నీటికుప్పెలం గుప్పుచు ననేకవిధ గ్రథితసుమనస్తోమ దామకంబుల నలంకరింపుచు నమందానందబంధురగం ధాది నిలంబులొలయ లతాంతతాలవృంతంబుల నూత్నస్వేదజలకణజాలంబు లురులవిసరుచు నిజాంకపీఠి నధివసింపంజేయుచు వీడెంపుమడుపు లొడుపులం దడబడఁ బల్కొసలనొడియుచు ముకురఫలకావలోకనంబులఁ గులికింపుచు సరసంబులు చిలుకుచు నలినభవతిలకుండు కలికిచిలుకవజీరుని గెలుపుకలిమిఁ కిం దిలకంబవగుట భవత్పూర్ణతిలకాభిధానంబు మామకనిదానంబయ్యె నని యనునయింపుచుం జాలికామణిం గేళికావిలాసంబులకుం బ్రోడతనంబుఁ జేరుగడం దీర్చి నీదు పుంభావసంరంభగుంభనపరిరంభణాదులం దీరుపడంగోరు చున్న మదీయహృదయారవిందంబునకు విందునెఱపి పేరందుమనిన విని మనఃప్రౌఢగావునఁ దత్ప్రసంగాంగీకరణతరంగితాంతరంగయై యుప్పొం గుచు. 113

సీ. అతనుసంగరకళా♦భ్యాసదేశికకచా
ఘాతమో యన జడ ♦ కటిసటింప
చనుజక్కవలరెక్క♦లనఁ జిల్గుకంచల
సుదలంటి గుబ్బ లిం♦చుకచలింప
మరుకేళిగెలుపుజా♦టి రదనమొలనూలి
చిఱుగంటలొరయుచు ♦ మొరపునింప
వలపేనికిడిన ని♦వ్వాళిదీపపుఁ దళ్కు
లనఁజూపు కనుబెళ్కు ♦ లనుసయింప
తే. గీ. వలపువెలవెలఁబొఱఁ జె♦క్కులు చెమర్ప
నడుముగదలఁగ సరులు పె♦న్నాడ ముంగు
రులునటింపఁగ గళరవం♦బులు సెలంగఁ
బెనఁగి సిగ్గునవెదవ్రాలి ♦ బిసరుహాక్షి. 114

కం. హరిహరిపదములు బెదరెను
ధరణియుగంపించె గిరులు♦తల్లడమందెన్
బొరిపొరి తారలుడుల్లెను
తరుణీమణి యుపరిసురత♦తాండవవేళన్. 115

ఉ. కాంతునిబాణముల్ గురిసె ♦ కంధరమభ్రము కంపమొందె స
త్కాంతివిలాసమార్తికని♦కాయముదాల్చెను జంద్రబింబమా
ద్యంతము జక్కవల్ దిరిగె ♦ నబ్జము పావురమట్లు వల్కె నా
ద్యంతము జూడగా విధివి♦ధానము చిత్రముదోంచె నయ్యెడన్. 116

వ. ఇట్లు యామినీపూర్ణతిలకా బిల్హణులు రెండవ రతిమన్మథులనంగ
ననంగరాజ్యసామ్రాజ్యపదవి నేలుచు సుఖసుప్తులై యుండి రంత. 117

సీ. చలువతెమ్మెరరాక♦గలకించుమంత్రంబు
తొలుదొల్తచెవుల ♦ దొరతసంబు
చందురుపుల్గు కం♦చంబులోపల కాయి
నిండారుచీఁకటి ♦ గుండెదిగులు
తళుకు జుక్కలవన్నె ♦ నిలువరింపులబూచి
మొనయుఘూకముల క♦న్మొయి గంత
బొజుగురాసి దో♦పుడుగుంపు వెరిపింత
వలిజక్కవలపొందు ♦ వలపుమందు

తే. గీ. రిక్కరాయనిసిరి మేలుఁ ♦ జుక్కవాలు
పేరటామని నెఱదేటి ♦ పేరటంబు
ముద్దువలరాజు సుద్దుల ♦ కెద్దడింపు
దారసింపయ్యె వేకువ ♦ ధరణియందు. 118

చ. కలువలుముక్క వెన్నెలవి♦కాసముచిక్కఁగ మొగ్గదామరల్
కలిమినిలిక్క జక్కవలు♦గంతులుద్రొక్కఁ జకోరపాళికిన్
బొలపొలపొక్కఁ బాంధులకుఁ ♦ బోడిమిదక్కఁగ నిక్క నంతలో
బిలబిల వేగుఁజుక్క తెలి♦పిక్కటిలన్ దివినెక్కె నెక్కఁగన్. 119

చ. ఉదయగిరీంద్రకందరదృ♦ఢోగ్రశతఘ్నిపరీక్షకప్రభా
తదరవిహీనశాలి రచి♦తాస్తమహీధరమాళి భాగసం

విదితవిచిత్రగౌరరుచివి♦భ్రమచందనబిందులాంఛ నం
బిది యనఁ జంద్రబింబ మపు ♦ డింపెసలారఁ బరాగసంగతిన్. 120

ఉ. నాయెడ వేఱుసేయ కిఁక ♦ నాయెడ డగ్గఱఁజేరి నన్ను ర
మ్మా యను నట్లు బిల్లు లర♦యంగని చక్కటిలాగలాగపై
రోయుచుఁ గాచె సో మనవి♦రోధుల కిమ్మగువేళఁ గొక్కొరో
కో యని న్నుల్ పెల్లఱచె ♦ గూటను గుక్కుటకోటి వేకువన్. 121

ఉ. స్నేహరసాతిరేకమునఁ ♦ జెల్వు దలిర్ప మనోజకేళికా
గేహనివాససౌఖ్యముల ♦ గేరుచు నంత నిశాంతకాంత స
మ్మోహినులౌటచే విశద♦భూమికలై పగ లందివచ్చు-చో
నాహిందీపికల్ వణఁకె ♦ నట్లగు స్నేహదశాంతవేళలన్. 122

సీ. తఁరితంపునిదుర తో ♦ త్తఱపాటులోదవ ది
గ్గునలేచి వలువల ♦ నెత్తునపుడు
నెనయించి మదిఝల్లు ♦ మనఁ బ్రాణనాయకి
నినుఁబాసి దీనతఁ ♦ జనఁగవలసె
నెటులోర్తు రాత్రియె♦ప్పటికిఁగల్గునో పగ
లేలకల్గెనో మన♦పాలికనుచు
రావె ముద్దీవె కై♦కోవె నీనెనరింపుఁ
గనుమంచు మఱి మఱి ♦ కౌఁగిలించి

తే. గీ. ముదిత సెలవియ్యవే యని ♦ మోహమునను
విడువఁజాలక తడఁబడ ♦ నడుగులిడుచుఁ
దిరిగిచూచుచుఁ దమతమ ♦ తెరువులంటి
సాగినడచిరి జారు లా ♦ సమయమునను. 123

చ. సమయభగీరథుం డుదయ♦శైలమహేశ్వరు వేడి గాఢసం
తమసచరాబ్జరుక్సగర♦దారకభూతివితాన పూతకృ
ద్విమలరవిప్రభాభ్రపద♦విస్ఫుటభవ్యతరంగగంగ ను
త్తమజగదబ్ధి నింపఁగొని ♦ తార్చెననన్ దెలుపెక్కెఁ దూర్పునన్. 124

మ. ఘనభూభృద్గుహగర్భగేహవిపులా♦క్రాంతస్థితిన్ ధ్వాంతవ
ర్తనలత్యంతము గానుపించె నపు డు♦ద్యల్లోకబంధూదయం

బున నిర్వాపిస్తివహించి ధాత్రీప్రపయశః♦పుంజంబు దుర్మార్గ
వర్తన భూభృద్గుహాగర్భగేహావిపులా♦క్రాంతస్థితంబౌ గతిన్. 125

సీ. మలయాగ నిలయాగ ♦ వలయాగతములార్ద్రి
సుమధూళి మహిపాళి ♦ సుమహితములు
మందార కుందార ♦ విందారములు నుజ్జ్వ
లాసార కాసార ♦ వాసితములు
ఘనసార వనసార ♦ ఘనసారయుతములు
గజరాజ గజరాజ ♦ కామితములు
సురసాల వరసాల ♦ సరసాల శీతములు
మధుపాళి మధుకేళి ♦ మానితములు

తే. గీ. మహితనిద్రాంతమార్గరో♦మందఫేన
శీతలము లబ్జసాయక ♦ చిత్రకేళి
బాలికాకుచఘర్మసం♦స్ఖాలితములు
ధీరగతివచ్చెఁ బ్రాభాత ♦ మారుతములు. 126

కం. కుముదంబుల కుముదంబుల
కుముదంబులనలరె ననఁగఁ ♦ గోమలవిలస
త్కమలంబుల కమలంబుల
కమలంబులవిలసనములు ♦ గానఁగనయ్యెన్. 127

సీ. కమలసంభవ కోర♦కముల నొక్కలుదీఱె
వలిజక్కవల మది ♦ వగలుగూరె
జారచోరాళి హృ♦చ్ఛరికె లుగ్గడిజారె
చలువవెన్నెల రేయి ♦ పలసమారె
వలఱేని విరహుల ♦ గలిబిలిచల్లారె
కమలంపుఁగొలకుల ♦ కల్మిపేరె
రేయెుడపుల్గుల ♦ వాయి తుప్పలుమీఱె
కలువలసిరులు మొ♦క్కలము జేరె

తే. గీ. తారకలుతారె హిమవారి ♦ తరుగుఁబాఱె
చలువలుడుకారె నెలరాల ♦ జాలువారె

నిసి మిసిమిగారె మరునికై ♦ నుసులుదీఱె
తెలివివహిందీఱె నంతటఁ ♦ దెల్లవాఱె. 128

మ. కమలామోదిక లోకబాంధవ ♦ జగత్కల్యాణసంధాన చ
క్రమహానంద హరిప్రభూ!భువన♦సాక్షాత్కారివై ఘోరసం
తమసక్రూర నిశాటసంఘాట♦విదళత్కాండవప్రాభామూర్తివై
మము రక్షింపుమటంచు సద్విజుల ధ♦ర్మాలాపముల్ వర్ధిలెన్. 129

సీ. మిత్రాధికార ది♦క్పత్రికాలిఖిత శో
భనశాసనాక్షర ♦ పంక్తులనఁగ
ప్రాగబ్ధిజీవనా♦ద్రిప్రభానిధిఫలాం
తరవినిర్గత విభాం♦కురములనఁగ
రవిసదాభ్యుదయకా♦రణ పూర్వదిగ్వధూ
లీలాస్య సౌభాగ్య♦రేఖలనఁగ
మాతరక్షుభితో గ్ర♦మందేహ దేహముల్
దూసిపాఱెడి వాడి ♦ తూపులనఁగ

తే. గీ. విరహమూర్ఛిత పద్మినీ ♦ విధురశమిత
సమయసైద్యసమానీత ♦ సత్ప్రకాశ
విరళసంజీవనీ లతా♦వితతులనఁగ
నరుణకిరణము లాకాశ♦సరణినమరె 130

చ. గుఱిగలప్రైరులంటి దిగి♦గోసకునేగు తమోమృగంబులన్
దరియగువేఁటకాఁడోదిగి ♦ డగ్గఱి పొంపునఁగాచి కోరకాం
బురుహదృఢాగ్ని యంత్రముల ♦ పుష్పొడిరంబుకమర్యమాంశువ
హ్ని రహింఘటింప గుప్పుగురు ♦ నేర్పున దుమ్ములతేంట్లువెల్వడెన్. 131

తే. గీ. పద్మినీ లోకబాంధవ ♦ పరిణయంపు
వేదమంత్రాళి యనన భృంగ♦నాదమలరె
కమలకాసార భూముల ♦ గాటముగను
విశ్వబోధారుణోదయ ♦ వేళలందు. 132

సీ. అపరదిక్సంచల♦క్ష్యభిదోదయశతఘ్ని
కోస్థితాయసవహ్ని ♦ గోళమనఁగ

పద్మినీతాపలో♦పార్ధావసరమై ద్య
ఘటితసింధూరంపు ♦ ఘుటికయనఁగ
సమయలోకేశ్వర ♦ స్నానార్థపూర్వాభ్ర
కరిశిరోగ్ర సువర్ణ ♦ కలశమనఁగ
కల్యకల్యాణ చ♦క్రాయుధక్షతతమ
స్వర్భాను కంధర ♦ వలయమనఁగ
తే. గీ. దైవతాధీశ దిగ్జపా♦ధారుణీజ
తరుణలోహితకోరక ♦ స్తబకమనఁగ
నుదయశిఖరాగ్రమున భువ♦నోపకార
భారవహభాను భానుబిం♦బంబువొడమె. 133

చ. జగములు మేలుకొంట పని♦సల్పెటి గంట చకోరముల్ భుగుల్
భుగు లెదనంటి మంట బుధ♦పుంగవు లర్చనసేయు దంట విం
తగ నగు తమ్మికొమ్మ మది ♦ దంట రథాంగవిహంగదంపతుల్
తగఁగొను మేలుపంట మురు♦వంటఁగ మింటవెలింగె రంగునన్. 134

వ. ఇట్లు సకలజనానందంబైన ప్రభాతంబునందు 135

కం. ఆ రాజతనయ నగర
ద్వారస్థితమాగధప్ర♦వరమంగళగీ
తారావతూర్యముల నిం
పారఁగ మేల్కాంచెఁ బ్రాణ♦బంధునితోడన్. 136

సీ. తనివితీఱని కున్కు ♦ తరితీపుజేయ మై
విరిపూసి లేచి పె♦న్నెరులుముడిచి
విడఁబాఱు వల్వ బ♦ల్వడిఁగట్టి గట్టిగ
గుత్తంపుమొలనూలు ♦ కుదురుపఱచి
కంచెల ముడిగొల్పి ♦ గడిపైఁటసవరించి
సరులు చిక్కులుదీర్చి ♦ వరుసఁగూర్చి
కొలకులమీఱు చె♦క్కులనిండుకొను కజ్జ
లపురేఖఁ దుడిచి ద♦ర్పణముఁజూచి

తే. గీ. భూషణములన్ని సవరించి ♦ పొందుమీఱ
గజ్జెలందెలు పదముల ♦ ఘల్లురనుచు
మెఱయనడచిన యామినీ♦పూర్ణతిలక
హాళాయలు కవిరాజుమదికిఁ ద♦ద్దయు లగించె. 137

వ. మఱియు నిరువురు సమయోచితకృత్యంబులు దీర్చుకొని మెప్పొసఁగెచందంబునఁ బొందుపడియుండి రంత మదనమోహిని కళావతి సరసాళి మొదలగు సఖిజనంబులు తత్సన్నిధానసుఖాసీనలై యుండి తద్గుణవిశేషభావజ్ఞలై సంజ్ఞల ముఖవిలాసంబులలర నర్మగర్భంబుగా నిట్లనిరి. 138

సీ. తమిలేనియెడ నిద్రి♦తములయ్యెఁ గమలంబు
లబ్జాస్య యిదియుఁ జో♦ద్యంబుగాదె
నును కెంపుపలకపైఁ ♦ గనుపించె నొక్కలు
విరిబోఁడి యిది యెంతొ♦వింతగాదె
చందురుఁడాలుపై ♦ నంది జక్కవదోయి
దమికించె నిది విచి♦త్రంబుగాదె
మొలకసంపెఁగ తేటి ♦ మలసినట్లుగఁ దోఁచె
నిది మహాశ్చర్యసం♦పదయుఁగాదె

తే. గీ. పాటలాధరి మన మింత♦నాటనుండి
చూడ మెన్నఁడు నీలాటి ♦ జాడలనుచు
మాటిమాటికి భావముల్ ♦ దేటపడఁగ
సరససల్లాపములగోష్ఠి ♦ సలిపిరపుడు. 139

వ. అంత—— 140

తే. గీ. తెలిసియున్నట్టి చెలుల న♦వ్వోలయఁ జూచి
జాణతనమున వలపుఁ జూ♦చాయఁ దెలిపె
వారు విని సంతసంబునిం♦డార రాజ
తనయతోఁ బల్కి రిట్లు ని♦దర్శనముగ. 141

కం. భాసురరససకట్యాలిఁగతి
పూసలలో దారమట్లు ♦ పుష్పంబునకున్

వాసన నిలిపినచందము
గా సమకూర్చెను విధాత ♦ ఘటనలు మీఱన్. 142

తే. గీ. పొలఁతి గానున్నపని గాక♦పోవు టెట్లు
యెన్నిమాయలుపన్నిన ♦ నేమిఫలము
మృగమదముదాఁపఁ దాఁపులు ♦ మిగులకున్నె
విధికృతము దప్పిపోవునె ♦ విద్రుమోష్ఠి. 143

కం. అనిపలుకుచుఁ దమరందఱు
వినయంబున నితరులకును ♦ వినఁజేయక మ
న్ననలునెలకొనిరి పూర్వం
బునకన్న రహస్యవృత్తి ♦ పొందుపడంగన్. 144

వ. ఇట్లు కొన్నిదివసంబులు గడచిన నొక్కనాఁటి ప్రభాతసమయంబున బిల్హణుండు సకలసౌఖ్యశృంగారరసబ్రహ్మానందమూర్తియై నిఖిలసౌభాగ్యయోగ్యసమాగమంబు పూర్వజన్మాంతరఫలపరిపాక సామర్థ్యంబునంగదా యని యవనికారహితభవనాంతరంబునఁ గన్యకావతంసంబుతోడ మణిమయోచితపీఠికానిషణ్ణుండై కస్తూరికాతిలకమకరికాపత్త్రనిర్మాణంబులను గాశ్మీరగంధవిలేపనంబులను ముకురఫలకావలోకనంబులను బ్రసూనమాలికాద్యలంకృతవిశేషంబులను మందస్మితవిలోకనాదిభావంబులను జగన్మోహనవిలాసంబులనున్న యవసరంబున. 145

తే. గీ. భారతీపుష్కరప్రభా♦వత్వవేళ
గురుఁడు మిథునప్రసంగ ని♦ర్భరత గనఁడె
యని మనోరంజన ప్రసూ♦తానుమతిని
మించి పరిశీలనేచ్ఛ నే♦తెంచె నృపుఁడు. 146

చ. జరజరవచ్చి భూపకుల♦సత్తముఁ డత్తఱి నేకతంబునం
దిరముగఁజూచి డిల్లపడి ♦ దీనతఁజెంది విచారమొంది త
త్తఱిలుచుఁబల్కెఁ దానొకటి♦దల్పఁగ దైవము వేఱుదల్చుఁగా
సరసులు దైవకల్పన క♦సాధ్యములే దనికాదె పల్కుటల్. 147

వ. అని కొంతతడవు చింతించుచున్న తండ్రికిం గుమారికామణి ప్రణమిల్లిన నొల్లమిని జనవల్లభుం డిట్లనియె. 148

సీ. సకలసంభ్రమ మహో♦త్సవములు గల్పించి
నగరులన్నియు చిత్ర♦ముగనొనర్చి
షట్పన్న దేశరా♦జ్యములఁ బేర్పడియున్న
రాజకుమార వ♦ర్గములఁబిలిచి
సంబంధబాంధవ్య ♦ సరణివిచారించి
వరయోగమున స్వయం♦వరమునందుఁ
ద్వచ్చి త్తహ ర్తకు ♦ నిచ్చి సౌఖ్యము నొంద
వలె నని మదిలోనఁ ♦ దలఁచు నన్ను

తే. గీ. విడిచి మద్వంశమున కెంత♦గొడవఁ దెచ్చి
యిడితివే చెప్పరాని యా♦గడముఁజేసి
తలఁకుబెళఁకునులేక పం♦జెడగఁ జెఱుకు
గడకు వెన్నుట్టె నట్టులే♦ర్పడితి వీవు. 149

తే. గీ. దుర్గుణాన్వితవై తివే ♦ దోసకారి
సద్గుణాన్వితవని నిన్నుఁ ♦ జాలనాదు
హృదయమునఁ దల్చుకొనియుంటిఁ♦జదువవేయ
నున్న బుద్ధియుఁబోయె న♦టన్నగతిని. 150

తే. గీ. రాచకొమరులవిడిచి మ♦ర్యాదఁదప్పి
తలఁచి విద్వాంసు నేమని ♦ వలచితీవు
ధరణి విద్వతుచ దరిద్ర♦తా యనంగ
వినవె నీమది యెట్టు లీ♦పనికినొప్పె. 151

కం. పోలఁగ నీయపకీర్తి
నేలాగునఁ దాళియుందు ♦ నిదిగాకయు నా
బాలవు గోలవు నిను విడఁ
జాలక నీమీఁదిమమత ♦ సమకొనదింతన్. 152

వ. అనిన విని తండ్రికిఁ దనూభవ యిట్లనియె. 153

ఉ. నాయెడనేరమేమి ? నర♦నాయక ! నీమదిలోనఁ గృత్రిమో
పాయము పన్నినంతటనె ♦ పాయునె దైవకృతంబు మేఘమ

భ్రాయితమైనవేళ నను♦రక్తివహించి ప్రఫుల్లకోమల
చ్ఛాయలఁ బద్మినీరమణి ♦ సల్పదె మిత్రునిఁగూర్చి మోహముల్. 154

మ. కరికుంభస్థలమాంసభక్షణ సము♦త్కంఠీరవప్రాంగణా
వరుణారుణ్యతరాతిపల్లవితన♦వ్యత్సల్లకీవల్లికన్
గరమానింపదె మత్తసామజము వే♦డ్కన్ గంటకాక్రాంతమై
మెఱయన్ భృంగము కేతకీకుసుమస♦మ్మేళంబుఁ గావింపదే? 155

శా. స్వామీ నేరములేదు నావలన నీ♦సర్వంబు నీకృత్రిమ
స్తోమంబే నిను భ్రాంతిముంప సమయ♦స్ఫూర్తిన్ మదీయానన
క్షేమాలోకనబద్ధకాండ పటరా♦జిఁ గూర్చి తౌఁగాదె మ
త్ప్రేమానందకరాశ యగ్రహణకా♦రిప్రాప్తిగా మున్నుగన్. 156

తే. గీ. అకట నవమన్మథాకారుఁ ♦ డైన యితని
నెట్లు జాత్యంధుఁ డని పల్క ♦ నిచ్చఁదోఁచె
మాయపన్నితివయ్య యు♦పాయమునను
గపటమే లేనిమతి దుఃఖ♦కారణంబు. 157

చ. అని వచియించుచున్న తన♦యాగ్రణిపై నెనరుంచి బాల నీ
యనుచితకృత్య మింక విడ♦నాడిన వీని విదేశవర్తిగాఁ
గను విడిపించి భూపకుల♦కాంతుని నొక్కనిఁదెచ్చి వాని ని
న్ననువుగఁ బెండ్లిఁజేసెద గు♦ణాన్వితవౌ వివరం బెఱుంగుమా. 158

వ. అని కరుణారసవశంబునం జనకుండు చెల్పిన ధైర్యస్మితావలం బినియై కుమారికావతంసంబు సంశయంబువిడిచి దేవా మదీయహృన్నేత్రి జిహ్వాఘ్రాణశ్రుతిస్పర్శనాదికంబు లేతద్వశవర్తితంబులయ్యె నింక నింద్రియ వ్యాపారరహితప్రీతిమోహమానంబైన యీ దేహంబున కెవ్వండిచ్ఛయించుఁ గావునఁ బరమార్థజ్ఞానసంపన్నుండనై జగద్విరుద్ధంబునకు బద్ధుండవుగాక బిల్హణకవీంద్రస్వాంతానువర్తిని నగునట్లు ననుం గృపసేయుమనిన విని కోపో ద్దీపితుండై సన్నిధానం బగు భుక్కుండునింజూచి జనవల్లభుం డిట్లనియె. 159

కం. ధీరుఁడ వని నినునమ్మితిఁ
జోరుఁడ వని తెలిసి విప్ర♦సూరిజనుఁడనై

జారుఁడనై చోరుఁడనై
క్రూరుఁడనై యున్నవిన్నుఁ ♦ గొనిశిక్షింతున్. 160

వ. అని జాజ్వల్యమానకోపానలాటోపంబు దీపింప నాస్థానభవనాంతరాళంబుఁ జేరి జారచోరక్రూరవిహారపూరుషాధములంబట్టి దండింప రాజనర్మంబు. బిల్హణుండు బ్రాహ్మణుండైన నంతఃపురకన్యకానియమభగ్నవ్యాచారదూష్యుండు గావున వధ్యుండు వానిఁదోడ్కొని శీఘ్రంబుగారమ్మని కరాళకరవాలభటాలుండైన కోటిపాలునిఁబిల్చి మఱియు నిట్లనియె. 161

ఉ. తడయక యోగి నేఁగినుకఁ ♦ దాల్చినచందముఁ బూని వానిలో
నడలఁగఁజేసి చేసి వెఱఁ♦గందగసిడ్చి భుజప్రకాండముల్
బెడమరఁగట్టి కట్టి మఱి ♦ బిల్హణభూమిసురాధమాధమున్
బిడికిటవాలు వాలుగని♦ వేగ శిరంబు నరంబువ్రాల్చుచున్. 161

తే. గీ. జాగుసేయక వేగ మీ♦లాగుసేయు
పురవరముఁద్రిప్పి కడ బ్రేత♦భూమియందుఁ
జేయు మిప్పనికొఱతగాఁ♦జేయుమాని
పోమ్ము సుమ్మాటి సెలవిది ♦ సుమ్ము నీకు. 163

చ. అనవుడుఁ గోటిపాలుఁ డనె ♦ నట్లగు దేవరమ్రోలధర్మమే
మని వివరించువాఁడఁ బ్రతి♦ఘాతిశయంబునశిక్షసేయ శాం
తనియతిరక్షఁజేయ ♦ ప్రభుధర్మము లోకహితంబు వాఁడె రా
జని బుధకోటిజెల్పె నన♦ఘాత్మక యంచు నమస్కరింపుచున్. 164

వ. దేవా యోగ్యాయోగ్యవిచారంబులు భవదధీనంబులై యుండు దుర్ఘటంబైన హింసాకర్మంబునందు జాగరూకంబుగా భూతభవిష్యద్వర్తమానంబులను ద్రికాలంబులను నిందాస్తుతిపూర్వకంబులగు ద్వంద్వంబులను సామభేదదానదండంబులను చతురుపాయంబులను సమర్థించి నియమించిన మదీయవచనంబునకుఁ బ్రత్యుత్తరంబిచ్చుటకు నేకారణం బని తలంచితేని యవధరింపుము సకలసామ్రాజ్యప్రమత్తచిత్తులగు రాజోత్తములకుం బరిజనంబు లోకానోకదుర్గమప్రయోజనంబులఁ బ్రబోధించుట యవశ్యకర్తవ్యంబై యుండుఁ గావున విన్నవించితి నింతియకాని భవద్వాక్యప్రసాదానుమోదితుండ ననిన నొక్కింతసుముఖుండై యతండు వధ్యస్థలంబునకుఁ

జేరునప్పటి ప్రచారంబులును దన్ముఖోద్గతవాక్యవిశేషంబులును దదుచిత భావంబులును సర్వంబు మాకెఱింగింప నంగీకరింపుమని సావకాశంబొసంగి నన్ బ్రసాదంబని తనబలంబులతోడంగూడి బిల్హణసమీపంబునకుంజనిన వారలంత నచ్చట 165

తే. గీ. తలవరులఁజూచి యేమియుఁ ♦ దలఁపరైరి
నిమిషమాత్రంబు మానంపు ♦ నియతినుండి
బ్రాహ్మణుం డిట్లు వల్కె నో ♦ పద్మగంధి
నీకువాఁడను దుఃఖాబ్ధి ♦ నీదువాఁడ. 166

కం. ఓ కార్తస్వరవిగ్రహ
యో కల్హారప్రియాస్య ♦ యో కలకంఠీ
యీ కాలమునకు మనజత
కాకకోకిలవిధంబు ♦ గనుపించెఁగదే. 167

ఉ. నీమదినమ్మియున్నఁ నను ♦ నీవయెఱుంగుట లింతెచాలు నో
భామిని పూర్వజన్మఫల♦భాగ్యము లేవిధినున్న భోగ్యమే
వేమఱుదెల్పనేల చను♦విచ్చి ననుందయఁజూడకున్న మి
థ్యామయసర్వదిగ్వలయ ♦ మంధతమఃపరిపూర్ణమౌఁ జుమీ. 168

కం. రమణీబలామ 'రాజా
నుమతే ధర్మం' బటన్న ♦ నుడువునఁగల భా
వము జరిగింపక వశమే
మమతలుఁవిడనాడి నెనరు ♦ మఱవక మదిలో. 169

వ. అని ధరామరవరుండు కరంబు కరంబునందెనచి గుటిపఱచి వెరవుమఱచి చిఱుతరతనంపుటుప్పరిగ వెడలె నయ్యెడ నప్పుడమితేనికన్నియ విన్నదనంబునం గొన్నివన్నియు లెన్నుకొని మిన్నుమన్ను నెఱుంగక యొరం గినం గురంగటమెలంగు మెఱుంగుబోఁడు లచ్చేడియ నాదుకొని పాదు కొల్పిన వేదనల నేదియోతార్చినం గార్చిచ్చుచందంబునం బైపేర్చుశోకాన లంబు దరియింపంజాలకీ బాలికాజనచూళికారత్నఁబు మఱియును. 170

తే గీ. నిబ్బరపుటూర్పు టుబ్బులా ♦ గుబ్బకొనఁగ
తోరముఁగ వేడికన్నీరు ♦ దొరఁగిపాఱ

నుల్లమవియఁగ గుండెలు ♦ ఝల్లుమనఁగఁ
దల్లడిల్లుచు మదిలోనఁ ♦ బెల్లుదలఁచు. 171

చ. కనలుచు మేనుదీవ కసు♦గందఁగఁ జెక్కిటఁ జేయిఁజేర్చి వే
దనలనలంగి క్రొమ్ముడి య♦దాయదలై విడఁబాఱ హారముల్
బెనఁగొని త్రెళ్లఁగా బొటన♦వ్రేలను నేల నొకింతరాయుచుర్
మనమునఁ జింతచేసె చను♦మానముఁగల్గిన నాఁటి సర్వముర్. 172

సీ. ప్రియముతో మాతండ్రి ♦ పిల్పించి మాయలు
గల్పించి చదువున ♦ నిల్పనేల
నిల్పిననేమి ! యా ♦ నిశివేళఁ గవిరాజు
చంద్రోదయము కీర్తి♦సలుపనేల ?
సలిపిననేమి ! యా ♦ సమయంబునందు నే
చోరకవీంద్రుని ♦ జూడనేల ?
చూచిననేమిఁ పాణి♦జ్ఞుఁడు పద్మగర్భుండు
కోరి మమ్మిరువురఁ ♦ గూర్పనేల ?

తే. గీ. మేలమిసమకూర్చి యిపుడేల ♦ యెడముఁజేసె
నేమిసేయుదు దైవంబు ♦ నేమనందు
విధికృతంబిట్లు కాఁబోలు ♦ ప్రథితకర్మ
ఫలవిపాకంబు దప్పింప ♦ బ్రహ్మవశమె. 173

సీ. దానశీలురనెల్ల ♦ దీనులఁజేయు లు
బ్ధాత్ములకర్థ లా♦భములుగూర్చు
దీర్ఘరోగులఁజేయుఁ ♦ దవిరెసంపన్నుల
నారోగ్యమొసఁగు ఘు♦ధాతురులకు
సూక్ష్మజీవులఁజేయు ♦ సుగుణవిద్యాఢ్యుల
నధికజీవులఁజేయు ♦ నల్పమతుల
సుజనప్రభుల కాత్మ♦జులఁగూర్పమాని పే
దల కిల బహుళసం♦తాన మొసఁగు

తే. గీ. కులముకొఱఁతల కధికార♦బలములిచ్చి
కులమువారికిఁ దిరిపెంపుఁ ♦ గూడొసంగు

నోర్చి జతసమకూర్చుఁడు ♦ కూర్చెనేని
బ్రహ్మ దాన్నిట్లుసేయును ♦ పాపకారి. 174

సీ. తాతపేదరి యవ్వ♦ఘాతరి తల్లిచం
చలురాలు పరమయా♦చకుఁడు తండ్రి
కొడుకుసన్యాసి జా♦రుఁడుసోదరుండు మా
తులుఁడుగురుద్రోహి ♦ తోడఁజుట్టు
పాఁబోతు శిఖండి♦బావ మేనల్లుఁడు
బాహ్యకోపి యప్పల♦బ్రతుకు కులము
పనికులాలకవృత్తి ♦ భావంబు దరిలేని
దిల్లాలు రాగ పు♦ట్టిల్లు నాభి

తే. గీ. తాను తలగొట్లమారియై ♦ తగుదు ననుచు
జగములన్నియుఁ దనదు పా♦లగునటంచుఁ
దలఁచుటయె కాని తనమాట ♦ తానెఱుంగఁ
జాలఁ డేలాటి పెద్ద జే♦జేలపెద్ద. 175

వ. అని విధిని నిషేధింపుచు. 176

ఉ. వేమఱు తల్లితండ్రి యవి♦వేకత కేమనుదానఁ గాగ్యసు
త్రామగురుండు మంత్రి వివ♦రంబుల కేమని తల్చుదాన నా
నోముఫలంబు దానిటుల ♦ నొందిన నేగతిఁదాళుదాన నే
నేమిటనోర్చుదానఁ బర♦మేశ్వర నన్ గృపఁజూడు శ్రీహరీ. 177

తే. గీ. అక్కటా పరమేశ్వరుఁ ♦ డంతవాని
కనుభవింపక తీఱనే ♦ మొనసిబ్రహ్మ
ఘాతపాతకజాత దుః♦ఖంబుగానఁ
గూడ దనరైరి పెద్దలే ♦ జాడనైన. 178

చ. మఱి కలవృక్షు లిట్లు నయ♦మార్గము గాదనరైరి ధారుణీ
వరుఁడవినీతిదప్పె సభ♦వారలు ధర్మమెఱుంగరైరి ము
త్పరిజనపాళి మేలగును♦పాయము చెల్పకయుంటి నింకశ్రీ
హరికృప దప్పివచ్చె నెడ ♦ నాప్తులు శత్రులుకారె చూడఁగన్. 179

మ. కులముల్ వోయినఁబోవనీ బుధులుచి♦క్కుల్వెట్టినన్ బెట్టనీ
నెలవుల్ దప్పిన దప్పనీ చెలిమిక♦న్నెల్ నవ్వినన్ నవ్వనీ
ప్రళయంబందిన నందనీ యిఁక విచా♦రప్రక్రియాశూన్యని
శ్చలహృద్బిల్హణసౌఖ్యదవ్రతకళా♦సంసిద్ధికై యుండెదన్. 180

వ. అని సర్వప్రపంచంబు మఱచి పంచేంద్రియవ్యాపారంబులు గడచి గురుమనోహరధ్యానపారీణయై యుండె నంత. 181

తే. గీ. ఇమ్ము వెడలిన నుడికొమ్ము ♦ యెమ్మెకాని
కొలముసామిని జూచి నీ ♦ కొఱకుమమ్ముఁ
బనిచె నెకిమీఁదు తనవీట ♦ నెనయఁద్రిప్పి
కినుక నుసురులు గొనుమని ♦ తలఁపుఁజేసి. 182

వ. అని రాజాజ్ఞ విన్నవించి కోటిపాలుండు తన బలఁబుతోడ బిల్హణుం బరివేష్టించి రాజభవనద్వారంబు వెడలి ఘంటాపథంబునం జను నవసరంబున. 183

సీ. చూచెదరేమి యీ ♦ చోద్య "మత్యుచ్ఛ్రియః
పతనహేతు" వటంచుఁ ♦ బల్కువారు
ధర "నవశ్యమనుభో♦క్తవ్యం కృతంకర్మ"
మను శుభాశుభము లి ♦ ట్లనెడువారు
నయమున్న నేమి? "వి♦నాశకాలే విప
రీతబుద్ధి" యని చ♦రించువారు
జగతిలో సతిపూర్వ ♦ మగు "వినయం ధూర్త
లక్షణ" మనుచుఁ ద♦లంచువారు

తే. గీ. కటకటా బిల్హణుని కట్టి ♦ కష్టవృత్తి
వచ్చె ననువార లగుచు స♦ర్వప్రపంచ
మపుడుఁ క్రుంగినపగిది నా♦హారవంబు
లఱచి రప్పుడు తత్పుర♦వరజనములు. 184

వ. ఇట్లందఱు గురుజనమహోపద్రవంబున కాపరాని పరితాపంబు నొందుచు సర్వకృత్యంబులుమఱచి తత్పరాయత్తచిత్తులై సాముదాయక భావంబున రాజద్వారంబుఁ బరివేష్టించి. 185

మ. అకటా యీమదనాభిరామనృపుఁ డి♦ట్లన్యాయవృత్తిన్ ధనో
ర్వీకళత్రాత్మజమిత్రబాంధవయుతశ్రీ♦నిత్యమం చాత్మనెం
చి కవీంద్రోత్తముఁడైన బిల్హణుని హిం♦సింపన్ విచారించె ని
త్యకళంకాశ్రయుఁడంచుఁ బల్కిరి పురం ♦ బాబాలగోపాలమున్. 186

తే. గీ. అకట సర్వంసహాభర్త♦యైన తనకు
బ్రాహ్మణద్వేషలేశంబు ♦ ప్రాభనైక
లీల నణఁగింపఁజాలు స♦మూలముగను
జిచ్చురవతూల రాశిని ♦ జెలఁగినట్లు. 187

సీ. జన్మాతిశయదుఃఖ ♦ జలచంద్రయోగంబు
వంశసస్యక్షేత్ర♦వ గ్రహంబు
దారిద్ర్యలతికావి♦తాన దోహదకేళి
ఘనకష్టజీవన ♦ కారణంబు
దురితోపదేశ స♦ద్గురుమంత్రసారంబు
మిథ్యాపవాద స♦మృద్ధికారి
దైన్యగుణాభీష్ట♦దైవ సాక్షాత్కార
మజ్ఞానదీప తై♦లాభివృద్ధి

తే. గీ. కోప భయ తాప హైన్యఘం♦టాపథంబు
పరమకారుణ్యకీర్తి శాం♦భవిపదంబు
ప్రాణహరణంబు బ్రాహ్మణ ♦ పరిభవంబ
నంగ విప్రాపకార మె♦న్నంగ నేల. 188

తే. గీ. సగర దశరథ పాండు త్రి♦శంకు నహుష
నృగవిజయపౌత్ర కర్ణాది ♦ నిపుణమతుల
కథలు చంద్రేంద్రమూర్తుల ♦ కథలు వినఁడె
తెలిసి విప్రాపకృతి కెట్లు ♦ తెగువఁజేసె. 199

వ. అని మఱియు గుంభసంభవాది మహర్షిప్రభావంబులు వక్కా-
ణించుచు "బ్రాహ్మణావై సర్వాదేవతా" యనియును "బ్రాహ్మణో మమ
దేవతా" యనియును, "పునశ్చబ్రాహ్మణాన్ భర" యనియును "వర్ణా
నాం బ్రాహ్మణో గురు" వనియు నిత్యాది బ్రాహ్మణప్రభావోచిత శ్రుతి

స్మృతిపురాణేతిహాస ప్రయోగవాక్యోపన్యాసంబులు గావింపుచు వెండియు బ్రాహ్మణుండు చాతుర్వర్ణ్యకన్యకాపరిణయంబున కర్హుఁడుగాని గర్హితుండు గాఁడు. భూలోకంబునకు దేవతాస్వరూపు లగుటంజేసి భూమిదేవత లావశ్యకపూజనీయులుగదా యని భూభృద్వరుండు సర్వజ్ఞుండైన భుక్కం డునకు సక్కన్నియనిచ్చి యుభయకులంబుల రక్షించుకొనుటను సకల లోకోద్ధారకత్వంబు దనకు సిద్ధించునట్లు గాదేని బ్రహ్మకులంబు బిల్వణుని తోటిదిగాఁ దలంపవలయునని యేకాగ్రచిత్తంబుగా నుత్తరంబిచ్చుచున్న విద్వత్కోటికి బాటియగునట్లుగా మనోరంజనుం డిట్లనియె. 190

చ. వినుఁడి మహాత్ములార మిము ♦ వేఁడెద నాదగువిన్నపంబుఁ గై
కొని సుముఖస్థితిన్ విభుని ♦ క్రూరతకుం దురితంబు మాఁనుడీ
పనిబహుదుర్ఘటంబయినఁ ♦ బొల్పడి యేనిది నిగ్రహించెదన్
వినయవివేకధర్మపద♦విం దగఁగూర్చెద రాజకుంజరున్. 191

తే. గీ. అధిపతికిఁ బ్రాణసచివుఁడ ♦ నగుటహితవుఁ
దెలిపి మలిపింతుఁ గాదేనిఁ ♦ దెగువఁజేసి
ఖండనోక్తులువల్కి భూ♦కాంతుఁడొక్కఁ
డై భయమునొంద సర్వమే♦కీభవింతు. 192

చ. సొలయకమీరు నాపలుకు ♦ నూటి త్రిశుద్ధిగనమ్మి మీగృహం
బుల కతివేగనేగి పరి♦పూర్ణమనోరథసిద్ధికై విని
శ్చలమతి దాన హోమ జప♦శాంతి తపఃప్రముఖాదిసత్క్రియల్
వెలయఁగజేయుఁ డీశ్వరుఁడు ♦ వేకరుణించుఁ బ్రసన్నుఁడై మిమున్. 193

శా. దుర్వారోగ్రమహాగ్రహాగ్రథితుఁడై ♦ దుష్టాసురేంద్రుండు ని
ర్గర్వారంభకడింభకప్రభుపరీ♦క్షాదీక్షదక్షవ్రతా
ఖర్వాత్మస్థితి నున్నవేళ హరిసా♦క్షాత్కారుఁడయ్యెం గదా
'సర్వంవిష్ణుమయం జగత్తె' నెడి వా♦చారూఢి సత్యంబుగన్. 194

మ. అటు లేకాగ్రమతిన్ సదాహరిపద♦ధ్యానాత్ములై యుండుఁడి
ప్పటి కార్యంబిది యంచుఁదెల్పి పనుసం♦ప్రాప్తావకాశజ్ఞులై
స్ఫుటశోభాయత వక్త్రసంపదలగి♦ముల్ సేరి రిట్లూహాప
న్నుటలెన్న న్నృపకోటికెల్లను బ్రధా♦నుల్ సుప్రధానుల్ గదా. 195

**వ.** ఇట్లు మంత్రీశ్వరప్రబోధిత తత్పురస్థితశిశుబాలవృద్ధస్త్రీ పురుషాదిజనంబుల దాక్షిణ్యాలాప కలకలంబులాకర్ణించి ఖడ్గంబులు ధగద్ధగాయమానంబులై వెలుంగ భయకంపనస్వేదగుణంబు లుదయింప ఝళిపింపుచు హుంకరించిన జంకుఁగొనక బిల్హణుండు మందస్మితవదనారవిందుం డై నఁ జూచి యాశ్చర్యంబునొంది కోటిపాలుం డిట్లనియె. 196

సీ. జగతి శిరచ్ఛేద ♦ సమయమందునఁ గర్ణ
కుండలంబుల కాంక్షఁ ♦ గొనెనటన్న
సామెతనిజముగా ♦ సమయించువేళను
భయమింతలేక ని♦బ్బరముఁబూని
చిఱునగవొప్పఁ జే♦సెడి కారణంబేమి
తెల్పు మిప్పనికి భీ♦తిల్లుచున్న
వాఁడ నేననిన వి♦ద్వన్మౌళివల్కె-నో
నాయకాగ్రణి విను ♦ నాదువిధము

తే. గీ. మోహినీవిద్య యామినీ ♦ పూర్ణతిలక
యై యవతరించి నాహృద♦యారవింద
మందు వసియించి చిరతరా♦నందమొసఁగు
నట్టి నాదేవిగల్గ భ♦యంబుగలదె. 197

వ. అని ధైర్యస్థైర్యగాంభీర్యధురంధరుం డగుచు స్వేచ్ఛాగమనాగతుండు గావునఁ గోటిపాలసహితంబుగాఁ దనమందిరంబునకరిగి కులవధూరత్నంబు నిశ్చలచిత్తయౌనట్లుగా నుచితమార్గంబు రహస్యంబుగా బోధింపుచు నిజశిష్యవర్గసంసేవ్యమానుండై యుండె నంత. 198

కం. ఖరకిరణాన్వయ శేఖర
ఖరవిదళత్కాండకాండ♦కాండశిఖర శే
ఖర లగ్నసుకర హిమశీ
కర నికరీకృతమహామ♦కరనిలయాంకా. 199

శా. వ్యాఘ్రక్రోడతరక్షుఖడ్గముఖ♦సత్త్వాటవ్యటత్కృవ్యభు
క్సిద్ఘ్రాణప్రళయీకృతాశుగదశ♦గ్రీవాఖ్య రక్షోధరా

ఉక్షీణఘోరరణోన్మూలన నిశ్చయప్రమదహృద్గీర్వాణభక్తాత్మరు
ఙ్ముఖ్యుగ్రఘూదివ్యధినాథ తారకపదా♦సుగ్రీవసంపత్ప్రదా. 200

మానినీవృత్తము.

కుండలితాధృత♦కుండిక హృద్భయ♦కుండలి రాణ్మణి♦కుండల కో
దండలిఖండన♦దండవనాశ్రమ♦దండిత రావణ♦దండ ధరా
ఖండలచిత్రశి♦ఖండిజసన్నుత♦ఖండితదుర్వ్రత♦ఖండ యశో
మండలశాశ్వత♦మండిత భావిప♦మండలధామ ర♦మాగ్రభుజా. 201

,, గద్యము ,,

ఇతి శ్రీరామచంద్రగురుకరుణాకటాక్షవీక్షణసంలబ్ధ సకల సంపూర్ణ సరస
శృంగారరసధారాధారమాధురీధురీణాలంకారితాంధ్రగీర్వాణ కవితావిలాస
చిత్రవిలసితాపస్తంబసూత్ర భారద్వాజసగోత్రపవిత్ర చల్లపిల్లకుల
సుధార్ణవరాకానిశాకరయశోధురంధర ధరామరప్రవరరామయ
నామార్యపౌత్రి కామకవిసుపుత్రి సకలవిద్వజ్జనవిధేయ నర
సయ నామధేయప్రణీతంబైన యామినీపూర్ణతిలకావిలా
సంబను శృంగారమహాప్రబంధంబునందుఁ బంచమా
శ్వాసము సంపూర్ణము.





# యామినీపూర్ణతిలకావిలాసము

## షష్ఠాశ్వాసము



శ్రీ వెలయు చళ్లపిళ్ల కు
లావన శుభవినయ కామ◆యార్య హృదయరా
జీవ సుఖలీనమధుకర
భావప్రభు సోమరామ ◆ పావననామా.

వ. దేనా యవధరింపు మనంతరంబ. 2

తే. గీ. అటు లోకముహూర్త మాత్ర మా◆త్మాంకన వ
సించు కులసతి బోధించి ◆ శిష్యవర్గ
మలమి తనుగొల్వఁ దలవరు ◆ లరుగుదేర
వెడలె నిర్భీతుఁడై వీధి ◆ వీధి కతఁడు. 3

కం. వెలువడి పరమప్రీతిని
జెలఁగుచుఁ బూర్వానుభూత ◆ చిత్రక్రీడో
జ్జ్వల కళలగు తచ్చేష్టలు
దలఁచుచు వర్ణింపఁదొడఁగెఁ ◆ దగ నిట్లనుచున్. 4

చ. సరసకపోలభాగవిల◆సన్మృదుచిత్రిత చిత్రపత్త్రపీ
వరకలిత స్తనాంతర వి◆వర్తితహారగుణావలి స్మర
స్ఫురదురుచారుశోభ నృప◆పుత్త్రిక దాని నిరంతరంబు సు
స్థిరవరణీయ మోక్షఫల◆దేవతగా మదిలో స్మరించెదన్. 5

చ. వికచసరోజనేత్ర రతి♦విహ్వలలాలసగాత్రి హేమచం
పకసుమదామగౌరి తను♦భావితరోమలతాభిరమ్య సా
త్త్వికసుఖలాంఛనోత్థితగ♦తిన్ దగనై సగనై సదాని నేఁ
టికిని దలంతు వేఁలొకస♦డిన్ దడబాటగు విద్యకై వశిన్. 6

చ. అరయ సమీపవేదిక నొ♦య్యారముగా భ్రమియించువేళ మ
త్పరిచిత మార్గదృష్టిముఖ♦దత్త కరాంబుజనై కలస్వనా
నురచిత మత్సమాహ్వయ వి♦నోదపదాభితరంగితాత్మవై
ఖరుల నెసంగుదాని సుము♦ఖస్థితు లిప్పటికైనఁ దల్చెదన్. 7

చ. లలి నొకరాత్రివేళ నొక♦లాగున శయ్యను బవ్వళించు లీ
లలు మదినెంచి తుమ్మినఁ జ♦లంబున నగ్గని బాలరోషదు
ర్మలమతినైను సుజీవ యను ♦ మంగళవాక్యము మాని కర్ణకుం
డలఘటసం బొసర్పుట డి♦టంబుగ నామది నుండె నేఁటికిన్. 8

మ. దళదంభోరుహపత్త్ర కాంతరహరి♦ద్రాభంబు గోరోచనా
తిలకోద్భాసురఫాలభాగ విభవో♦త్సేకంబు కించిన్మదా
విలదృగ్జాలకళాభిపాతమగు త♦ద్బింబోష్ఠి మందస్మితో
జ్జ్వల వక్త్రాబ్జము జూడనేగు నిది మ♦త్స్వాంతంబు దా నేఁటికిన్. 9

చ. లలితవయోవిలాసకళ♦ల న్విపరీతరతాభియోగ సం
చలన సముద్భవశ్రమ ర♦సస్ఫుట సాంద్రకణాగ్రమౌక్తిక
జ్వలితము హేమకుండల సు♦వర్తనచిత్రితగండభాగ మ
చ్చిలుకలకొల్కి నెమ్మొగము ♦ చిత్తమునందుఁ దలంతు నేఁటికిన్. 10

చ. అభినవగానవాఘ్య హరి♦ణాక్షి కళాపరిపూర్ణచంద్ర స
న్నిభముఖి గౌరకాంతితరు♦ణీమణి పీనకుచాభిరమ్యయా
ప్రభునరకస్యకామణిని♦గ్రమ్మఱఁ జూచితినేని మన్మథే
షు భవశిఖివ్యథాంగ హిమ♦సుస్థితు లిప్పటికైనఁ జేసెదన్. 11

చ. అసమవిలాసయోగ్య నవ♦యౌవనలక్ష్మి ప్రభాతవిస్ఫుర
ద్బిసరుహపత్త్రనేత్ర ఘన♦పీనపయోధరభారఖిన్నచం
ద్రసమమనోహరాస్య యగు ♦ దాని కవుంగిటఁ బూని నేఁటికిన్
భసలము పద్మమట్లు వద♦నం బటుక్రోలెద నిచ్చదీఱఁగన్. 12

చ. కులుకుమిటారి గబ్బిచను♦గుత్తులు మెచ్చుగవిచ్చు దమ్మిరే
కులు బలువిప్పు కన్నుగవ ♦ కొంచెపుటుగ్గుల నిగ్గుదేరు వే
నలి జిగిగల్గు దానిని మ♦నంబున సద్గురుబోధ యట్లు ని
శ్చలమతి సంస్మరించెద ని♦జంబుగ నిప్పటికైన మాటికిన్. 13

చ. నవవికచాగ్రకుందరద♦నంబు మదీయ మనోనుకూలమై
భవరమణీయ తిర్యగభి♦వర్తితలోల విలోచనాంతిక
చ్ఛవిసదనంబు తన్మృదుహ♦సద్వదనంబు ముదంబున న్మదిం
దవిలి కృతోపకారము కృ♦తజ్ఞుని యట్లు తలంతునేఁటికిన్. 14

చ. సరసమృదుద్విరేఫకుల♦శబ్దము ఫుల్లసరోజనేత్ర సం
భరితము కించిదుల్లసిత♦మాంసల పాండురగండభాగ ము
ద్ధురపరిపూర్ణశారదవి♦ధూపమకాంతిమనోహరంబు బి
త్తరివదనంబుఁ జూచెద ము♦దంబున నా మదినాఁట నేఁటికిన్. 15

చ. కరము పిఱుందుపై గమిచి ♦ గ్రక్కున వక్రితకంధరాగ్రయై
యురుతరదక్షిణాంసలస♦దుల్బణకేశకలాపయై నిరం
తరబహులీలల న్నెనరు♦దార్క్రనుచూపుల నన్నుఁజూచు నే
ర్పరియగు దాని జూచెదఁ ది♦రంబుగ నామదిలోన నేఁటికిన్. 16

చ. నెన రెదనుంచి నన్మనుపు ♦ నేనపరాధినటంచుఁ బాదమూ
ల నతుఁడనైన నన్గణన♦లానక కిన్కఁదలంచి గొబ్బునన్
జనునెడ పైఁటకొంగుకొన ♦ సాగిలిపట్టిన చేవిదర్చుచున్
బనివిను ముద్దు వద్దనుచుఁ ♦ బల్కినదానిఁ దలంతు నేఁటికిన్. 17

ఉ బాలమృణాలనాళ సమ♦బాహువిశాల నితంబబింబ లీ
లాలసయాన మద్వచన♦లాలసలోల మృగాయతాక్షి వ
క్రాలక నిమ్ననాభికుహ♦రాంతరయై విహరించుదాని భూ
పాలకబాలికన్ దలఁతు ♦ బల్మరు నామదిలోన నేఁటికిన్. 18

చ. జిలిబిలిపాటనేరములు ♦ చేసినవేళ మదీయభావముల్
దెలిసి చలంబుఁగొన్న యొక♦తీరున వేమఱు పల్కరించినన్
బలుకుటమాని నెమ్మదినె♦పంబిడి బాష్పనిరుద్ధకంఠయై
యలరెడియూర్పులం బెదవు♦లార్చెడుదానిఁ దలంతు నేఁటికిన్. 19

చ. కిలకిలనవ్వుచున్ వగమొ♦గింపుచు వల్వఁ దొలంగఁ జేయుచో
వలపులకింపువాని నెల♦వందపుఁబొక్కిలియుంగరాఁబుజో
జ్జ్వలరుచిఁగప్పి సాధ్వసర♦సాంచితయై రతివిహ్వలాంగియై
తలఁకుచు లోన నానగొను♦దాని మదిందిలకింతు నేఁటికిన్. 20

చ. తొలఁగనినీటుతో సురభి♦దుర్భరగంధభరంబుతోఁ జలా
చలభయకుంచితభ్రమర♦చారుతరేక్షణశోభతో ముఖో
జ్జ్వలకమలాగతభ్రమర♦పంక్తిని గేళిసరోరుహంబుచేఁ
గెలఁకులఁ జేర్చుదానిఁ దిల♦కించెద నామదిలోన నేఁటికిన్. 21

చ. అదనుదలంచి నున్మెఱుఁగు♦టద్దముఁ జూచెడివేళ వెన్కనే
నొదిగినజాడ నీడఁగని ♦ యుల్కి భయంబును సంభ్రమంబు మో
హదమదనోదయంబు విన♦యాంచితలజ్జయుఁ గల్గి సౌఖ్యసం
పద నను జూచుదాని మదిఁ♦బాయక మాటికిఁజూతు నేఁటికిన్. 22

చ. ఇరుదెసలందు నంతరబ♦హిస్థలులందుఁ బిఱుందునందు ముం
దరిదెసయందు నెల్లెడలఁ ♦ దానయి మేలిమితమ్మివంటి సుం
దరమును దిర్యగీక్షణప♦దం బగు ముద్దుమొగంబుతోడఁ గ్రు
మ్మఱు మదనాభిరామనృప♦మన్మథపుత్రిని జూతునేఁటికిన్. 23

చ. తరుణబహూకృతుల్ శ్రుతివ♦తంసకటాక్షనిరీక్షణావళుల్
సరసవిలాసముల్ మదన♦సంజ్వరకారణముల్ మదాలసాం
గి రుచిరసౌఖ్యలక్షణవి♦కీర్ణవిలోచనముల్ మదీయహృ
త్సరసిజమందు సంస్ఫురిత♦సంగతుల న్గనిపించు నేఁటికిన్. 24

చ. తరుణతరోల్లసత్తరళ♦తారకితాక్షమదభ్రగంధమా
ర్గరచిత చిత్రపత్త్రలతి♦కారమణీయ కపోలపాళికా
సరసము సౌఖ్యమన్మథర♦సాహితశోభితమంబుజాక్షి సుం
దరవదనారవిందము మ♦నంబుననుంచి తలంతునేఁటికిన్. 25

చ. సరసమెలర్పఁ దత్కుచక♦చగ్రహణాభిరతుండనైన నే
నొఱపుగమోవి పల్మొనల♦నొక్కుచు నక్కరచక్కఁజేయు న
త్తఱి సరమొందుచూపు బక♦దారిసుతారవుఁ బల్కుబాటు మే
లిరవగుదాని ముద్దుమొగ ♦ మిప్పటికైనఁ దలంతు మాటికిన్. 26

చ. లలితసుధారసాతిమధు♦రంబులు బింబరదాంబరాగ్రిసం
కలితశుచిస్మితంబులు ♦ ప్రగల్భగుణప్రకటీకృతంబు లు
జ్జ్వలపరిపూర్ణమన్మథ ర♦సప్రియసౌఖ్యసమాకులంబు లా
లలన చటూత్తరంబులు త♦లంచి సుఖోన్నతిఁగాంతు నేఁటికిఁ. 27

చ. ఘనరుచిరాబ్జపత్త్రయుత ♦ కర్ణసమున్నత కర్కశస్తనా
గ్రనిహిత తారహారమణి♦కాంచనయంత్రిత విస్తృతాతిరం
జనజఘనాభిరమ్య విల♦సన్మణినూపురశింజితాంఘ్రియా
జనవరకన్యకామణిని ♦ సమ్ముదమొప్పఁ దలంతు నేఁటికిన్. 28

చ. కులుకుమిటారి గబ్బిచను♦గుబ్బల నొమ్మెగఁగ్రుమ్మి క్రుమ్మి చే
తుల మెడఁగౌఁగిలించి తమి♦దొట్రిపడ న్ననుసిగ్గుదొంతరల్
బోలుపలరంగఁ గన్నులర♦మోడ్చి మొగంబు మొగంబుఁజేర్చి ము
ద్దులఁగొని తేనెలానెడి వ♦ధూటిని నామదిఁజూతు నేఁటికిన్. 29

చ. ఘనవిచలత్కచత్రుటిత ♦ కంచుకజాలముల్ భుజాగ్రగుం
భనలసదుల్బణశ్రవణ♦మండనముల్ పరివర్తనక్రియా
భినుతగళప్రచారములు ♦ బిత్తరివక్త్రవిలోకనంబు లే
మనఁదగు నాదుచిత్తమున ♦ మాటికి సంస్మరణింతు నేఁటికిన్. 30

చ. అగు చిగురాకుపాన్పు పయి ♦ నావలిమోమయి పవ్వళింప నే
నొగి బతిమాలుచున్న మది♦నోపక వేకువజాముసందు పె
న్వగ నొకతీరుగా నిదుర♦వాటిలు నట్లెదురై కదించి కే
ల్దగ పయినుంచి మంచిగల♦దానిఁ జరింతుఁ దలంతు నేఁటికిన్. 31

చ. కనుఁగవకెంపుగాఁగ దృఢ♦గాత్రవివర్తనలీలలందు మో
హనసరసోద్ధతోల్బణక♦రాంగుళిజాలవిలాసభావ గుం
భనభుజకందళీయుగళ ♦ మండలితంబగు దానిమోము శో
భనపరివేషయుక్త శశి♦భాసురమంచుఁ దలంతు నేఁటికిఁ. 32

చ. ఘనజఘనావలోకన సు♦ఖస్థితి నే నొకనైపుఁ జేరి స
య్యనవసనాంచలంబుఁ గొను♦నంతట నెంతయు నేర్పుమీఱఁ జే
కొనుటకు దంటయయ్యు మదిఁ♦గొంకుచు సిగ్గులలంకరించు మో
మున నిదురించినిల్చు సుము♦ఖీమణి నాత్మఁదలంతు నేఁటికిఁ. 33

చ. వలపుదలిర్ప నేగమున ♦ వాకిలిఁ జేరగవచ్చు నన్నుఁ గ
న్నుల దనివారఁ జూచి సుమ♦నోభరశయ్యను బవ్వళించి విం
తలనిదురించు నట్లొనరి♦నం గని మెల్లనె సంస్పృశించిన
న్బులుకలెసంగు లేనగవుఁ ♦ బూనినదానిఁ దలంతు నేఁటికిఁ. 34

చ. తొలుత విరాగభావ మొదఁ♦దోఁపఁగ నిష్ఠురవాక్యకేళి రం
జిలఁ బలుమాఱు నన్వెరవఁ♦జేయుచు నంత మదీప్సితప్రదో
జ్జ్వలమతియై రతాభిహిత♦సంచలనోద్ధృతవిస్ఫురత్కటీ
నిలయసహాయ నృత్యముల♦నేర్పరి దానిదలంతు నేఁటికిఁ. 35

చ. విలులితవిశ్లథప్రసవ♦వేణిదరోన్మిషితప్రఘూర్ణితా
ను లలితనేత్ర పద్మశయ♦నోద్ధితయై బహురంగభంగచి
హ్నలు దగఁదాల్చి పంటిమొన♦నంటుచు వాతెఱఁ గ్రోలినట్టి యా
చిలుకలకొల్కి నింపలరఁ ♦ జిత్తమునందుఁ దలంతు నేఁటికిఁ. 36

చ. వెలయఁగ మేడపై వలభి♦వేదికమీఁద వసించి మందహా
సలలితభావహృత్సుఖుల♦సంగతి కేళివిలాసవాక్యముల్
వలుకుచునుండి తాసదరి♦పాటున నన్గని సిగ్గు లేఁతన
వ్వొలసెడిమోముదాని మది♦నుంచి తలంచెదనెంచి నేఁటికిన్. 37

చ. పటుపుసవ్రాలి వేనిదుర♦పాటునమేల్కని వేసటింపుమై
విరుపున నావలింపుచు న♦వీనముఖానిలగంధలుబ్ధము
గ్ధరుచిరసంభ్రమభ్రమ ద♦దభ్రమదభ్రమరాళి విభ్రమ
స్ఫురణవిలోలనేత్రి యగు ♦ బోటిని నామదినుంతు నేఁటికిన్. 38

చ. ప్రియసురతాంతతాంత ఘన♦పీనపయోధరభారఖిన్న ని
ర్భయసుఖజాల నిర్గరివి♦రాజిత రాజకళాభిరమ్య భా
గ్యయుతకటాక్షపూర్ణతిల♦కాగ్రణియై తగు రాజకన్య మ
త్ప్రియమతి దానినెంతయు య♦థేచ్ఛగఁ జింతనొనర్తు నేఁటికిన్. 39

ఉ. రాజనిభాస్య నిర్మలవి♦రాజిత సూక్ష్మతరావలగ్న వి
భ్రాజిత పద్మపత్త్రరుచి♦భాసురనేత్రి నిదాఘబిందుసం
పూజిత పాండుగండయుగ♦భూషిత ధారుణిదివ్యకాంతయై
రాజిలుచున్న దేవిని ని♦రంతరవృత్తిఁ దలంతు నేఁటికిన్. 40

చ. గుణనిధి విస్ఫురత్కమల♦కోమలసుందరవక్త్రి చారు ద
ర్పణ విలసత్కపోల విచ♦లత్కమలేక్షణ చారుశీల ల
క్షణతిలకాంకురైణ మద♦గంధముఖాబ్జవిరాజమానకా
రణ నృపకన్యయైన నడి♦ప్రాియముదానిఁ దలంతు నేఁటికిన్. 41

చ. కలితశిరోజపుంజ భర♦కాంతనిరంతరకాంత చూర్ణకుం
తలలతికాంతవక్త్రి వసు♦ధాధిపకన్య రతిప్రవీణ కాం
త్యలఘుపయోధరాలస న♦తాంగి విలాసవతీవతంసయై
యాలరెడిదాని నామది ని♦రంతరవృత్తిఁ దలంతు నేఁటికిన్. 42

చ. కృతపరిపూర్ణభావ రతి♦కేళికుతూహల కేళికాగృహా
స్థితవతి సానురాగసర♦సీరుహనేత్ర శుభాంగి మోహద
ర్పితమతి మత్కరగ్రహణ♦పీడిత రమ్యపదాబ్జమన్మథా
యత ఘనమోహనాస్త్రమయ♦మై తగుదానిఁ దలంతు నేఁటికిన్. 43

‡ చ. ఇటు ననుజూచినంతట బ♦హిష్కృతఖేదవిభిన్నవంగజో
ద్భట శరజాగ్నిపీడిత హృ♦దంబుజయై తగు నట్టియోనినుం
దిటముగఁ జూచియుండెనో మ♦దీయమనం బదియేలనానినుం
బటుమతిదాని భూపకుల♦పాలిక బాలికనెంతు నేఁటికిన్. 44

‡ ఉ. బంధురపద్మినీజనని ♦ పద్మసుగంధి శరీరమన్మథో
ద్గ్రంధకళాప్రవీణ మణి♦కాంచనకుండల శోభికర్ణపు
ష్పంధయ నీలకుంతలర♦సప్రియ నూతనయౌవనాఢ్య హృ
ద్బంధువు నైన పార్థివసు♦తామణి నాత్మఁదలంతు నేఁటికిన్. 45

‡ చ. సరసవనాంతచంద్రిక ద♦శాప్రతిపన్నవిలాసకాంతి వి
స్ఫురదరవిందచంద్ర పరి♦భూతముఖాంబుజ సూక్ష్మమధ్య దు
ర్భగమదహంసయాన యగు ♦ రాజకుమారిని దాని నామనోం
బురుహనివాసవాసిని న♦మోఘమతిం గనుఁగొందు నేఁటికిన్. 46

‡ చ. మృదుతరదేహముష్టిపరి♦మేయసుమధ్య సుపూజ్యకాంతమో
హదనయనాభిరామ శ్రవ♦ణాంతవిశాలవిలోలనేత్ర సం
పదమదభీష్టవాగ్వినయ♦భాగ్య నవోత్పలసంగృహీతయై
ముదమొదవించుచున్న నృప♦పుత్రిక నాత్మఁదలంతు నేఁటికిన్. 47

‡ చ. సరసకళాభిరమ్యసఖి ♦ సార్ధనిషణ్ణవితర్దికాంతర
స్ఫురదభిరమ్యపుష్పపరి♦పూర్ణిత తల్పనిషణ్ణదేహ స
చ్చరిత సుగంధలేపనల♦సత్కుచకుంభ సుధాంశుబింబ సుం
దరవదనారవింద యగు ♦ దాని నృపాత్మజఁ గాంతు నేటికిన్. 48

‡ చ. మది నొకతీరు గన్నతఱి ♦ మన్నన నన్నెనయింప నెచ్చెలిం
గదిసి మదీయగేహసుము♦ఖాధ్వగయై భయకంపితాత్మయై
పదవినిషణ్ణయై గతిశు♦భస్థితయై పరివర్తమానయై
ముదమొనరించుదాని దగ ♦ ముచ్చటదీఱఁ దలంతు నేటికిన్. 49

చ. మనవిగఁ జాటుసూక్తి బలి♦మాలినఁ గోపపరాఙ్ముఖత్వమూ
నినఁ గని కోపమార్పుటకు ♦ నేను గవుంగిటనిల్పఁ బుష్పసా
ధనునివశంబునం బులకి♦తాకృతియై యసహించి నట్టు లొ
ప్పనిపను లింకవద్దనుచుఁ ♦ బల్కెడి దానిఁ దలంతు నేటికిన్. 50

చ. తఱిఁగని మెల్లనేను కయి♦దమ్ములఁ గన్గవఁగప్ప నెచ్చెలు
ల్గిరిగొని "యేమిచోద్యమెఱిఁ♦గింపుము వీరెవ రేమెఱుంగమో
తరుణి" యటంచుఁ బల్కిన సు♦ధామధురోక్తుల మద్విలాసవై
ఖరి మదిఁగాంచి లేనగుమొ♦గం బగుదానిఁ దలంతు నేటికిన్. 51

చ. సొలయక మోవినొక్కి తమి♦జొక్కి కవుంగిటఁబూని తళ్కుఁజె
క్కుల నునుగోరులాని రతిఁ♦గూడెడి నన్నొక కిన్కనెన్న కే
యొలసెడిసిగ్గుచే నలయు♦నూర్పున దీపమునంచలింప వీ
నులఁ జెలిగల్వతో నగవు♦నూటెనదానిఁ దలంతు నేటికిన్. 52

చ. అతులితకేళికాగతి ని♦రాకృతహంసికఁ గేశపాశని
ర్జితమదపన్నగాశన వి♦చిత్రకలాప సువక్త్రశోభ న
ద్యుతిహసితోత్పలక్రియ న♦ఱానపమధ్యను బూర్ణచైత్రద
ర్పిత కలకంఠకంఠిని బ♦రిస్ఫురితాత్మఁ దలంతు నేటికిన్. 53

చ. మరులొనరింపఁజాలు నవ♦మన్మథమందిర వైజయంతియై
యురుతరలీలల న్మదధ♦రోష్ఠసుధారసధారఁ గ్రోలుచున్
స్మరవికలాంగసంగతుల ♦ మత్పరిరంభణ మాచరించి కే
ళిరచితశయ్య నొయ్యఁబవ♦ళించెడి దానిఁదలంతు నేటికిన్. 54

చ. నవసుమనోవనంబునఁ ద♦నంతటిబోటులఁగూడి మన్మథో
త్సవమునకు న్ననుంగడిసి ♦ సైఁగల నవ్వుల నాటపాటమె
ళ్కువలను బార్శ్వసన్నిహిత♦లోకభయంబున శంకఁబూని మ
క్కువఁజని మళ్ళిచూచి కను♦గొల్పెడిదానిఁ దలంతు నేఁటికిన్. 55

‡ చ. భజితమదీయచిత్రరతి♦వర్తన నర్తనసూత్రధారి దీ
ర్ఘజఘనదేశసంగ్లపిత♦కాంచనరమ్యతరాంగయష్టిబా
హుజవరకన్యకామణి ప్రి♦యోచితకేళ్యపగూహమధ్యమై
భుజములనాని కన్నుల ర♦మోడ్చినదానిఁ దలంతు నేఁటికిన్. 56

‡ చ. చనుగవమీటినన్ దొలఁగఁ ♦ జారిన పయ్యెదఁ జక్కఁజేయుప
ట్లను గని నాదునేత్రజవి♦లాసము నేత్రవిలాసమౌఁగదే
వనరుహనేత్రయంచుఁ దని♦వారఁగఁబల్కిన మెళ్కువన్మనం
బున నగి నన్నుఁజూచు చెలి♦ముంగలిదై కనుపించు నేఁటికిన్. 57

‡ చ. ఉపరిసముద్ధృతోన్నతప♦యోధరవేల్లితబాహువల్లి భూ
ర్యపఘనభంగదంభరచ♦నాంతరదర్శితనాభిమధ్యపా
ళి పరిమితాభిశోభిత వ♦ళిత్రయలక్షితరోమరాజియై
యుపకృతినించు దాని మది♦నుంచి సుఖించి తలంతు నేఁటికిన్. 58

‡ ఉ. బాల సువక్త్రి యౌవనవి♦భాసిత సుస్తనభార నమ్రమని
ద్రాలసరామలోచన న♦వాబ్జనిభాలికసుందరాంగి నీ
లాలకజాలనిర్జిత మ♦దాళిక మన్మథవైజయంతియై
మే లొనరించుదాని చెలి ♦ మిప్పటికైనఁ దలంతు మాటికిన్. 59

‡ చ. చిరినగుమోముతో నుదుటఁ ♦ జిందెడియందపు టుంగరంపుముం
గురులమెఱుంగుతోఁ జెమట♦క్రొందళుకూనిన మోముఁదమ్మితో
నెరిమగపోడిమిన్ గెలుపు ♦ నెక్కొనువేళ గళస్వనంబు ప
ల్మఱుసిరుపొందఁ జేయు వగలా♦డిని దానిఁదలంతు నేఁటికిన్. 60

‡ చ. సలలితకర్ణమూలపరిసక్త సముజ్జ్వలతాళపత్త్రి మ
త్యలఘుమనోజకార్ముకస♦మాశ్రిత మత్తమధువ్రతాంగనా
వళిరుచిజాల కర్బురిత♦వక్రితకుంతలజాలకాంతమౌ
నెలఁత ముఖాబ్జమిప్పటికి ♦ నెమ్మదినాటి తలంతు మాటికిన్. 61

‡ చ. సరసవిలిప్తచందన ర♦సార్ద్రితశోభములోలతారక
స్ఫురితము సత్కురంగమద♦మోహనచిత్రిత పత్త్రవల్లికాం
కురరమణీయ గండఫల♦కోజ్జ్వలితం బగు దాని నెమ్మొగం
బరమరలేక నాదు హృద♦యంబున నిల్పి తలంతు నేఁటికిన్. 62

‡ ఉ. సూనధనుర్నిషాది సర♦సోక్తులదాని మృదూరు శృంఖలా
లానమునం దిదృఙ్నిగళ♦లబ్ధియొనర్చి మదగ్రకల్పనా
ధీన మదేభరాజమును ♦ ధీరతకట్టి నిఁకేమి తెల్పు నా
హా నరనాథకన్యక ద♦యాశ్రయ మిప్పటికైనఁ గోరెదన్. 63

‡ చ. త్రిదివవియోగపాంసుముఖి ♦ తీర్థచతుర్థరజోవియుక్తగా
రదళసశుభ్రవస్త్ర రతి♦లక్ష్యనిశాకరసమిశ్రగంధసం
పద గలదాని పుష్పవిభ♦వాచ్యుతవల్లరిఁ బోలు దాని స
మ్మదమునఁ గూడినట్టి జన♦మాన్యుఁడె ధన్యుఁడు లేఁడిఁకన్ భువిన్. 64

చ. అని యనివారిత ప్రియర♦హస్యవిలాసకథా సుధారసా
బ్ధ్యనిమిషమాన సోజ్జ్వలితుఁ♦డై పురవీథులఁ గేళిసల్పి తో
డనెచని కాంచెబిల్హణుఁ డ♦టచ్ఛవకోటికరోటికందుకా
భినయసటత్త్రిశూలచర♦భీమనిశాటికఁ బ్రేత వాటికన్. 65

వ. ఇట్లు కాంచి తత్ప్రేతభూతలస్థాపితత్రిశూలాగ్రైకశూలవాగురీయంత్రాదివధ్యసాధనసంభారసందర్శన నిర్భయుండై యుచితస్థలంబున లోకబాంధవున కభిముఖంబుగా నిల్చి తనమనోరథార్థసందర్భంబుకొఱకు విశ్వగర్భుండైన పుండరీకాక్షునుద్దేశించి యిట్లని నుతించె. 66

మ. ప్రళయాపూర్ణజలార్ణవాంతర వివ♦ర్ణాకీర్ణధావత్తిమిం
గిలయాత్రానుగతస్వ తాలుయుగవి♦క్షేపాంబు నిర్ఘోషని
ర్గళితామ్నాయ సకృత్పునఃపఠన కృ♦ద్భ్రాంతిప్రదాత్మస్వరూ
పలసత్ప్రాభవమూర్తి మద్గురు పర♦బ్రహ్మంబ వీవే హరీ. 67

మ. సుచిరాలబ్ధ నిజోపగూహన కళౌ♦త్సుక్యార్ణవ స్వర్ణదీ
ద్విచతుష్కరసార్ద్రకేళి విధిసా♦ధీభూత మందాచలో
ద్ధవచరప్రస్థర ధూర్వహాభ్రగ సుధాం♦ధస్సాధనౌషధ్యుదా
బ్రిచనా ఘుట్టఘురట్టపృష్ఠకమఠ♦బ్రహ్మంబ వీవే హరీ. 68

మ. ఖరకృద్గణ్య హిరణ్యదైత్యహరణో♦గ్రప్రక్రియా కల్పకో
ద్ధరణాంభోజ భవాండభాండ రచనార్థస్వీకృతస్వర్ణ మృ
ద్వరపిండోపమ మేరుమండిత దిగం♦తక్షోణిచక్రాద్య ని
ర్భర శంకూకృత దంష్ట్రికాంకుర కిటి♦బ్రహ్మాంబ వీవే హరీ. 69

మ. సదసత్సంశయ వాదభేదన పరీ♦క్షారంభసంరంభ శు
భదయ స్తంభ నిగుంభితాత్మ సుఖచి♦త్ప్రహ్లాద గుర్వత్యయా
స్పద దోస్సారవిచార లోకసదస♦చ్ఛద్మార్థ నిర్దర్శిత
త్వదృఢీభూత యుగప్రభావ నృహరి♦బ్రహ్మాంబ వీవే హరీ. 70

మ. కృతదీక్షాధ్వర దేశకాలఫలము♦క్తిజ్ఞాన సత్పాత్ర స
త్కృతిదానప్రదదానవేంద్ర విభవ ♦ శ్రీమూర్ధబుధోద్భవా
మిత తత్పుణ్యయశోలతా సముదయో♦న్మేషస్వ వేషోత్సవ
వ్రత సంవర్ధిత విశ్వశాశ్వతవటు♦బ్రహ్మాంబ వీవే హరీ. 71

మ. జరతాభావ మహోత్తరూపమ వపు♦శ్శాఖా సహస్రాంకుర
త్పరిశంకావహ బాహుబాహుజకులో♦త్తంస ప్రశంసాతివీ
రరసావేశవశైక వింశతికప♦ర్యాయాప హృద్విశ్వరా
ట్పరశుస్వీకృతమార్గభార్గవ పర♦బ్రహ్మాంబ వీవే హరీ. 72

మ. సవజిద్భక్తవిశిష్టదార్ష్ట్య చిరసూ♦క్ష్మక్ష్వేళసమ్మేళనో
ద్భవ సంపద్వశదిఙ్ముఖోద్గత శిఖో♦ద్దామానలభ్రాంతికృ
ద్భువనద్విడ్దశకంఠ కంఠదళన♦ప్రోత్కంఠితాకుంఠ వై
భవ నిర్మోఘ శరౌఘ రాఘవ పర♦బ్రహ్మాంబ వీవే హరీ. 73

మ. ప్రియకృత్పూర్వభవాగతద్వితయ కీ♦ర్తిస్ఫూర్తి మూర్త్యంతరా
శ్రయగాత్రద్యుతి నేత్రకల్పకల స♦ద్రామావతారాస్తి త
ద్భయరూపాప యశోపహ ప్రకృతిసీ♦తాదర్శనోపాయ ని
ర్ణయలీలాహలసాధనోజ్జ్వల బల♦బ్రహ్మాంబ వీవే హరీ. 74

మ. త్రిజగద్భిత్త్రిపురాశ్రవాశ్రిత కుల♦స్త్రీలోక లోకోత్త రా
త్మజితప్రాగ్వ్రత భంగసంగరసము♦ద్ధస్పర్ధ సర్వార్థమో
హాజుగుప్సోదయ ధర్మకర్మబల ని♦ర్యత్పుణ్యచైతన్యదా
ర్ఢ్య జయార్చిష్పరిశుద్ధబుద్ధతను భృ♦ద్బ్రహ్మాంబ వీవే హరీ. 75

ను. అసకృన్మ్లేచ్ఛయుత ప్రపంచకృత పం♦చాఘౌఘ తామిస్రసై
జనధారాగతి కంచుకస్ఫురదుదం♦చత్పంచ కళ్యాణికా
శ్వసమారూఢ భవత్కరాసిరుచి వి♦జ్ఞానప్రదీపాంత ని
ర్వ్యసనాంతఃకరణప్రదీప కలికి♦బ్రహ్మాంబ వీవే హరీ. 76

కం. శ్రీమద్భామీశ్వర సౌ
దామిన్యామహిత నీర♦దశ్యామవపుః
కోమల హేమలతామల
ధామ లసద్వసన నీకు ♦ దండంబు హరీ. 77

కం. శరణాగత భరణాన్విత
కరుణామృత శీకరార్ద్ర ♦ కందళితాంతః
కరణాద్భుత కరుణాశ్రిత
తరుణా చరణానుచరణ ♦ దయఁజూడు హరీ. 78

కం. దాసజనా వాసఘనా
భాసవనా వసనపత్న ♦ బలమానసనం
త్రాస గుణాభ్యాసరణా
స్త్రాసగుణాభరణ నీవె ♦ శరణంబుహరీ. 79

కం. అధ్యాసిత సుధ్యాహిత
రథ్యాశతమధ్యదేశ ♦ రాజదయోధ్యా
విధ్యాగత సాధ్యాసత
విద్యాధృత హృదయనిన్ను ♦ వినుతింతుహరీ. 80

కం. పేటీ ధనపేటీ ఘన
చేటీ జనమణిశోతాంగ ♦ సింధురభటగో
కోటీ జయధాటీ ప్రియ
ఘోటీచయ మొదప్తు నిన్నుఁ ♦ గొల్చెదను హరీ. 81

కం. గాధిసుసయ బోధిసుసయ
సాధితసయనాభిరామ ♦ శాశ్వతజయసం
శోధిత రణగోధిత రణ
బాధిత రణమదధ నిన్నుఁ ♦ బ్రణుతింతుహరీ. 82

కం. భృత్యశతాపత్యయుతా
మాత్యహితానుజ సహిత వి♦మతరావణసాం
గత్యప్రియ మృత్యుక్షయ
వృత్యాశ్రయశాస్త్ర నన్నుఁ ♦ గృపఁజూడుమహరీ. 83

కం. ఘనతాడన జనతాఘన
జనతాభినుతాత్మ భక్త♦జనతారక పా
వనధామా వసధామా
వనధామా రామనిన్ను ♦ వర్ణింతుహరీ. 84

ఉ. శ్రీధరచక్రపాణి సర♦సీరుహపూర్ణ సువర్ణనేత్రి స
త్యాధిప గోపికామదన ♦ తత్త్వమయాత్మక దానుదాస ము
ద్రాధికంధరాగ మగ♦ధాదృతమోక్షనిదానయోగ వి
ద్యాధర రాజదన్య వన♦తత్పర సత్పరమార్థ వాంఛితా. 95

ఉ. దేహికులప్రపంచ వస♦తే భవతేహ మభిద్ధృతేహవం
దేహి కులేననోహ్యాచరి♦తే భిరతే నియతే హితాత్మనై
దేహి కలాకలాప సుధృ♦తే సుకృతే సుమతే మదీప్సితం
దేహి యటంచు రామవిభు♦నిం గొనియాడి మృదుం దలంచెదన్. 86

—♦ దండకము ♦—

శ్రీమన్మహాదేవదేవా శివావామదేవా చిదానందభావా విభాస్వత్ప్రభావా భవాంభోధిసంతారకా తారకాదంబకాదంబ గోరాజగోరాజ కాంతాజ కాంతాజ సంతాన సంతాన ఫేనాబ్జ ఫేనాబ్జ మందారకుందార కుందారవిందార నీహారమందాకినీహార బృందారకా హారహీరప్రభాంగా శుభాంగా సభంగాంగజస్వాంగ గంగాధరా భృంగిసంగీతనాట్యప్రసంగాదరా మంగళశ్రీకర శ్రీకరోచ్ఛృంగశృంగారసౌధాంతరంగా తరంగాయమానోజ్జ్వలాభంగ రంగత్కురంగాగ్రపాణీ సమగ్రాభ్రవేణీమహాసత్కృపాణీ హిమక్షోణిభృత్కన్యకాగణ్యలావణ్య తారుణ్య పుణ్యాన్వితారణ్యధారుణ్యటద్వారణేంద్రా త్రుటద్వారణేంద్రాభియాతీ భయాతీతమూర్తీ దయాపూతవర్తీ సయాఖ్యాతపూర్తీ జయస్ఫూర్తికీర్తీ త్రిమూర్త్యాకృతీ స్వీకృతైశ్వర్యకృద్విశ్వ సృష్టిస్థితిధ్వంసనప్రక్రియాళీ సదాలీఢకేళీ సదాళీనమాళీ ప్రియాబ్జాళిహేళీ మరుల్లోసమ

సోమకషమోధామ ధామాగ్నియజ్వాస్వరూపా దురాపప్రతాపా పహాపాప లోపా విపక్షావలేపక్షపా కర్మసాక్షీ జగత్పూర్ణకుక్షీ మహోక్షిప్రసంక్షిప్త దీక్షావ్రతాధ్యక్ష దక్షాధ్వరక్షేత్రపాత్రపరియోగాది దక్షర్త్విజప్రాణమోక్ష వ్రతతారిణ నిర్వాహకృత్సర్వసర్వంసహాభూరి భారాపనోదార్థసంవర్ధమానార్థనారీశ సాళ్వాష్టతచ్ఛంకరశ్రీపతి స్థాణులింగాద్యనేకావతారా శతారప్రియాపత్య దోస్సత్త్వ తత్త్వాభిమర్శ ప్రభుత్వైకహృత్కృత్రిమక్రోడ సంతాడన క్రీడితా యాతమాయాకిరాతాభిరూపప్రసన్నోపదేశా సకృచ్ఛాబరాభిఖ్య ముఖ్యాగమప్రోక్త మంత్రత్వదీయాస్త్రలాభార్జునస్వార్జన స్వర్జనోద్దీయమానాచ్ఛకీర్తిప్రతాపోజ్జయశ్రీకళా కారణానుగ్రహా నిత్యసంపత్కళావిగ్రహా విగ్రహోదగ్రరక్షస్త్రయీపట్టణోద్ఘట్టనోత్కృష్టమౌర్వీధనుస్తూణ బాణ ధ్వజస్యందనక్షంతృరథ్యారి సేనాదిదృక్పాశయీ భూతదృక్కర్ణరాట్స్వర్ణశైలార్ణవానంత గోరాజభూవిశ్వసృడ్వేదమార్తాండజైవాతృకాదిత్యభూతప్రపంచైకయోధాగ్రణీ దైవతగ్రామణీ రామణీ యారుణీ వారుణీ దిక్ప్రభావంద్య సంధ్యాసమారంభ శుంభచ్ఛుభాసంఖ్య శంఖాభిభాంకార నిస్సాణ జంఝాణ ఘుంటాఘుణంఘాణ భేరీధణంధాణ వీణాదినిక్వాణ హృద్యానవద్య స్ఫురద్గద్య పద్యానువాద్యక్రియోద్యన్నటద్బ్రహ్మ విద్యావిహారా మహారాజతాహార్య వర్యాగ్రసంస్థాన భావప్రకాశా మహేశా మదీయేప్సితం దేహిమాంపాహితుభ్యం నమస్తే నమస్తే నమస్తే నమః. 87

మ. అని సర్వేశ్వరునిట్లు భజించి జగదా♦ద్యంతక్రియాపూర్ణక
ల్పనవృత్తిన్ సుఖదుఃఖసంపద విసం♦పద్భాగ్యభోగ్యాది జీ
వనకృత్యంబులు సర్వజీవులకు నే♦ర్పాటొందుగా వ్రాయుటల్
పనిగావించి త్రికాలవేదియగు త♦ద్బ్రహ్మంబుఁ గీర్తింపుచున్. 88

‡ మ. హరినాభీసరసీభవోద్భవ సమ♦స్తామ్నాయకల్పస్వరూ
ప రహస్యాత్మకతత్త్వసత్యభువన♦ప్రాధాన్య నానాచరా
చరభూతాఖిలవిశ్వకారణ కళా♦సంపూర్ణకల్యాణ ని
ర్జరమర్త్యాసురవాంఛితార్థఫలద♦బ్రహ్మ సదానందకా. 89

‡ చ. విధి నిను మ్రొక్కి దోయిలిడి ♦ వేడెద సంతమునందు భూతముల్
ప్రథితతదంశసంగతులఁ ♦ బొల్పడుఁగాతఁ దదీయమార్గమం

దు ధరణి తత్సరోపితతి ♦ తోయము తద్వ్యజనంబున స్మరు
త్కృధనము తద్గృహాభ్రమున♦ఖస్థితి తన్మకురాళి తేజమున్. 90

చ. ఇట్టు లొనఁగూర్చు టెంతయు మ♦దీప్సిత పూర్ణఫలప్రసిద్ధిఁ జే
యుటఁ దగు భక్తకామితఫ♦లోదయమూర్తులు మీత్రిమూర్తు లొ
క్కటఁ గల కర్మసాక్షియె జ♦గద్ధితసాక్షి యటంచు మ్రొక్కుచున్
దిటమునఁ బల్కి బల్కినుక♦దేరెడి మేరడి నూరడింపఁగన్. 91

చ. శివుఁడు హాలాహలంబు గళ♦సీమను నిల్పఁడె నేఁటికిన్ ఫణీ
ధవుఁడు వరాంగపాళి వసు♦ధాతలమిప్పటికైనఁ దాల్పఁడే
భువనపతిప్రమోదమునఁ♦బోల్పఁడె దుస్సహబాడబాగ్ని నె
ట్లవగుణయు క్షమైన సుకృ♦తాత్మకు లొప్పిద మాచరింపరే. 92

‡ చ. జలజవతంసముల్ హసన♦సంహృతిసేవితముల్ జలాశయం
బులు భువినెన్నియున్నఁ బరి♦పూర్ణఫలాత్మతఁ జాతకంబు ని
స్తులితసవప్రజపాతభయ ♦ సూచనరూపక పౌరుహూతికై
కులుకు నవాంబుధార కొన♦గోరఁగ నేరక యూరకుండునే. 93

ఉ. గాఢతరానురాగమునఁ ♦ గజ్జలమంజులనేత్రి సత్కృతి
ప్రౌఢిమ కేళికే నొకశి♦రంబొనఁగూర్చుట కేమి సీతకె
మ్మూఢమనస్కుఁడయ్యెఁ బ్రియ♦పూర్వకమాసని నిశ్చలాత్మ సం
రూఢమతిం దశాననుఁడు ♦ రక్షయమస్తకపంక్తిఁ గోర్వఁగన్. 94

వ. అని మఱియును 95

సీ. భట్టినష్టమునొందె ♦ భారవిమృతిఁబొందె
భిక్షుండు నశియించె ♦ భీమసేనుఁ
డాయుర్విహీనదు♦ప్పాప్రియుండై చనె నింక
భుక్కుండుఁ డను నేను ♦ భూవరుండ
నీవు చెప్పఁగనేల ♦ విలయకాలాంతకుఁ
డాగ్రహంబున భవ♦నాంతరమున
సంప్రవిష్టుండయ్యె ♦ సతోక్తమిది యుష్మ
దస్మత్ప్రదార్థ మే♦కానుభవము

తే. గీ. నొందఁజేయఁడె విధి చింత ♦ నొందనేల?
[కాలకుద్ధుఁడు దిద్దెడి ♦ వ్రాలవరుస
ముందు వెనుకలఁ జనుచుండు ♦ మందరమిటుఁ]
కామసమరూప మదనాభి♦రామభూప. 96

వ. అని తనమహనీయప్రభావంబు నిఖిలకకుబంతరాట్సభాంతరాళంబులం బ్రశంసించుటయుం గార్యంబుగా నిరూపించి భూపాలసమారోపశాపానురూపసంధానసంధావచన బంధురుండైన వసుంధరామహేంద్రుని ధైర్యగాంభీర్య చాతుర్యాది గుణంబుల కచ్చెరుపాటునొందు కోటిపాలుండు భయాటోపశీలుండగుచు సూటిదనంపుమాటలఁ బ్రశాంతునిజేయుచుఁ దన సుభటవర్గంబున సన్మార్గంబుగా జాగరూకతనుండ నియమించి సముచితాశయుండై రయంబునంజని ప్రాంజలియై తదీయపూర్వోదితప్రకారంబున బిల్హణప్రచారంబు సానుపూర్వకంబుగాఁ బూర్వోత్తరశ్లోకప్రపంచంబు తన్మయత్వంబునొందించుటయుఁ దదీయపరిభావసూచక ప్రతిజ్ఞాసంజ్ఞాది వాక్యార్థతత్త్వోపన్యాసంబు నిర్ణయించుటయు నాకర్ణించి సమభ్యర్ణావసానపూర్ణుని చెన్నున మిన్నుమన్నునెఱుంగ నేరక యూరకున్న యమ్మన్నె తేని విన్నదనంపుఁ బన్నుగడ సన్నలెన్నుచు సన్నిట మిన్నఁదనంపు వన్నెలం బేరుగొన్న విన్నాణియగు మనోరంజనుండు కార్యానురంజనంబుగా రాజకుంజరునకుఁ బ్రబోధింపుచు నిట్లనియె. 97

సీ. రాజేంద్ర విపదిధై♦ర్యంబనుమాట ని
రర్థకంబుగఁజేయు ♦ టర్హమగునె
కాక యీదుర్ఘట♦కార్య మాత్మనుజేయ
నిశ్చయించితివేని ♦ నిజము బ్రహ్మ
హత్య కన్యాద్రోహ ♦ మాత్మాభిఘాతుక
మఖిలదుష్కీర్తి ప్రి♦యాపకృతియు
బాంధవాసత్కృతి ♦ బహుజనదూష్య మా
త్మకులక్షయము ధర్మ♦వికృతిపదము
తే. గీ. నెరయసిద్ధించు నిదికార్య♦సరణికాదు
భవదభిప్రీతిఁగోరిన ♦ ప్రజలమగుట

బల్మిచేసైన నుచితమే♦ర్పు అవనగును
గాన నామాట మదినాటఁ ♦ గాంచు నేట. 98

వ. అది యెట్లనిన. 99

మ. అకలంకాశయుఁ డార్యపూజితుఁడు బ్ర♦హ్మానందపూర్ణుండు బ్ర
హ్మకులోత్తంసుఁడు సత్ప్రభావనిధి శా♦పానుగ్రహాపూర్ణ హృ
త్సకలాలంకృతమూర్తి నిశ్చలమన♦స్సంకల్ప సౌఖ్యోదయా
త్మకుఁ డుద్యత్కవితా ప్రపంచనయని♦ర్మాణక్రియాకర్తయున్. 100

కం సర్వం సహేశకశ్యప
నిర్వాహక భావమెడలె♦నే భార్గవుపై
సర్వస్వాతంత్ర్యము లీ
యుర్వీదేవతల మహిమ ♦ లోటమిగలవే. 101

ఉ. రాముశరప్రయోగము సుర♦ప్రభువజ్రము చక్రిచక్రమున్
ధామనిధిప్రియాత్మజుని♦దండము కామరిపుత్రిశూలమున్
భూమి నొకప్డురిత్తయయి ♦ పోయినఁ బోవునుగాక యీకవి
స్వాముల వాక్ప్రయోగమును ♦ బ్రహ్మకునైనఁ దరంబె త్రిప్పఁగన్. 102

పాఠాంతరము:-

ఉ. రాము శరప్రయోగము సుర♦ప్రభు వజ్రము చక్రి చక్రమున్
ధామనిధిప్రియాత్మజుని ♦ దండము శూలధర త్రిశూలమున్
తామరసాప్త తేజమును ♦ ధర్మజు కోపము మాని శాపమున్
సౌమనసప్రయత్నమును ♦ సత్కవివాక్యము రిత్తవోవునే.

కం. కావున నీవునసమస్తము
గావు నయానుచితగతులు ♦ గావు వృథోక్తుల్
గావు దురుక్తులు నిందలు
గావు భయప్రాపితములు ♦ గావు నరేంద్రా 103

ఉ. తాలిమిఁబూని నామనవి ♦ తప్పకకైకొను మింతనంత నీ
జాలియడంగఁజాలు నొక♦జాలున మేలొనగూర్పఁ బల్కెనీ
పాలికిఁ దోడితెచ్చెద నృ♦పాలక సత్కవిరాజమౌళికిన్
బాలికనిచ్చి రాజ్యసుఖ♦పద్ధతినొందు జగత్ప్రసిద్ధిగన్. 104

మ. స్తుతిపాత్రం బగు నీకు విప్రకులబం♦ధుత్వంబు దోషంబులే
దతిభక్తింగనె రోమపాదసుత ఋ♦శ్య శృంగసాంగత్యమున్
బతిగాఁగోరె ఋతుధ్వజాత్మజ జగ♦త్ప్రఖ్యాతిగా గౌతమున్
మతినర్చింపదె కాశిరాజసుత ధ♦ర్మావాసకున్ గౌశికున్. 105

వ. అని యనేకప్రకారంబుల ధరాకాంతునకు నేకాంతంబున సాధువాక్యంబులం బ్రబోధించినం దెలిసి మంత్రివర్యునింగలిసి బాలికాంతఃపురంబుం బ్రవేశించి కులవధూరత్నంబును నతిప్రయత్నంబునఁ బిలిపించి పూర్వాపూర్వంబగు సర్వంబునెఱింగించిన వెఱఁగుపడియున్న జననీజనకుల సన్నిధానంబునఁగన్యకామణి బిల్హణార్పితపాణియై యిట్లని పలవింపందొడంగె. 106

ఉ. హా జగదేకమోహనక♦ళాకర హా రమణీరతిప్రియా
హా జనలోకమాన్యగుణ ♦ హా చతురాననవంశభూషణా
హా జయశీల హా రసిక ♦ హా చతురోక్తివిలాస హా మహా
రాజనిధాన హా సుకవి♦రాజసుధాకర హా మనోహరా. 107

చ. సరసమెలర్ప నన్నెఱను♦శాస్త్ర విలక్షణలక్ష్యభేదముల్
పరమరహస్యము ల్దెలియఁ♦బల్కిన సద్గురునాథు నింతకున్.
జొరిపినదాన నెయ్యెడలఁ♦జూచిన నాసరిదోసకారి లే
దరయఁగఁ దేనెనున్నిస సి♦తాయుధపాళి మదీయ కేళియున్. 108

తే. గీ. అక్కటా లోకులాడెడి ♦ యారడులకుఁ
బాలుపడియుంటి నేనెంత ♦ పాపజాతి
దాన నైతినో కాని హా ♦ దైవమిట్లు
లాయెఁ గాఁబోలు నీకనేమి ♦ సేయుదాన. 109

ఉ. మేలనుపొందలేని ఘన♦మేలను నాకిక సాటివారి నో
మేలను కల్మిచక్కదన♦మేలను జొక్కపుజవ్వనంపు సొ
మ్మేలను జేనికింతచల♦మేలను బిల్హణుఁడేమరించు జా
మేలను నిట్టి జన్మఫల♦మేలను బాపపుదైవ మేలనున్. 110

చ. విదిలిచినట్టు లీవెఱుఁ♦గనే సగవే తగవే మసంచుదూ
రుదుఁ దలితండ్రు లింతవిన♦రో కసరో నెనరొట్టుఁజేసి యుం

జెదరో మఱేమితల్చిరో క♦దే తగదే జగదేకరూపసం
పద గురునాథప్రేమగల ♦ పైదలిపై వలపైన నీమదిన్. 111

చ. పలుమఱుఁ గుందనేల తొలు♦బాముల నెవ్వరిపట్ల నిట్టి మే
ల్దలఁచితిమోకదే యిపుడు♦తప్పెనె తత్ఫలమింతసంతటన్
నిలునిలు సామినిక్కమిదె ♦ నే నినుఁగూడఁగ వచ్చుసంతసున్
దొలఁగిన నీకు నాదుమది ♦ తోడుసుమీ మదినొండుదల్చెసన్. 112

ఉ. ఈరుచిరంపుఁజిత్తరువు ♦ లీమణిపీఠియ లీకొలంకు పెం
పారెడుతోఁట లీచిలుక♦పంజరముల్ చెలులారమీరు నా
మాఱుఁగజూచి నన్నుమది♦మర్వక పేర్కొనుఁడమ్మలార క
న్నీరులు నించకుండనుచు ♦ నెమ్మికరంబుఁ గరంబులంటుచున్. 113

శా. వేణీవేష్టితకంఠయై తరళభా♦వీభూతయై తన్వియై
ప్రాణాలంబిత బిల్హాణస్మరణయై ♦ పాఠియంపుటెక్కెత్తి యా
వీణాలాపిని యెచ్చె నిర్జరవధూ♦విన్యస్తహస్తాబ్జ క
ల్యాణీరాగ విపంచికాశ్రుతి నొయా♦రంబౌ సుతారంబుసన్. 114

చ. అటువలె సాహసింపఁ జెలు♦లందఱుహాయని ప్రోదివెట్టి నొ
చ్చుటగని తల్లి తల్లడిలు♦చున్ వడివచ్చి కుమారికన్ గవుం
గిటఁ దగఁజేర్చి కూర్చి మెడ♦గీల్కొనువేణి మరల్చి పైఁటద
ప్పూట సవరించి ముంగురులు♦మోడిచి బాష్పములంటనొత్తుచుఙ్. 115

ఉ. కన్నియవింతయూనదరు♦గన్నియమించుటమేరటమ్మ నీ
వన్నెయు వాసియుం దలఁప♦వన్నియు దూరుట తీరటమ్మ పే
ల్మిన్నవు గావటమ్మ బలి♦మి న్నవుబోటుపనుల్ దలంపుటల్
విన్నను మిన్నుపైఁబడిన ♦ విన్ననువయ్యెఁ గదమ్మ నెమ్మదిఙ్. 116

ఉ. ఏమనుకొందురమ్మ జను♦లింతటిమాటల మందులేని మా
రాముల మానవమ్మ నెన♦రానినముచ్చట నాకుఁజెప్పమిఙ్
నేమమటమ్మ నీవెడఁగు♦సేఁతల కేమనుకొందురమ్మ నా
నోములపంటవమ్మ విడ♦నోర్తునె ముద్దులగుమ్మ నిన్నుఁకఙ్. 117

ఉ. నీవిరహంబుఁజూచి పని♦నేరక మేఁతలుమానియున్న పా
రావత కీర శారికల ♦ రమ్మని పిల్వఁగదమ్మ తోఁటపూఁ

నీ వెలఁది బ్రోదిదిద్దు కడ♦తేర్పఁగదమ్మ పసిండివంటి మై
తీవి సడల్పఁబూనిన స♦డిం దిగఁగుందెదరమ్మ నీచెలుల్. 118

అని యనివారితంబు నెన♦రారఁడి వేఁడిసేయఁగాఁగిటం
గొని చని రాజన్యుఁడోడలఁ ♦ గూరిచి కూరిమిమేలమియ్యఁ నూ
తనతనయాపరాధములు ♦ దల్పక దాని మనోనురాగ రం
జనమున గూర్చ నీ నెఱుఁగఁ♦జాలవె చాలనెతల్ దలంచెదే. 119

కటకట రాజపుత్త్రి తిల♦కామణి కామిత వివాహసర్వ కే
మటుమటుఁ జూపమేలె సుఖ♦మారి కుమారిక సింతఁ జేసి నీ
విటుసటు నింక నేమనుభ♦వించెదవో మదినెంచి చూడుమా
వటువిటులేల నెందుఁ దలి♦దండ్రులుగారె సుతానురక్తికిన్. 120

వినుము మనుజేంద్ర నాదయిన♦విన్నప మాత్మఁదలంచి మంచి కా
దనక తనూభవన్ విభవ♦దాభిమహోత్సవ మొప్ప బిల్వఁగా
వని సురరాజసూతికి వి♦వాహ మొనర్పుము దేవబంధుర
కీర్తిని వరదేవదేవ పితృ♦దేవ మహామహిదేవ హృద్యమా. 121

సరసవశేఖరుఁ డార్యజన♦సమ్మతుఁ డన్నిట మేలువాఁడు స
ద్గురువరుఁ డీనినింగొలిచి ♦ కూర్మి కళాభ్యసనంబొనర్చెఁ జో
సరమరలుంపమాని తన♦యా వినయానుగుణైక మాన్యవై
ఖరిఁ గనుమాచు మున్ను తెర♦గట్టి కవీంద్రునకొప్పగింపవే. 122

చ. ఇపుడిది నేరమంచు సుత♦నింతగ వంతలముఁగఁజేసి దూ
రపుఁబని యట్ల నీమది గ♦రంగ మికేమనుకొందు నన్ను స
న్నపుఁ జనుపొందఁ జూచిన క్ష♦ణంబున నొందువిసంగ నేర్తునే
నృపవర యాలుబిడ్డల గ♦ణింపని సంపదలేల చెప్పుమా. 123

వ. అని యోసరించు రాణివాసంపుఁ బలుకులకుం బాసటయై
మహాప్రాజ్ఞుం డట్టి స మనోరంజనుం డరిభంజనున కిట్లనియె. 124

చ. వలపగు రూపురేఖగల♦వానిగఁ గోరును గన్నె, విత్తస
ల్లలితునిఁ గోరుఁ దల్లి, శుభ♦లక్ష్యరసజ్ఞునిఁ గోరుఁ దండ్రి, స
త్కులజునిఁ గోరు బంధుతతి, ♦ కూరిమి శోభనకార్యవేళ లో
కులు సరసాన్నభుక్తి మదిఁ♦గోరుదు రీధరలోన నెల్లెడన్. 125

జెదరో మఱేమితల్చిరో క♦దే తగదే జగదేకరూపసం
పద గురునాథప్రేమగల ♦ పైదలిపై వలపైన నీమదిన్. 111

చ. పలుమఱుఁ గుందనేల తొలు♦బాముల నెవ్వరిపట్ల నిట్టి మే
ల్దలఁచితిమో కదే యిపుడు♦తప్పునె తత్ఫలమింతసంతటన్
నిలునిలు సామినిక్కమిదె ♦ నే నినుఁగూడఁగ వచ్చునంతకున్
దొలఁగిన నీకు నాదుమది ♦ తోడుసుమీ మదినొందుదల్చిసన్. 112

ఉ. ఈరుచిరంపుఁజిత్తరువు ♦ లీమణిపీఠియ లీకొలంకుపెం
పారెడుతోఁట లీచిలుక♦పంజరముల్ చెలులారమీరు నా
మాఱుఁగజూచి నన్నుమది♦మర్వక పేర్కొనుఁడమ్మలార క
న్నీరులు నించకుండనుచు ♦ నెమ్మికరంబుఁ గరంబులంటుచున్. 113

శా. వేణీవేష్టితకంఠయై తరళభా♦వీభూతయై తన్వియై
ప్రాణాలంబిత విహ్వలస్మరణయై ♦ పాడియంపుటెల్గెత్తి యా
వీణాలాపిని యేడ్చె నిర్జరవధూ♦విన్యస్తహస్తాబ్జక
ల్యాణీరాగ విపంచికాశ్రుతి నొయా♦రంబొ సుతారంబునన్. 114

చ. అటువలె సాహసింపఁ చెలు♦లందఱుహాయని ప్రోదిపెట్టి నొ
చ్చుటగని తల్లి తల్లడిలు♦చున్ వడివచ్చి కుమారికన్ గవుం
గిటఁ దగఁజేర్చి కూర్చి మెడ♦ఁగీల్కొనువేణి మరల్చి పైఁటద
ప్పూట సవరించి ముంగురులు♦మోడిచి బాష్పములంటనొత్తుచున్. 115

ఉ. కన్నియవింతయానదరు♦గన్నియమించుటమేరటమ్మ నీ
వన్నెయు వాసియుం దలఁప♦వన్నియు దూరుట తీరటమ్మ పే
ల్మిన్నవు గావటమ్మ బల్మిమి న్నవుబాటుపనుల్ దలంచుటల్
విన్నను మిన్నుపైఁబడిన ♦ విన్ననువయ్యెఁ గదమ్మ నెమ్మదిన్. 116

ఉ. ఏమనుకొందురమ్మ జను♦లింతటిమాటల మందులేని మా
రాముల మానవమ్మ నెన♦రానినముచ్చట నాకుఁజెప్పమిన్
నేమమటమ్మ నీవెడఁగు♦చేఁతల కేమనుకొందురమ్మ నా
నోములపంటవమ్మ విడ♦నోర్తునె ముద్దులగుమ్మ నిన్నిఁకన్. 117

ఉ. నీవిరహంబుఁజూచి పని♦నేరక మేఁతలుమానియున్న పా
రావత కీర శారికల ♦ రమ్మని పిల్వఁగదమ్మ తోఁటపూఁ

దీవెలఁ బ్రోదిదిద్దు కడ♦తేర్పఁగఁదమ్మ పసిండివంటి మై
తీవి సడల్పఁబూనిన స♦డింబ దిగఁగుందెదవమ్మ సీచెలుల్. 118

చ. అని యనివారితంబు నెన♦రారఁడి వేఁడిసేయఁగౌఁగిటం
గొని చని రాజునొద్దకలఁ ♦ గూర్చి కూరిమి మేలిమిగాఁగ సూ
తనతనయాపరాధములు ♦ దల్పక దాని మనోనురాగ రం
జనమొనగూర్చ నీవెలుఁగఁ♦జాలవె చాలవెతల్ దలంచెదే. 119

చ. కటకట రాజపూర్ణతిల♦కామణి కామిత వివాహసర్వ కి
మటమటఁ జూపమేలె సుకు♦మారి కుమారిక నింతఁజేసి నీ
విటునటు నింక నేమనుభ♦వించెదవో మదినెంచి చూడుమా
దటవిటలేల నెందుఁ దలి♦దండ్రులుగారె సుతానురక్తికిన్.

చ. విను మనుజేంద్ర నాదయిన♦విన్నప మాత్మఁదలంచి
దనక తనూభవర్ విభవ♦దాభిమహోత్సవమొప్ప
వని సురరాజమహాళికి వి♦వాహమొనర్పుము దే
క్తిని నరదేవదేవ పితృ♦దేవ మహామహిదేవ

చ. సరసవరేణ్యుఁ డార్యజన♦సమ్మతుఁ డన్నిట
గ్గురువరుఁ డీతనింగొలిచి ♦ కూర్మి కళాభ్య
సరమరలుంపమాని తన♦యా వినయానుగు
ఖరిఁ గనుమాచు మున్ను తెర♦గట్టె కవీంద్రుఁ

చ. ఇపుడిది నేరమంచు సుత♦నింతగ వంతలము
రపుఁబని యట్ల నీమది గ♦రంగ మికేమను
న్నపుఁజనువొందఁ జూచిన క్ష♦ణంబున నొండ
నృపవర యాలుబిడ్డల గ♦ణింపని సంపదలేల

వ. అని యోసరించు రాణివాసంహ
సుహృజ్జనుండైన మనోరంజనుం డరిభంజన

చ. వలపగు రూపురేఖగల♦వానిగఁ గోర
ల్లలితునిఁగోరుఁ దల్లి, శ్రుతి♦లక్ష్యర
త్కులజునిఁగోరు బంధుతతి, ♦ కూరిమి
కులు సరసాన్నభుక్తి మదిఁ♦గోరుదు

ఉ. అన్నియు నెన్న బ్రాహ్మణుని♦యందు సమగ్రతనుండు నీదు భా
గ్యోన్నతిదానపాత్రమగు ♦ నొండువిచారములేల బ్రాహ్మణుం
డన్నిటయోగ్యుఁ డీపరిణ♦యం బొనగూర్చుటకంటె భాగ్యమే
మున్నది శాస్త్రబంధుహిత♦ముఖ్యజగజ్జన సమ్మతంబగున్. 126

వ. అని యనుకూలవాక్యనైపుణ్యంబుగఁ బుణ్యంబు బ్రాహ్మణగణ్యంబగునట్లుగాఁ దనషాడ్గుణ్యపరిపూర్ణత్వంబున నామసార్థకత్వంబునొందింపుచు నిందింపులేని పొందింపుపల్కుల మెళ్కువం దెల్పిననిల్పు పనిగొల్పు సుళువునకు నెళవుపడి రాచమిన్న జన్నిగట్టుసామికై మోహంపుటొడ్డు కడ్డుగా దొడ్డముజ్జిడ్డునంబడ్డ తనబిడ్డ నూరార్పుచు నేర్పుననిట్లనియె. 127

ఉ. ఓ సరి బాల మేలుతన ♦ మంతలు వింతలుచేసె దేమె శా
బాసు బళా యిదేమె నగు♦బాటుగఁ బాటిలుఁ జాలుఁజాలు నీ
వాసి యెఱుంగఁజేసిన నె♦పంబిదిగాక నిజంబుగల్గునే
భూసురహింసఁ జేయుటలు♦పోలునె యే యుగమేలువారికిన్. 128

చ. అదియునుగాక నిన్నువిడ♦నాడుదునే మది నాదునోముసం
పదలనిధాన మీవనుచుఁ ♦ బ్రాణపదంబుగఁ బెంచి విద్యలొ
ప్పిదముగ నేర్పనం జదువఁ♦బెట్టి తుదిన్మది నీమనోరథం
బది సఫలంబుగాఁ బరిణ♦యంబు నయం బొనగూర్పకుందునే? 129

ఉ. తప్పొలెమావి మేలుతలి♦దండ్రులచాటులవార లిచ్చలే
చొప్పునఁగల్గు నల్లెఱుకఁ♦జూపఁగ జెప్పఁగరాని నిందబా
టొప్పిదమేల సేయనటు♦లుంపుము నీమదివచ్చునట్ల మే
లిప్పుడొనర్తు సంతసిలు ♦ మింత త్రిశుద్ధిగనమ్ము బాలికా. 130

వ. అని తనతనయ నతివినయ నయప్రియంబుల ననునయించి మంచితనంబునం దిగులుమాన్పి దిటంబుగూర్చి దిగిచి గారవించి దీవనలిచ్చి మచ్చికందల్లికందిచ్చి యంతిపురంబునకుంబంచి మంత్రిశేఖరయుతుండై హజారంబుఁబ్రవేశించి యచ్చటిజనంబులకు సకలంబుఁదెల్పిన వారలనల్పామోదకల్పకులై బ్రాహ్మణకల్యాణానుకూల్యంబు తనపాలివేల్పులట్ల నిల్పుచుఁ దన్నుమన్నించుటలెన్ని యన్నరేంద్రుండు కవీంద్రునిందోడ్కొనివి రమ్మనిన సకలస్వతంత్రుండైన మంత్రివరుండు హితపురోహితామాత్యజనంబులతోడఁ

జని భూతగణపరివృతుండైన సర్వజ్ఞునింబోలి సుభటగణయుతుండై యున్న భుక్కుండునిం గాంచి మొ్రొక్కుచుం దనకుమొ్రొక్కుచున్న కోటిపాల భటాదికంబున కుచ్చాటనం బనుగ్రహింపుచుం గ్రూరగ్రహావరోధనిర్ముక్త కళానిధిప్రతినిధియగు కళానిధిసన్నిధానంబున మేధారంజనుండగుచు మనోరంజనుండు ప్రాంజలియై యిట్లనియె. 131

శా. భూదేవోత్తమ నీమహత్త్వము జగ♦త్పూర్ణత్వముంబొందె ని
ర్వాదంబయ్యె భవత్కథారచన దు♦ర్వారోగ్రకోపప్రసా
దాదిప్రాభవశక్తికీశ్వరత నీ♦యందుద్భవిల్లెన్ సుఖ
శ్రీప్రైవ్రతమూర్తి వీవె సకలో♦ర్విన్సర్వకాలంబులన్. 132

‡ చ. నిరుపమధైర్యధుర్య గుణ ♦ నిశ్చలమానస నిర్మలప్రభా
వ రతివశీకృతాఖిలసు♦పర్వమహోన్నత భాసురాబ్ధిని
ర్భరపరమోత్సవాశయ శు♦భవ్రత బిల్హణసత్కవీంద్రశే
ఖర మదనాభిరామ నృప♦కాంతుఁ డచింతిత విస్మితాత్ముఁడై. 133

కం. భవదద్భుతనిశ్చలవై
భవమానసవృత్తిఁ దెలిసి ♦ పరమముదప్రా
భవమున భవునకుఁ దనుసం
భవనొసఁగిన శీలశైల♦పతి యితఁడనఁగన్. 134

కం. ధరలోన వినుతిగొనుటకు
వరమర్థింపుచును మిమ్ము ♦ వైభవలీలన్
వరచిహ్నంబులఁ దద్భా
పరమణిసన్నిధికిఁ గొంచు ♦ వడిరమ్మనుచున్. 135

కం. మమ్మనుబంచిన వచ్చితి
మమ్మానిసిఁజేని మనవి ♦ మన్నించిమదిన్
సమ్మదమునిూఅ మీారు శు
భమ్మనకుం దరలిచనుట ♦ పసిగొనవలయున్. 136

వ. అని వినయవాక్యసంపన్నతం బ్రసన్నునింగావించి మణిపల్యంకికాధిరూఢునింజేసి సకలజనంబులుగొల్వ మహోత్సవంబుగా బిల్హణుందోడ్కొని పురవీధి జనుచున్న మనోరంజనుంగని తగుజనంబులు సుజనగోష్ఠినిట్లనిరి. 137

కం. మానవనాయక రాజ్వర
మా నవవిభవైకపూజ్య♦మాన శ్రీసం
ధాన విధాన నిధానక
థానిపుణులుగారె సుప్ర♦ధానులు జగతిన్. 138

చ. ప్రథితగుణాఢ్యుఁడైన ద్విజ♦రాజకిరీటికి భూమిభృద్వరుం
డధికగుణాఢ్యమైన తన♦యామణి నిచ్చునటంచు సత్కృతిం
బ్రథితగుణాఢ్యుఁడైన ద్విజ♦రాజకిరీటికి భూమిభృద్వరుం
డధికగుణాఢ్యమైన తన♦యామణినిచ్చుట యుక్తమేకదా. 139

కం. గురునకుఁ గన్యాలాభము
పరమోచ్చపదంబు సర్వ♦భావములందున్
మఱికన్యకుఁ దద్రాజ్య
స్ఫురణకుఁ దగినట్టి వరుఁడు ♦ బుధుఁడరయంగన్. 140

చ. అని బహుభంగులన్ బురవ♦రాంతరశాంతరసాంతరంగస
జ్జనములు సూచుచున్ బలుకు♦సామెత లామెతగాఁగఁ బౌరవం
దనములుగొంచు రాజభవ♦నమ్ముఘనమ్ముగఁజేరి వాహసం
బనువుగడిగ్గి మంత్రియుతుఁ♦డై హితుఁడై సభఁజేరునంతటన్. 141

కం. రాజేంద్రుఁ డుచితగతిఁ గవి
రాజేంద్రునిగౌరవించి ♦ రత్నాసనవి
భ్రాజితుఁ జేసి బహువిధ
పూజల సంతుష్టిఁ గొలుపఁ ♦ బుధవరుఁడనియెన్. 142

శ్లో. ఆకల్పం విజయీభవ క్షితితలే త్వం సార్వభౌమోభవ
త్వంవిశ్వక్షితినాథవంద్య చరణ ద్వం ద్వారవిందోభవ
త్వంవైరిక్షితిపాలసైన్య నళినీ మత్తద్విపేంద్రో భవ
త్వంలక్ష్మీనిలయోభవ ప్రతిదినం సంకల్పసిద్ధోభవ. 143

వ. అని బ్రహ్మణుం డాశీర్వచనంబొసంగిన నుప్పొంగి ధరాధిపపుంగవుం డవ్విప్రపుంగవున కభిముఖుంబుగాఁ బ్రాంజలియై కవీంద్రా! తపశ్చలితవిబుధేంద్రా! జయఃవచనరచనామహేంద్రా! నిస్తంద్రమనోవిభవసాంద్రా! బ్రహ్మకులచంద్రా! భవత్ప్రభావంబుఁ దెలియ సంకల్పించి కల్పించిన మదీయ

కృత్రిమోపాయంబు నిస్తరింపం జతురాస్యుండవైన నీకుంగాక యన్యులకు శక్యంబగునే! మత్పుత్రికకుం గురుండవగుట నీవాసి వాణీవిలాసి కైనవచ్చుఁ గావునఁ బరిణయోత్సవంబున సమర్పింపందలంచియున్నవాఁడ నిందుల కందఱ కనిందితమతానుసరణంబుగా భవన్మనోంగీకరణం బనుగ్రహింప వలయు నిదియే మదీయాంతఃకరణంబునకు సర్వాశిషోపరివర్తనప్రసాదకరణం" బని విభుండభ్యర్థించిన సభ్యులానందాభ్యుదయలబ్ధులై బ్రాహ్మణానుమతంబుగా సమ్మతంబుఁ దెల్ప ననల్పామోదితుండై నృపకుంజరుండు మనోరంజనునిఁ దత్కార్యనిర్వాహకునిగా నియమించి మహామౌహూర్తికశాస్త్రివితమనోరథపూర్తంబగు నొక్క సుముహూర్తంబు నిశ్చయించి తాంబూలగంధమాల్యాంబరాదుల బ్రాహ్మణపూర్వకంబుగ నుచితపరికారంబుల నందఱ నిజమందిరంబులకు వీడ్కొల్పిన బ్రాహ్మణుండు తనగృహంబు ప్రవేశించి నిజవధూరత్నంబున కేతత్ప్రియత్నంబు సకలంబుఁ దెల్పిన సాధ్వీవతంసంబు గావున భవదీయానుకూల్యంబు మదీయ సాఫల్యంబని మానసైక్యంబు నొంది రంత భూకాంతుండంతఃపురంబునకేగి కృతనిశ్చయం బెఱింగించిన బాలికాతిలకంబు దొలకరిబలుకరింపునకుం గులుకు నెమ్మికొమ్మచందంబున నందంబుఁ జూపుచున్న సన్నఁ దనవల్లభికి నుల్లాసంబు వెల్లిగొల్పుచున్న రామిన్న నగరుశృంగారించుటకుఁ దగినవారి నియోగింపుచుఁ దనబంధునికరంబులకు విద్వద్బృందంబులకును శుభలేఖార్థంబులు బంపించె నయ్యవసరంబున. 144

సీ. మణిమందిరములు ని◆ర్మలభాసురచ్ఛాయ
లొనరఁ దళుక్కుమెఱుంగు ◆ లొరపుఁజేసి
నెలరాలజగతి వె◆న్నెలనిగ్గు లిడఁదీర్చి
పవడంపు బోదెగం◆బములునిల్పి
తెలిముత్తియపు జాల◆రులుగూర్చి పచ్చరా
గమితోరణముల మే ◆ ల్కట్లమర్చి
సిరులహొందగటు జ◆ప్పర మొప్పుగను నిల్పి
తళుకునున్గ్రొత్త చి◆త్తరువు నేర్చి

తే. గీ. గమ్మనెడి తావిపన్నీరు ♦ గలియఁజల్లి
కొల్వుకూటంబులకు వింత♦ చెల్వు చల్వ
పందిరుల నందముగనిల్పఁ ♦ బరిణయంపు
దగవు వగగుల్క యా రాచ♦నగరు వెలసె. 145

ఉ. పౌరులసందడింపు పొలు♦పారెడిరచ్చల రాజవీథుల
న్మీఱుపసిండిఘంటికల ♦ మించినమంగళతూర్యవాద్యముల్
భోరుకలంగ మేలు సరి♦పోల్పఁగ నెక్కడ నీడులేని సిం
గారముగల్గి యాపురము ♦ కాపురమయ్యె విలాసలక్ష్మికిన్. 146

చ. వలనగు కానుకల్గొనుచు ♦ వచ్చిరి తచ్ఛుభదర్శనార్థులై
మలద కరూశ సాళ్వ శక ♦ మాళవ కేరళ చోళ గౌళ కో
సల కరహాట లాట కురు♦జాంగల సింధు యుగంధ రాంధ్ర కుం
తల వసుధాతలేంద్రులు బు♦ధాప్తపురోహిత మంత్రియుక్తులై. 147

చ. స్వకులబలాప్తత న్నపరి♦వారముగాఁ జనుదెంచి నట్టివా
రికి విడుదుల్నయింప సవ♦రించి మహీసురకోటికెల్ల మ
చ్చికఘటియించి షడ్రసవి♦శేషమనోజ్ఞచతుర్విధాన్న దా
నకలనఁ దృప్తిఁజేసిరి జన♦ప్రియనిశ్చలకార్యతత్పరుల్. 148

వ. మఱియు, మంగళాచారవిధిపూర్వకంబుగా సకలసన్నాహసంపన్నులై యున్న యనంతరంబ సంధ్యాకాలంబగుటయు రవిపశ్చిమాచలంబుఁ జేరిన. 149

మ. ధరణీశప్రతిఘాకృతిన్ దపనుఁ డం♦తం గ్రుంకె గన్యానురా
గరసప్రక్రియ సంజమించెఁ దదయు♦క్తాక్షేపకాజ్ఞానభా
వరతిన్ జీఁకటిగప్పెమంత్రిశుభవా♦గ్వర్ణప్రభన్ దారలం
కురిలెన్ బిల్వణుఁ డట్ల రాజెసఁగె లో♦కుల్ మెచ్చి కీర్తింపఁగన్. 150

చ. వితరణియైనచో బుధక♦వీంద్రగురుద్విజరాజమండలం
బతిశయశోభ చే నలరె ♦ నంత ననంతవిలాససంపదల్
కుతుకమెనర్చి పూర్ణరస♦గుంభితుఁడై భువనాధినాథుఁ డ
ద్భుతగతితోడ మిన్నొరసెఁ ♦ బొంగుచు వాహినులంటికొల్వఁగన్. 151

వ. అయ్యవసరంబున నుభయపక్షంబులవార లతికుతూహల భరితులై గంధమాల్యాంబరాభరణ తాంబూలాది మంగళద్రవ్య సంసేవ్యులై తమతమ వాహనంబులతోడ నుభయపార్శ్వంబుల నలంకృతులగుచు నేగుదేర బిల్వాణుం డమూల్యకల్యాణగుణమణిగణ కిరీట కేయూరహార కుండల కటకకంకణాఙ్గుళ్యముద్రికాది విభూషణ భూషితుండై రెండవపుండరీకాక్షుండునుం బోలె మదోద్దండ వేదండాధిరూఢుండగుచుఁ గరదీపికా సహస్రంబులు వెలుంగగ జతురంగస్యందన సుభటకేతన చ్ఛత్రచామరప్రముఖ లాంఛనంబు లెచ్చరింపఁ బటహకాహళభేరీమృదంగాది పంచమహా వాద్యంబుల నవద్యహృద్యంబు నెఱపఁ బద్యగద్యంబుల వందిమాగధులు గీర్తింప మందగమనంబున రాజమార్గంబు నిర్గమింప నెడనెడ మాంగళ్యదేవతాగణ్య శృంగారానుగుణ్య లావణ్య పణ్యాంగనాగీతనృత్యాభినయభావజీవంబులగు ప్రియవిలోకనాను భావంబులఁ బుటంబెగయు నాయికా మందహాసంబుల నోసరించు చంద్రజ్యోతుల నిజచంద్రజ్యోతులని మేఁతలానుట కేతెంచు నెదుట నదటులిడు నవక్రచక్రాకారంబులగు నగ్నియంత్రంబులం గని నడుమ వడంగు విధుంతుదుని సంతసములన మిన్నుదన్ని కన్నన నన్నగిల్లు తారకా బాణంబులు దారసించు నను నెరవున బెరుసుఁజేయు జనులనొరసికొన బిరుసులు రవణించిన నెరసుల మోఱసి పరుసఁ గొసరెగయు శీతఘుటికాగ్ని యంత్రంబుల కీర్తిప్రతాపాను వర్తనంబులు దెలుప నపరిమితానందప్రదంబై యుత్సవంబు సర్వోచ్చపదంబయ్యె నయ్యవసరంబున. 152

కం. గుఱుతుగల పూర్ణతిలకను
గురువరుఁడై నట్టి పెండ్లి•కొమరునిఁ జూడన్
గురుసౌధము లెక్కిరి బి
త్తరు లత్తఱిఁ దత్తరంపుఁ • దమి గములగుచున్. 153

చ. చెలువుగనోర్తు మేలుగయి•నేత్ర తటి న్గుఱుతూని జిల్గుకం
చెల ముడికొల్పమాని కవి•శేఖరుఁ జూడఁగవచ్చెఁ దన్మనో
లలితవిలోకనాంబుజము•లన్ గొసఁబై కొనరెక్కలార్చుచున్
బలుదమకించు జక్కవల•పాల్పగు పద్మినిగా గణింపఁగన్. 154

చ. తిలకము దిద్దుకొంచు సుద♦తీమణియోర్తు శలాకఁబూని క్రొం
దళుకు మెఱుంగుటద్దమునఁ ♦ దత్ప్రతిబింబముదోఁప నిల్చె మా
యలవలరాజు చక్కదన♦మారసి డాయఁగలేక కొంత రూ
పెలమిగ్రహించి యుస్టిపట♦మిచ్చిన వచ్చిన మోహినీక్రియన్ 155

చ. అలచెలియిచ్చు చేమదుపు♦లందుచు పీడెఁపుటాకుతీపు పొం
పులఁ గవిరాజుఁజూచె నొక♦ముగ్ధలగుమ్మ మరుండు బిల్వఁబుం
గెలిచితినంచుఁ బంపిన స♦ఖీకృతశోభనలేఖలందుచున్
దెలియఁ బఠింపుచున్న రతి♦దేవియన న్నయనోత్సవంబుగన్ 156

చ. అలిపరివర్తితాంతర స♦హస్రదళాంబుజకోశ మొక్కకో
మలి గదలింపుచుం ద్విజక♦మారుని జూడఁగవచ్చె వేయినో
ములు దగనోచియైన సరి♦పోలరు వీరల దంపతిత్వపూ
జలనని ఘంటఁగట్టి విడఁ♦జాటఁగవచ్చు విలాసలక్ష్మిగన్. 157

సీ. మోహంపుటురులుపై ♦ ముంపుటొప్పుగగొప్ప
మాని సందిటనెరు♦ల్పూనె నొకతె
విరిదండగుప్పుచు ♦ మఱచి నవ్వులనిండె
ననికోరసరిమెడ ♦ నునిచెనొకతె
చోటులేమికి "వింత♦మాటరమ్మని" చేరి
పిలిచి తానచ్చట ♦ నిలిచెనొకతె
కనురెప్పలిడక త♦ప్పనిచూడ్కి వలగొంచు
మరునికిల్బొమ్మ వై♦ఖరులనొకతె
తే. గీ. తమినిజూడగవచ్చె చి♦త్తమునమెచ్చి
పుణ్యసతులందుఁ గొందఱు ♦ పొసఁగ మంత్ర
పుష్పలాజాక్షతలు చల్లి ♦ పొగడి గార
వించి నివ్వాళులిచ్చి దీ♦వించిరెలమి. 158

వ. ఇట్లు సకలజనానందగమనంబగు మందగమనంబున రాజమార్గంబున నిర్గమించి నిరర్గళశోభనారంభసంరంభ సంభృతశాతకుంభకుంభసంభార రంభాస్తంభశుంభద్ద్వారంబగు సింహద్వారంబు గడచి గజేంద్రావతరణంబు గావించి మణిపాదుకావహనం బొనరించి సప్తకక్ష్యాంతరంబులు నిర్వర్తించి

విలాసినీదత్తనీరాజనపూర్వకంబుగా చంద్రశాలాకదంబచుంబిత రాజధామం
బగు రాజధామంబుఁ బ్రవేశించి పురోహితప్రేరణంబునఁ గవివరుండు మంగళ
స్నానసన్నద్ధుండయ్యె నయ్యవసరంబున. 159

చ. సరులు పెనంగ లేఁజెమట ♦ జాలుగొనంగఁ గురుల్వీడంగఁ గ్రొ
వ్విరులురలంగఁ బైఁటచెఱ♦గింపుగ నోరసిలంగ గుబ్బచ
న్మొఱ్ఱగులెఱుంగఁ గౌనుజవ♦మించుకెసంగ సగిల్మెంగగా
గురుకుచయోర్తు బిల్వఁ ఖున♦కుం దలయంటె ననేకభంగులన్. 160

తే. గీ. ఎలమిఁదలయంటి నలుగిడి ♦ జలకమార్చి
చలువవలువలొసంగి భూ♦షణములునిచి
కజ్జలముదీర్చి వలితావి♦కల్పమలఁది
నుదుట శోభనతిలకంబు ♦ కుదురుపఱచి. 161

కం. నునునెఱుఁగుటద్ద మెదుటను
గనఁజేయఁగ మెచ్చి మచ్చి♦కనుదీవెనఁ బ్రా
ఙ్గని పంచమహావాద్య
ధ్వనులంతట భోరుకలఁగఁ ♦ దత్సమయమునన్. 162

వ. వచ్చి శోభనాలంకారసంపాదికయగు వివాహవేదికంజేరి పరిచిత
వేదపాఠంబుతో రత్నపీఠంబున నధిష్ఠించిన యనంతరంబ. 163

సీ. రసజాతమైజ్యోత్స్న ♦ నెసఁగు కైరవియన
మంగళస్నానయై ♦ మడుఁగుగట్టి
సుమగుచ్ఛముల పరా♦గముగప్పు చొప్పున
తగటుగంచెల గుత్త♦ముగ లగించి
కమనీయకుసుమిత ♦ కల్పవల్లికపోల్కె
కనదలంకార సం♦గతిదనర్చి
సౌభాగ్యఫలవిలా♦సముగ శృంగారతి
లకలలాటమున భా♦షికముమెఱయ

తే. గీ. ఘనచకోరవిశృంఖలా♦ర్గళకలాప
లీలనయనాంచలాంజన ♦ రేఖలమర

జడమడమ ద్రొక్కఁబడు నను ♦ నడిని మంది
రమున జనుదెంచె సఖులతో ♦ రాజకన్య. 164

సీ. పలుమారు నునుదంత♦పంక్తికాంతులు దళ్కు
చెక్కుల కొకవింత ♦ లెక్కసేయ
వలపువీడెపు కావి♦వదనానతంబున
దరులకప్రపు వ♦సంతంబుఁజిల్క
కలికి క్రేగంటిచూ♦పుల ప్రాపుగొని సిగ్గు
తొలుదొల్త సిరిజాడ ♦ తొంగిచూడ
తమకించినిలుచు బి♦త్తరముచూపరుల మి
టారంపుటువ్విళు ♦ లూరఁజేయ

తే. గీ. మంత్రములుదప్పి తంత్రము ♦ ల్మఱచివృద్ధ
విప్రులాలించి వినుచుండ ♦ వివిధగతుల
కంచుగంటలుమ్రోగిన ♦ గరిమ కొంద
ఱంగనలుగూడి పాడిరి ♦ మంగళములు. 165

తే. గీ. పొసఁగనప్పుడు మధుపర్క♦పూర్వకముగ
సత్కరింపుచు నర్ఘరా♦జ్యంబుతోడఁ
దదనుకూలత సాలంకృ♦తముగఁ గన్య
నల్లునకు ధారవోసె భూ♦వల్లభుండు. 166

వ. తదనంతరంబున. 167

ఉ. కళలింపొందఁగఁ గట్టె బిల్లఁడు రా♦ట్కన్యాగళక్షోణి మం
గళసూత్రంబు తదుజ్జ్వల స్తనరథాం♦గద్వంద్వమానందకం
దళతన్ రాజకరా ప్తిదు స్తరమయు♦ క్తంబంచు సన్మిత్రల
క్ష్యలసద్భావమెఱుంగఁ జేయఁదగు భా♦స్వత్వప్రతికామైత్రిగన్. 168

చ. సురుచిరలీల లేనగవుఁ♦జూపుల మోమరవంచి పైఁటజా
టరముఁదిమోటు చన్గవ మి♦టారపుఁ బూటమి బోటమిన్ వధూ
వరులు కరంబులెత్తి తల♦బ్రాలు శిరంబులనించుటొప్పె న
ట్లురువడి సౌఖ్యవార్ధినిట ♦ నోలలమించుటగా గణింపఁగన్. 169

వ. మఱియుఁ బాణిగ్రహణంబును నగ్నిప్రతిష్ఠాపనంబును నాజ్యాది హోమంబులును నగ్నిప్రదక్షిణంబును నాత్మారోపణంబును మొదలగు శుభకృత్యంబుల వైవాహికదీక్షాపంచవాసరంబులు గడచిన సంతుష్టాంతరంగుండై మదనాభిరామభూకాంతుం డవ్వధూవరులకు ననేకదివ్యాంబరాభరణాదికంబు లరణంబుగా నొసంగి యసాధారణంబుగా నల్లునకు మఱియును. 170

తే. గీ. మణికిరీటంబు కలువరా♦మానికంబు
గండపెండేరమును రత్న♦కుండలములు
పచ్చరాగద్దె దంతపు♦రచ్చుబల్ల
మొసలివాగూర్పుపిడి మేలు♦లెనఁగువాలు. 171

వ. మఱియు హర్మ్యవరసింహతలాటాదిబిరుదములును మాతంగతురంగశతాంగసుభటాది చతురంగబలంబులును ధనురాదిసాధనంబులును దాసదాసీజనంబులును ధనధాన్యధేనుమంత్రియుతంబుగా నర్ధరాజ్యంబును సమర్పించి వసంతోత్సవంబు నిర్వర్తించి బంధుమిత్రామాత్యకవిగాయకాది జనంబులకు నభీష్టార్థంబులొసంగి శుభదర్శనాగతదశార్ణాది దేశాధిపతుల విద్వత్ప్రముఖుల నతివినయసంపదలం బూజించి సముచితోపహారంబులఁ బరివారంబులతో ననిపి వినూత్నచిత్రరత్నభిత్తికాముకురమణిదీపికా కుసుమసుగంధబంధురమనోహరతల్పకల్పకాది శోభనవస్తువిస్తరాతిసుందరంబగు కేళికా సౌధమందిరంబున గృహప్రవేశంబుఁ జేయించి మదనోత్సవసూచనంబుగాఁ గల్యాణదీక్షాదోరకమోచనంబుగావించి వృద్ధజనానుమతంబున లౌక్యానుసరణంబుగా వధూవరులనైక్యంబునొందించిన సౌఖ్యార్ణవంబునం దేలుచు సురతావసానమంగళతరంగంబగు చతురపరిసంగవశంబున విలాసవతికిఁ దన్మనోహరుం డిట్లనియె. 172

సీ. "సతులు మాటమాధుర్య♦చతుర లగదే" "యౌర!
యామాటబల్కు మేలగునటోయి"
"జవరాండ్రు కుటిలప్ర♦చారు లగదే" "యౌర!
నడిమిటిమాట మా♦నవుగదోయి"

"బింబోష్ఠు లవసర♦ప్రియమతుల్గదె" "యూార!
యసమానచతురుఁడ ♦ వగుదువోయి"
"జవ్వనుల్ శోకభా♦జనులు గదే" "యూార!
కలగించిపల్కుట ♦ గలదటోయి"

తే. గీ. "గరిత లాత్మనిజోద్యముల్ ♦ గదవె" "యూార!
సహితంబుగఁ బల్కుట ♦ నెరవటోయి"
"వెలఁది నీవానిపల్కుట ♦ వింతగలదె"
"మేలువాదగఁబఱచి న♦న్నేలుసామి" 173

చ. అని చతురోక్తులొండొరుల ♦ నాడుచుఁ బాడుచుఁ బ్రేమలొక్కటై
పెనఁగొన దంపతుల్విధిని ♦ బేర్కొని కోర్కెఫలింప సంపదల్
దనరుచునుండి రిట్లొకవి♦ధంబున నిండెడఁబాటుగొన్న తో
ల్నెనరొనగూడుటెన్న ధర♦ణీస్థలి నింతటిభాగ్యమున్నదే. 174

వ. మఱియును. 175

సీ. సుమధూళిరమితాళి ♦ సుమపాళి హిమధూళి
తరుహేళి మితకేళి ♦ ధరములందు
తరఫూటమిగ జాటు ♦ మరుపోటరులపాట
సిరిఫూట విరిదోఁట ♦ మరువులందు
నునుదమ్మలను గ్రమ్మ♦కొన గమ్మరను దెమ్మె
రలు గుమ్మరిలు దమ్మి♦కొలకులందు
సరిలేనిసిరివోని ♦ నెరిమానికములాని
మెఱుపూనిన కడాని ♦ మేడలందు

తే. గీ. జోడుపీడక మరుకేళిఁ ♦ గూడియాడి
పాడి తనపొందు నెనరొందు ♦ పనులయందు
మఱపి రాజకుమారికా ♦ మదనరాజ్య
భరితుఁడై యుండె బిల్హణ ♦ పండితుండు. 171

మ. అనుకూలవ్రతధర్మనీతియుత భా♦ర్యాయుగ్మమింపొంద శో
భనసంతాన ధనాధినాథహిత సం♦పత్ప్రాపితానందవ

ర్ధన, కేళీపరిపూర్ణతృప్తిమతియై ♦ తద్భూమిభృత్పట్టణం
బుననుండెన్ ద్విజరాజమాళి యది యొ♦ప్పన్గాదె తన్మూర్తికిన్. 177

సీ. అని యిట్లు పూర్వోక్త♦రాంకిత వోరపం
చాశత్సమాహ్వయో♦జ్వల రసప్ర
ధాన కావ్యకథావి♦ధాన కల్పనచమ
త్కార గౌరవసూక్తి ♦ గలుగనాదు
నేర్పుకొలంది యామి♦నీపూర్ణతిలకావి
లాసం బనంగ నాంధ్ర ♦ రచనఁగూర్చి
భవదంకితమొనర్చి ♦ భక్తితాత్పర్యాన
మర్పణఁజేసితి ♦ మనవిచిత్త

తే. గీ. గింపు దీని సమస్తది♦గ్దేశరాజ
సభలయందు వసించి యా♦చంద్రతార
కముగ వర్ధిల్లఁజేయ ర♦క్షకుఁడ వీవె
భూమిజానందసాంద్ర శ్రీ♦రామచంద్ర. 178

కం. ధర్మార్థకామమోక్ష ద
ధర్మాంచితధర్మధర్మ♦ధర్మాంతకళా
ధర్మాయత దోస్సారను
ధర్మార్జితధామ రామ ♦ తారకనామా. 179

చ. జయజయ దేవదేవ దృఢ♦సంగరసంగరసైకలోక దు
ర్జయభయరూప కర్బురపు♦రక్షణనక్షణ నాకలోకహృ
త్ప్రియ నయతత్త్వసత్త్వగుణ♦ధీర సుధీరతమోక్షదక్ష పు
ణ్యయుతయశస్సనాథ రఘు♦నాథ సుధావసుధాకథాభిధా. 180

♦ వసంతతిలకావృత్తము ♦

ధారాధరాదిరిపువృత్రవితాన భాస్వ
ద్ధారా ధరాయుధమహోత్సవతల్పహస్తా
ధారాధరాసురభయోదయ దానదక్షా
ధారాధరాభినుత సుందరధామ రామా. 181

మ. హనుమల్లక్ష్మణతత్కనిష్ఠభరతా♦ర్యాపత్యకై కేసినం
దన తారాసుతజాంబవద్ఘనులు ప్రా♦ప్తప్రాక్పరై న్యర్థపా
వని దిజ్మారుతముఖ్యకోణముల గొ♦ల్వన్ సీతహామాంకమం
దెనయ న్మధ్యనెసంగు రాముని సుఖా♦ప్తిన్ గొల్చెదన్ శ్యామునిన్. 182

—: గద్యము :—

ఇది శ్రీరామచంద్ర గురుకరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ సకలసంపూర్ణ
సరస శృంగారరసధారాధర మాధురీధురీణాలంకారితాంధ్రగీర్వాణ
కవితావిలాస విచిత్రవిలసితాపస్తంభసూత్ర భారద్వాజ సగోత్ర
పవిత్ర చెల్లపిళ్లకుల సుధార్ణావరాకానిశాకర యశోధురంధర ధరా
మరప్రవర్య రామయ నామార్యపౌత్ర కామకవిసుపుత్ర సకల
విద్వజ్జనవిధేయ నరసయ నామధేయప్రణీతంబైన యామినీ
పూర్ణతిలకావిలాసంబను శృంగారరస మహాప్రబంధంబు
నందు సర్వంబును షష్ఠాశ్వాసము
సంపూర్ణము.



# వెలువరింపవలసిన శృంగార ప్రబంధములు.

1. గోపాల లీలాసుధాలహరి —
— ప్రయాగ కామేశ్వరకవి.
2. అహల్యాసంక్రందన విలాసము —
— వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులు.
3. కుబ్జా కృష్ణవిలాసము —
— అక్కన్న ప్రెగడ హరిదాసు.
4 గాధేయోపాఖ్యానము —
— అనంతార్యుడు.
5. నాగ్నజితీ పరిణయము —
— వల్లూరి నరసింహకవి.
6. లక్ష్మీనృసింహవిలాసము —
— పైడిపాటి వెంకటనరసింహకవి.
7. మదనమోహినీ విలాసము —
— తక్కెళ్లపాటి లింగకవి.
8. రంభానలకూబర విలాసము —
— వేంకటస్వామి.
9. రాధామాధవ సమాగమము —
— యడవల్లి వెంకటపతి.
10. పల్లవీపల్లవోల్లాసము —
— మాడభూషి నరసింహకవి.
11. శశిరేఖాపరిణయము —
— వెంకటరంగకవి.

రాఁబోవు గ్రంథము

# గోపాల లీలా సుధాలహరి

ప్రయాగ కామేశ్వర కవికృతము



ఇది మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధము.

ఉదాహరణ పద్యములు హంసవింశతిలోఁ

బ్రకటించితిమి గాన నిచ్చట మఱల

ముద్రింప మానితిమి.





1941 సెప్టెంబరు మాసమున

బ్రకటింతుము.